శ్రీః

శ్రీకులశేఖరాళ్వార్లకృతా

# ముకుందమాలా

రామోరావిరచితా

## మృణాళినీవ్యాఖ్యా



కారణికః

**రావి మోహనరావు,**

**510, ప్రైడ్ బ్లాక్, ప్లాటినమ్ కౌంటీ, గోరంట్ల, గుంటూరు–522034**

శ్రీః

శ్రీ కులశేఖరాళ్వార్లకృతా

# ముకుందమాలా

రామోరావిరచితా

మృణాళినీవ్యాఖ్యా

*ప్రథమముద్రణ : 24-05-2022*

**50th Wedding Anniversary Edition of**

**Ramora & R.Krishna Kumari**

ప్రతులు : ***200***

పేజీలు : ***164***

వెల రూ. : అమూల్యము



**Ravi Mohana Rao**
**510, Pride Block, Platinum County**
**Opp. Hosanna Mandir, Gorantla,**
**GUNTUR - 522034, Andhra Pradesh**
**Cell : 9440115411**

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : **9573711454**

***Printed at -***
Mohan Publications
Rajahmundry.

శ్రీః

శ్రీకులశేఖరాళ్వార్లకృతా

# ముకుందమాలా

శ్లో॥ శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుణ్ఠనకోవిదేతి ।
నాథేతి నాగశయనేతి జగన్నివాసే -
త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకున్ద! ॥ 1

శ్లో॥ జయతు జయతు దేవో దేవకీనన్దనోఽయం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః ।
జయతు జయతు మేఘశ్యామలః కోమలాఙ్గో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః ॥ 2

శ్లో॥ ముకున్ద! మూర్ధ్నా ప్రణిపత్య యాచే
భవన్తమేకాన్తమియన్తమర్థమ్ ।
'అవిస్మృతిస్త్వచ్చరణారవిన్దే
*భవే భవే మేఽస్తు భవత్ప్రసాదాత్ ॥'* *3*

శ్లో॥ నాహం వన్దే తవ చరణయోర్ద్వన్ద్వమద్వన్ద్వహేతోః
కుమ్భీపాకం గురుమపి హరే! నారకం నాపనేతుమ్ ।
రమ్యా రామా మృదుతనులతా నన్దనే నాపి రన్తుం
భావే భావే హృదయభవనే భావయేయం భవన్తమ్ ॥ 4

శ్లో॥ నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్! పూర్వకర్మానురూపమ్ ।
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాన్తరేఽపి
త్వత్పాదామ్భోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు ॥ 5

శ్లో॥ దివి వా భువి వా మమాస్తు వాసో
నరకే వా నరకాన్తక! ప్రకామమ్ ।
అవధీరిత-శారదారవిన్దౌ
చరణౌ తే మరణేఽపి చిన్తయామి ॥ 6

శ్లో॥ కృష్ణ! త్వదీయపదపఙ్కజపఞ్జరాన్త -
మద్యైవ మే విశతు మానసరాజహంసః ।
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కణ్ఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే ॥ 7

శ్లో॥ చిన్తయామి హరిమేవ సన్తతం
మన్ద-మన్ద-హసితాననామ్బుజమ్ ।
నన్దగోప-తనయం పరాత్పరం
నారదాదిమునిబృన్దవన్దితమ్ ॥ 8

శ్లో॥ కరచరణసరోజే కాన్తిమన్నేత్రమీనే
శ్రమముషి భుజవీచివ్యాకులేఽగాధమార్గే ।
హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం
భవమరుపరిఖిన్నః ఖేదమద్య త్యజామి ॥ 9

శ్లో॥ సరసిజనయనే సశఙ్ఖచక్రే
మురభిది మా విరమస్వ చిత్త! రన్తుమ్ ।
సుఖతరమపరం న జాతు జానే
హరిచరణస్మరణామృతేన తుల్యమ్ ॥ 10

శ్లో॥ మా భీర్మన్దమనో విచిన్త్య బహుధా యామీశ్చిరం యాతనా
నామీ నః ప్రభవన్తి పాపరిపవస్స్వామీ నను శ్రీధరః ।
ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం ధ్యాయస్వ నారాయణం
లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిన్న క్షమః ॥ 11

శ్లో॥ భవజలధిగతానాం ద్వన్ద్వవాతాహతానాం
సుతదుహితృకలత్రత్రాణభారార్దితానామ్ ।
విషమవిషయతోయే మజ్జతామప్లవానాం
భవతు శరణమేకో విష్ణుపోతో నరాణామ్ ॥ 12

శ్లో॥ భవజలధిమగాధం దుస్తరం నిస్తరేయం
కథమహమితి చేతో మా స్మ గాః కాతరత్వమ్ ।
సరసిజదృశి దేవే తావకీ భక్తిరేకా
నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్ ॥ 13

శ్లో॥ తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులే చ ।
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామ -
న్పాదామ్భోజే వరద! భవతో భక్తినావం ప్రయచ్ఛ ॥ 14

శ్లో॥ మా ద్రాక్షం క్షీణపుణ్యాన్ క్షణమపి భవతో భక్తిహీనాన్ పదాబ్జే
మా శ్రౌషం శ్రావ్యబన్ధం తవచరితమపాస్యాన్యదాఖ్యానజాతమ్ ।
మా స్మార్షం మాధవ! త్వామపి భువనపతే! చేతసాఽపహ్నువానాన్
మా భూవం త్వత్సపర్యావ్యతికరరహితో జన్మజన్మాన్తరేఽపి ॥ 15

శ్లో॥ జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వన్ద్వ! సమర్చయాచ్యుతకథాశ్శ్రోత్రద్వయ! త్వం శృణు।
కృష్ణం లోకయ లోచనద్వయ! హరేర్గచ్ఛాఙ్ఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ! ముకున్ద-పాద-తులసీం మూర్ధన్నమాధోక్షజమ్॥ 16

శ్లో॥ హే లోకాశ్శృణుత ప్రసూతిమరణవ్యాధేశ్చికిత్సామిమాం
యోగజ్ఞాస్సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః।
అన్తర్జ్యోతిరమేయమేకమమృతం కృష్ణాఖ్యమాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణమాత్యన్తికమ్ ॥ 17

శ్లో॥ హే మర్త్యాః! పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవమాపదూర్మిబహులం సమ్యక్ప్రవిశ్య స్థితాః ।
నానాజ్ఞానమపాస్య చేతసి నమో నారాయణాయేత్యముం
మన్త్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః ॥ 18

శ్లో॥ పృథ్వీ రేణురణుః, పయాంసి కణికాః, ఫల్గుః స్ఫులిఙ్గో లఘు-
స్తేజో, నిశ్శ్వసనం మరుత్తనుతరం, రన్ధ్రం సుసూక్ష్మం నభః ।
క్షుద్రా రుద్రపితామహప్రభృతయః కీటాస్సమస్తాస్సురా(ః)
దృష్టే యత్ర స తావకో విజయతే భూమాఽవధూతావధిః ॥ 19

శ్లో॥ బద్ధేనాఞ్జలినా నతేన శిరసా గాత్రైస్సరోమోద్గమైః
కణ్ఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణబాష్పామ్బునా ।
నిత్యం త్వచ్చరణారవిన్దయుగలధ్యానామృతాస్వాదినా -
మస్మాకం సరసీరుహాక్ష! సతతం సమ్పద్యతాం జీవితమ్ ॥ 20

శ్లో॥ హే గోపాలక! హే కృపాజలనిధే! హే సిన్ధుకన్యాపతే!
హే కంసాన్తక! హే గజేన్ద్రకరుణాపారీణ! హే మాధవ! ।
హే రామానుజ! హే జగత్త్రయగురో! హే పుణ్డరీకాక్ష! మాం
హే గోపీజననాథ! పాలయ పరం జానామి న త్వాం వినా ॥ 21

శ్లో॥ భక్తాపాయభుజఙ్గగారుడమణిస్త్రైలోక్యరక్షామణి -
ర్గోపీలోచనచాతకామ్బుదమణిస్సౌన్దర్యముద్రామణిః ।
యః కాన్తామణిరుక్మిణీఘనకుచద్వన్ద్వైకభూషామణిః
శ్రేయో దేవశిఖామణిర్దిశతు నో గోపాలచూడామణిః ॥ 22

శ్లో॥ శత్రుచ్ఛేదైకమన్త్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమన్త్రం
సంసారోత్తారమన్త్రం సముపచితతమస్సంఘనిర్యాణమన్త్రమ్ ।
సర్వైశ్వర్యైకమన్త్రం వ్యసనభుజగసందష్టసన్త్రాణమన్త్రం,
జిహ్వే శ్రీకృష్ణమంత్రం జప జప సతతం జన్మసాఫల్యమన్త్రమ్। 23

శ్లో॥ వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీసఞ్జీవనైకౌషధమ్ ।
భక్తాత్యన్తహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మనః! శ్రీకృష్ణదివ్యౌషధమ్ ॥ 24

శ్లో॥ ఆమ్నాయాభ్యసనాన్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహం
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయస్సర్వే హుతం భస్మని ।
తీర్థానామవగాహనాని చ గజస్నానం వినా యత్పద-
ద్వంద్వామ్భోరుహసంస్మృతిం విజయతే దేవస్స నారాయణః ॥ 25

శ్లో॥ శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం
కే న ప్రాపుర్వాఞ్ఛితం పాపినోఽపి ।
హా! నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిం -
స్తేన ప్రాప్తం గర్భవాసాదిదుఃఖమ్ ॥ 26

శ్లో॥ మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే!
మత్ప్రార్థనీయమదనుగ్రహ ఏష ఏవ ।
త్వద్భృత్యభృత్యపరిచారకభృత్యభృత్య -
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ! ॥ 27

శ్లో॥ నాథే నః పురుషోత్తమే త్రిజగతామేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి ।
యం కఞ్చిత్పురుషాధమం కతిపయగ్రామేశమల్పార్థదం
సేవాయై మృగయామహే నరమహో! మూఢా వరాకా వయమ్ ॥ 28

శ్లో॥ మదన! పరిహర స్థితిం మదీయే
మనసి ముకున్దపదారవిన్దధామ్ని ।
హరనయనకృశానునా కృశోఽసి
స్మరసి న చక్రపరాక్రమం మురారేః ॥ 29

శ్లో॥ త్వత్త్వం బ్రువాణాని పరం పరస్మా- (11) ఇంద్రవజ్రా
న్మధు క్షరన్తీవ సతాం ఫలాని । (11) ఉపేంద్రవజ్రా
ప్రావర్తయ ప్రాఞ్జలిరస్మి జిహ్వే! (11) ఇంద్రవజ్రా
నామాని నారాయణగోచరాణి ॥ (11) ఇంద్రవజ్రా 30

శ్లో॥ ఇదం శరీరం పరిణామపేశలం
పతత్యవశ్యం శ్లథసన్ధిజర్జరమ్ ।
కిమౌషధైః క్లిశ్యసి మూఢ! దుర్మతే!
నిరామయం కృష్ణరసాయనం పిబ ॥ 31

శ్లో॥ దారా వారాకరవరసుతా తే తనూజో విరిఞ్చిః
స్తోతా వేదస్తవ సురగణో భృత్యవర్గః ప్రసాదః ।
ముక్తిర్మాయా జగదవికలం తావకీ దేవకీ తే
మాతా మిత్రం బలరిపుసుతస్త్వయ్యతోఽన్యన్న జానే ॥ 32

శ్లో॥ కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః ।
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హే కృష్ణ! రక్షస్వ మామ్ ॥ 33

శ్లో॥ తత్త్వం ప్రసీద భగవన్కురు మయ్యనాథే
విష్ణో! కృపాం పరమకారుణికః కిల త్వమ్ ।
సంసారసాగరనిమగ్నమనన్త! దీన-
ముద్ధర్తుమర్హసి హరే! పురుషోత్తమోఽసి ॥ 34

శ్లో॥ నమామి నారాయణపాదపఙ్కజం
కరోమి నారాయణపూజనం సదా ।
వదామి నారాయణనామ నిర్మలం
స్మరామి నారాయణతత్త్వమవ్యయమ్ ॥ 35

శ్లో॥ శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!
శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే! ।
శ్రీ పద్మనాభాచ్యుత! కైటభారే!
శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! ॥ 36

శ్లో॥ అనన్త! వైకుణ్ఠ! ముకున్ద! కృష్ణ!
గోవిన్ద! దామోదర! మాధవేతి ।
వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చి-
దహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్ ॥ 37

శ్లో॥ ధ్యాయన్తి యే విష్ణుమనన్తమవ్యయం
హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్ ।
సమాహితానాం సతతాభయప్రదం
తే యాన్తి సిద్ధిం పరమాఞ్చ వైష్ణవీమ్ ॥ 38

శ్లో॥ క్షీరసాగరతరఙ్గశీకరా-
సారతారకితచారుమూర్తయే ।
భోగిభోగశయనీయశాయినే
మాధవాయ మధువిద్విషే నమః ॥ 39

శ్లో॥ యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రే ద్విజన్మవరపద్మశరావభూతామ్ ।
తేనామ్బుజాక్షచరణామ్బుజషట్పదేన
రాజ్ఞా కృతా కృతిరియం కులశేఖరేణ ॥ 40



# సమతా

**కేశవార్జునయోర్మధ్యే**
**సంభాషణం యథాऽచలత్ ।**
**తథైవ భగవద్భక్త -**
**కులశేఖరయోరపి ॥**

"శ్రీ కులశేఖరాళ్వార్ల 'ముకుందమాలా' భక్తిమార్గంలో ముక్తికి సోపానంగా సాహిత్యానందబృందావనంలో సుగంధాలను వెదజల్లుతూ నిరతము భక్తహృదయాలను రంజింపజేస్తుందనుటలో అతిశయోక్తి కానరాదు.

సహకరించిన 1) డా॥ ఈ.అ.శింగరాచార్యులు గార్కి
2) డా॥ సూరం శ్రీనివాసులు గార్కి
3) సుఖవాసి మల్లికార్జునశాస్త్రి గార్కి
4) డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావు గార్కి
5) డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి గార్కి
6) దేశం పాపిరెడ్డి గార్కి

కృతజ్ఞతాంజలులు

**విష్ణుపాదసేవనం శ్రీవల్లభేऽహమ్**

**- రామోరా**

శ్లో॥ ఘుష్యతే యస్య నగరే రఙ్గయాత్రా దినే దినే ।
తమహం శిరసా వన్దే రాజానం కులశేఖరమ్ ॥



శ్రీ కులశేఖరాళ్వార్లు

శ్రీః

శ్రీకులశేఖరాళ్వార్లకృతా

# ముకుందమాలా

రామోరా విరచితా

## మృణాళినీవ్యాఖ్యా

**1**

**అవతారిక :** ఈ శ్లోకమున శరణాగతి – పరమపదప్రాప్తిని ప్రసాదించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి**
**భక్తప్రియేతి భవలుణ్ఠనకోవిదేతి ।**
**నాథేతి నాగశయనేతి జగన్నివాసే -**
**త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకున్ద! ॥ 1**

**పదవిభాగము :**

శ్రీవల్లభ! + ఇతి, (శ్రీవత్+లభే+అతి), వరద! + ఇతి, దయాపర + ఇతి,
భక్తప్రియ! + ఇతి, భవలుంఠనకోవిద! + ఇతి ।
నాథ! + ఇతి, నాగశయన! + ఇతి, జగత్ + నివాస! + –
ఇతి + ఆలాపనమ్, ప్రతి–పదమ్, కురు, మే, ముకున్ద! ॥

**అన్వయక్రమము :** ముకుంద! శ్రీవల్లభ! ఇతి వరద! ఇతి దయాపర! ఇతి భక్తప్రియ! ఇతి భవలుంఠనకోవిద! ఇతి నాథ! ఇతి నాగశయన! ఇతి జగత్ + నివాస! ఇతి ఆలాపనం మే ప్రతిపదం కురు.

**ప్రతిపదార్థము :**

(హే) ముకున్ద! = ఓ పరమపురుషార్థప్రదాతా!
(హే) శ్రీవల్లభ! + ఇతి = లక్ష్మీదేవికి పతియైన ఓ స్వామీ! అని,

(శ్రీవత్ + లభే+అతి = 'అవశ్యం నిరంజనత్వం పొందుదును')
(హే) వర–ద! + ఇతి = కోరిన వరములను ప్రసాదించువాడా! అని,
(హే) భక్త–ప్రియ! + ఇతి = భక్తులకు ప్రియమైనవాడా! అని,
(హే) భవ–లుంఠన–కోవిద! + ఇతి = చావుపుట్టుకలను తెగగొట్టుట యందు ప్రావీణ్యము గలవాడా! అని,
నాథ! + ఇతి = నాథుడవని,
నాగశయన! + ఇతి = ఆదిశేషుడు పాన్పుగ గలవాడా! అని,
జగన్నివాస! + ఇతి = లోకములకు ఆశ్రయమైనవాడా! అని,
ఆలాపనమ్ = అన్యోన్యము సంభాషించుటను,
మే = నాకు,
ప్రతిపదమ్ = పదే పదే,
**కురు** = కలుగజేయుము.

**తాత్పర్యము :** ఓ పరమపురుషార్థప్రదాతా! శ్రీవల్లభుడని, వరప్రదాయవని, దయాపరుడవని, భక్తప్రియుడవని, చావుపుట్టుకలను బోగొట్టుటయందు ప్రావీణ్యుడవని, నాథుడవని, శేషశయనుడవని, లోకముల కాశ్రయమైనవాడవని, నిరతము అన్యోన్యము సంభాషించుటను నాకు కలుగజేయుము.

**పాఠాంతరాలు :** 1. ఆలాపనమ్ – ఆలాపినమ్, 2. ప్రతిపదమ్ – ప్రతిదినమ్, 3. మే – మామ్

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. శ్రీవల్లభ! – (హే) **శ్రీవల్లభ!** – (హే) శ్రీవల్లభౌ – (హే) శ్రీవల్లభాః!, శ్రీవల్లభశబ్దః, అకారాన్తపుంలిఙ్గః, సంబోధనప్రథమావిభక్తి – ఏకవచనము; 2. వరద! – (హే) **వరద!** – (హే) వరదౌ! – (హే) వరదాః!, వరదశబ్దః, అ.పుం., సం.ప్ర.ఏ; 3. దయాపర! – (హే) **దయాపర!** – (హే) దయాపరౌ! – (హే) దయాపరాః!, దయాపరశబ్దః, అ.పుం., సం.ప్ర.ఏ; 4. భక్తప్రియ! – (హే) **భక్తప్రియ!** – (హే) భక్తప్రియౌ! – (హే) భక్తప్రియాః!, భక్తప్రియశబ్దః, అ.పుం., సం.ప్ర.ఏ; 5. భవ... కోవిద! – (హే) **కోవిద!** – (హే) ...కోవిదౌ! – (హే) ...కోవిదాః!, ...కోవిదశబ్దః, అ.పుం., సం.ప్ర.ఏ; 6. నాథ! – (హే) **నాథ!** – (హే) నాథౌ! – (హే) నాథాః!, నాథశబ్దః, అ.పుం., సం.ప్ర.ఏ; 7. నాగశయన! – (హే) **నాగశయన!** – (హే) నాగశయనౌ! – (హే) నాగశయనాః!,

నాగశయనశబ్దః, అ.పుం., సం.ప్ర.ఏ; 8. జగన్నివాస! – (హే) **జగన్నివాస!** – (హే) జగన్నివాసౌ! – (హే) జగన్నివాసాః!, జగన్నివాసశబ్దః, అ.పుం., సం.ప్ర.ఏ; 9. ఇతి – అవ్యయము, 10. ఆలాపనమ్ – **ఆలాపనమ్** – ఆలాపే – ఆలాపనాని, ఆలాపనశబ్దః, అ.నపుం., ద్వి.ఏ; 11. మే – మమ, **మే** – ఆవయోః, నౌ – అస్మాకమ్, నః; దకారాన్తః, పుంలిఙ్గోఽస్మచ్ఛబ్దః, ష.ఏ; 12. ప్రతిపదమ్ – అవ్యయము; 13. ముకున్ద! – **(హే) ముకున్ద!** – (హే) ముకున్దౌ! – (హే) ముకున్దాః!, ముకుందశబ్దః, అ.పుం., సం.ప్ర.ఏ; 14. కురు – 'డుకృఞ్' కరణే, సకర్మకమ్, అనిట్, ఉభయపదీ, (పరస్మైపదీ), తనాది, లోట్, మ.ఏ;

**క్రియాదర్శము :** కురు – లోట్ – మధ్యమపురుషైకవచనం.

| | | |
|---|---|---|
| కరోతు / కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు |
| **కురు** / కురుతాత్ | కురుతమ్ | కురుత |
| కరవాణి | కరవావ | కరవామ |

**ఛందస్సు :** 1. శక్వరీ, 2. **వసంతతిలకా** (ఉద్ధర్షిణీ, సింహోన్నతా)

**లక్షణము :** ఉక్తా వసంతతిలకా తభజా జగౌ గః.

**శ్లోకపాదము / గణవిభజన** – 14 అక్షరాలు (8, 6)

శ్రీ వ ల్ల భే తి వ ర దే తి ద యా ప రే తి
U U I U I I I U I I U I U I
త భ జ జ గ ల
పాదాంతలఘువు గురువుగా భావింతురు.

**పదాదర్శము :**

1. వందే సంస్కృతమాతరమ్

శ్లో॥ దైవాధీనం జగత్సర్వం మన్త్రాధీనం తు దైవతమ్ ।
తన్మన్త్రం సంస్కృతాధీనం సంస్కృతం శిక్షకాధీనమ్ ॥

'తస్మాత్ ఉత్తమశిక్షకో భవ।'

2. 'నమామ్యహం రాజానం ఆళ్వారశ్రేష్ఠం శ్రీకులశేఖరమ్'

'ముకుందమాలా' గ్రంథకర్తయగు శ్రీకులశేఖరాళ్వార్లను, నాచేత చేయబడుతున్న 'మృణాళినీ' నామ వ్యాఖ్యాన ప్రారంభమున తనను తాను భగవంతునియొక్క దాసులకు దాసానుదాసుడనని పేర్కొనిన 'శ్రీకులశేఖరాళ్వార్లను, ప్రప్రథమముగ వారి శుభాశీస్సులకై మనోవాక్కాయములచే శిరసా నమస్కరించుచున్నాను.

శ్లో॥ కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళపట్టణే ।
కౌస్తుభాంశం ధరాధీశం **కులశేఖరమాశ్రయే** ॥

కేరళప్రాంత చోళపట్టణమునందు కుంభ (మాఘ) మాసమున పునర్వసు నక్షత్రమున కౌస్తుభాంశమున, ధరాధీశునిగ జనించిన శ్రీ కులశేఖరులను ఆశ్రయించుచున్నాను.

శ్లో॥ కౌస్తుభాఖ్యమభూద్రత్నం పద్మరాగో మహోదధేః ।
తస్మిన్ హరిః స్పృహాం చక్రే వక్షోఽలఙ్కరణే మణౌ ॥
ఇతి భాగవతే 8/8/5

శ్లో॥ కౌస్తుభస్తు మహాతేజాః కోటిసూర్యసమప్రభః ।
ఇదం కియుత వక్తవ్యం ప్రదీపాద్దీప్తిమానితి ॥
ఇతి భాగవతామృతమ్

ఈ **'మృణాళినీ'** వ్యాఖ్యాన ప్రారంభము సరిగా శ్రీకులశేఖరులు జనించిన కుంభమాసమున, పునర్వసు నక్షత్రమునకు తుల్యమైన 13-02-2022న, గం.9.02లకు ఉదయకాలమున ప్రారంభింపబడుట అనుకోకుండా, యాదృచ్ఛికంగా జరుగుట వారి అనుగ్రహముతో జరిగినదని తలంతును.

3. 'భగవన్నామస్మరణయే' పరమపదసోపానప్రాప్తికి మార్గమని, ప్రధానధ్యేయముగా సాగిన 'ముకుందమాలా' స్తోత్రము, స్తోత్రవాఙ్మయమునే కాక, జీవాజీవసముదాయమున అణువణువునా పూర్ణముగా నిండియున్నదని రూఢిగా చెప్పబడుచున్నది.

వ్యాఖ్యాన ప్రారంభమున 'శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్'నకు శ్రీశంకర భగవత్పాదులవారందించిన విషయమిట ఉటంకింపబడుచున్నది.

"విష్ణ్వాది శబ్దానాం పునరుక్తానామపి వృత్తిభేదేనార్థభేదాన్న పౌనరుక్త్యమ్ శ్రీపతిర్మాధవ ఇత్యాదీనాం వృత్త్యైకత్వేఽపి శబ్దభేదాన్న పౌనరుక్త్యమ్. అర్థైకత్వేఽపి న

పౌనరుక్త్యం దోషాయ నామ్నాం సహస్రస్య కిమేకం దైవతమ్' ఇతి పృష్టేరేక-దేవతావిషయత్వాత్.

యత్ర పుంలిఙ్గశబ్దప్రయోగస్తత్ర విష్ణుర్విశేష్యః, యత్ర స్త్రీలింగశబ్దస్తత్ర దేవతా విశేష్యతే, యత్ర నపుంసకలిఙ్గస్తత్ర బ్రహ్మేతి విశేష్యతే.

విష్ణ్వాదిశబ్దములు పునరుక్తములైయున్నను వృత్తిభేదమూలకమైన అర్థభేదము చేత పునరుక్తి కానేరదు. శ్రీపతి, మాధవ - ఇత్యాది శబ్దములు అర్థభేదము లేనివైనను శబ్దభేదమునుబట్టి పునరుక్తి కానేరదు. ఏకార్థమూలకపునరుక్తి దోషావహము కాదు. ఏకదైవత ప్రశ్నపై చెప్పబడిన నామసహస్రము ఏకదేవత విషయమై యుండుటవలన పునరుక్తి దోషము లేదు.

ఇట పుంలిఙ్గశబ్దప్రయోగమున్న స్థలమున విష్ణువు విశేష్యము, స్త్రీలింగశబ్దము ప్రయుక్తమయినపుడు దేవత విశేష్యము, నపుంసక లింగశబ్దము ప్రయుక్తమయినప్పుడు బ్రహ్మ విశేష్యము అని గ్రహింపవలెను.

4. అ) గ్రంథారంభమున చెప్పబడిన ప్రథమశ్లోకాదియైన శ్రీవల్లభేతి పదమును శ్రీవత్, లభే, అతి అను పదవిభాగముచే, శ్రీవత్ - అనే అవ్యయముచే ప్రారంభింపబడినదని, అది అవ్యయస్థానమును, పరమపురుషార్థమును ప్రసాదించునదై గ్రంథవస్తువును తేటతెల్లము చేయుచున్నది. ప్రథమశ్లోకాంతపదమైన ముకుం-ద అనుదానియందు ముకుం అనే అవ్యయముచే పూర్తిగావింపబడుటచే, గ్రంథ అధ్యయన-అధ్యాపన-ఆచరణలతో అవశ్యం 'పరమపదప్రాప్తి' పొందుట చెప్పబడినట్లైనదని భావింపదగును. 'అహమ్' అధ్యాహారమిట చేయదగును. (శ్రీవత్ - తేన తుల్యం క్రియా చేత్)

4. ఆ) శ్లో॥ 'ఆదిగురుః సౌఖ్యదాయీ' - అంటుంది 'చమత్కారచంద్రికా' 1-35

4. ఇ) శ్రీం = శ్ + ర్ + ఈ + మ్

అక్షరసమామ్నాయమున ఏదేని అక్షరము నాదబిందుయుతమైన అద్దానిని బీజ లేదా మంత్ర అక్షరమగునని తెలియదగును. నాద-బిందు పదముల వివృతికై 'వరివస్యారహస్యము' చూడుడు.

1. శ్లో॥ శకారశ్చ మహేశాని! వృషఘ్నః కథితో వకః । - మంత్రాభిధానమ్

శ్లో॥ **శః** సవ్యం కామరూపీ చ కామరూపో మహామతిః ।
సౌఖ్యనామా కుమారోఽస్తి శ్రీకణ్ఠో వృషకేతనః ॥ 153

శ్లో॥ వృషఘ్నః శయనం శాన్తః సుభగా విస్ఫులింగినీ ।
మృత్యుదేవో మహాలక్ష్మీర్మహేంద్రః కులకౌలినీ ॥ 154

శ్లో॥ బాహుర్హంసో వియద్వక్త్రం హృదనంగాంకుశః ఖలః ।
వామోరుః పుండరీకాత్మా కాన్తిః **కల్యాణవాచకః** ॥ 155

– ప్రకారాన్తరమంత్రాభిధానమ్

---

2. శ్లో॥ **రోఽ**సుః పంచకసీశోఽగ్నిరంకుశం పరిసర్పిణీ। – మంత్రాభిధానమ్

శ్లో॥ రోరక్తః క్రోధినీ రేఫః పావకస్తైజసో మతః ।
ప్రకాశో దర్శనో దీపో రక్తః కృష్ణః పరం బలీ ॥ 144

శ్లో॥ భుజంగేశో మతిః సూర్యో ధాతురక్తః ప్రకాశకః ।
వ్యాపకో రేవతీ దామ క్రౌంచాంశో వహ్నిమండలమ్ ॥ 145

శ్లో॥ ఉగ్రరేఖా స్థూలదణ్డో వేదకణ్ఠకలా పురా ।
ప్రకృతిః సుగతో బ్రహ్మశబ్దస్తద్గాయకో ధనమ్ ॥ 146

– ప్రకారాన్తరమంత్రాభిధానమ్

---

3. శ్లో॥ **ఈ** గోవిందస్త్రిమూర్తిః స్యాద్ వామాక్షి కమలా కలా ।
మాయా లక్ష్మీ రతిః శాన్తిర్వైష్ణవీ బిందుమాలినీ ॥

– మంత్రాభిధానమ్

శ్లో॥ **ఈ** స్త్రిమూర్తిర్మహామాయా లోలాక్షీ వామలోచనమ్ ।
గోవిందః శేఖరః పుష్టిః సుభద్రా రత్నసంజ్ఞకః ॥ 14

శ్లో॥ విష్ణుర్లక్ష్మీః ప్రహాసశ్చ వాగ్విశుద్ధః పరాపరః ।
కాలోత్తరీయో భేరుండా రతిశ్చ పౌణ్డ్రవర్ధనః ॥ 15

శ్లో॥ శివోత్తమః శివా తుష్టిశ్చతుర్థీ బిందుమాలినీ ।
వైష్ణవీ బైందవీ జిహ్వా కామకలా సనాదకా ॥ 16
- ప్రకారాన్తరమంత్రాభిధానమ్

---

4. నాద-బిందువులకై - **వరివస్యారహస్యము** చూడదగును.

5. శ్లో॥ మహాలక్ష్మ్యర్థకః **శః** స్యాద్ ధనార్థో **రేఫ** ఉచ్యతే ।
**ఈ**స్తుష్ట్యర్థో పరో నాదో బిందుర్దుఃఖహరార్థకః ॥
లక్ష్మీదేవ్యా బీజమేతత్తేన దేవీం ప్రపూజయేత్ । - **వరదాతంత్రే**

6. శ్లో॥ అక్షస్రక్పరశూ గదేషు కులిశం పద్మం ధనుష్కుండికాం
దండం శక్తిమసిం చ చర్మ జలజం ఘంటాం సురాభాజనీమ్ ।
శూలం పాశసుదర్శనే చ దధతీం హస్తైః ప్రసన్నాననాం
సేవే సైరిభమర్దినీమిహ **మహాలక్ష్మీం** సరోజస్థితామ్ ॥
- శ్రీదుర్గాసప్తశతీ - 2అ-1.

5. **'శ్రీం'** బీజాక్షరమును వివరించిన పిమ్మట మంత్ర - తంత్ర - యంత్ర పదములు వివరింపబడుచున్నవి. 'అధ్యయనం - అధ్యాపనం - అనుష్ఠానాలతో ఆనందడోలికల్లో పరిపూర్ణంగా ఓలలాడుతూ జీవనాన్ని సాగించిన 'ఆర్థర్ ఎవలాన్' మహాశయునకు 'మనసా, వాచా, కర్మణా' నమస్కరిస్తూ పై పదముల వివరణ చెప్పబడుతున్నది.

**మంత్రము - తంత్రము - యంత్రము**

**మంత్రము :** 'మననాత్ త్రాయతే ఇతి మంత్రః'. మనస్సునందు నిరంతరము పురశ్చరణ చేయుటవలన ఏది మనకు రక్షణ కల్పించుచున్నదో అదియే మంత్రము. త్రాణమన రక్షణ కల్పించుట, మనన మన మనస్సునందు పురశ్చరణ చేయుట.

మంత్రమునకు (1) హృదయ, (2) కవచ, (3) మాలా, (4) పంజర, (5) అష్టోత్తర, (6) సహస్రనామ, స్తోత్రములు అనబడు బాహ్యామైన షడంగములున్నూ, ఋషి, ఛందో, దేవతా, బీజ, శక్తి, కీలము లనబడు అంతరమైన షడంగములుండును.

మంత్రమందున్న అక్షరముల సంఖ్యనుబట్టి వాటికి వివిధములైన పేర్లను నిత్యాతంత్రము - ఇవ్విధముగ పేర్కొన్నది.

ఏకాక్షరాః పిండకాః కర్త్రోర్యో ద్వ్యక్షరా మతాః
వర్ణత్రయం సమారభ్య నవార్ణావధి బీజకాః ।
తతో దశార్ణమారభ్య యావద్వింశతి మంత్రకాః
తత్ర ఊర్ధ్వగతాః మాలాః తాసు భేదేన విద్యతే ॥

ఏకాక్షరమంత్రములు – **పిండకములు**
రెండక్షరములు కలవి – **కర్తరులు,**
మూడు మొదలు – తొమ్మిది అక్షరములు కలవి – బీజకములు
పది మొదలు – ఇరువది అక్షరములు కలవి – మంత్రములు
ఆపైసంఖ్యలో అక్షరములు కలవి – మాలలు

శ్లో॥ ప్రవిశ్య విధివద్దీక్షామభిషేకావసానికామ్ ।
శ్రుత్వా తంత్రం గురోర్లబ్ధం సాధయేదీప్సితం మనుమ్ ।
– శ్రీమదగ్నిపురాణమ్ /293/16.

మరిన్ని విషయములకై శాక్తానందతరంగిణి, మంత్రమహోదధి, వరివస్యారహస్యము, మొదలగు గ్రంథములు అధ్యయనము చేయదగును.

**తంత్రము :** యంత్రమును పూజించు విధానమును తెలియజేయు తంత్రమను పదము 'తన్' ధాతువునుండి ఉద్భవించినది. 'తన్' అనగా విస్తరించుట అని అర్థము. విశ్వశక్తి మానవునిలోని సర్వావయవములలో విస్తరించు విధమే తంత్రము. ఎక్కడ జ్ఞానము విస్తరింపబడి ప్రవచింపబడుతుందో, ఏది రక్షిస్తుందో అది తంత్రము. తంత్రమునకు 1. విజ్ఞానము, 2. యోగము, 3. క్రియ, 4. చర్య – అను నాలుగు అంగములుండును.

**జ్ఞాన** మన వేదాంతపరమైన సిద్ధాన్తము

**యోగ** మన ధ్యానమును కొనసాగించుటకు ఉపకరించు బోధన.

**క్రియ** యన తన సాధనను కొనసాగించుటకు ఉపయోగపడు శిక్షణ.

**చర్య** యన సాధకుడు అనుసరించవలసిన ప్రవర్తనానియమావళి.

తంత్రద్వారాలు తెరిస్తే వర్ణవిద్వేషాలే ఉండవు. **వేదాన్తగ్రంథాలు** ముక్తిని గురించి ప్రవచిస్తే, **తంత్రశాస్త్రగ్రంథాలు** ముక్తితోబాటు భుక్తిని కూడా ప్రవచిస్తాయి.

తంత్రశాస్త్రగ్రంథాలలో పేర్కొనబడిన 'పంచమకారా'ల వాచ్యార్థాన్ని గ్రహించ కుండా మహానిర్వాణతంత్రంలో తెలిపినవిధంగా సమన్వయించుకుంటే అది సమయాచారమే అవుతుంది.

'మద్యం మాంసం తథా మత్స్యం ముద్రా మైథునమేవ చ ।
శక్తిపూజా విధానాద్యైః పంచతత్త్వప్రకీర్తితః ॥'

**యంత్రము :** బీజాక్షరయుతమైన రేఖాచిత్రమునకే 'యంత్ర'మని నామము.

మంత్రమునకు – తంత్రమునకు – యంత్రమునకు అభేదమని శాస్త్రవచనము.

6. శ్రీరామకర్ణామృతము – తృతీయాశ్వాసమునగల 108వ శ్లోకమును తనివితీరా ఆస్వాదింతురుగాక. ప్రతిబింబముగా కానుపించును.

శ్లో॥ శ్రీరామచంద్రేతి దయాపరేతి
భక్తప్రియేతి భవబంధనమోచనేతి ।
నాథేతి నాగశయనేతి సదా స్తువంతం
మాం పాహి భీతమనిశం కృపణం కృపాళో! ॥

ఓ శ్రీరామచంద్ర! అని, ఓ దయాసక్తుడా! అని, ఓ భక్తప్రియుడా! అని, సంసారబంధము విడిపించువాడా! అని, నాథ! అని, శేషశయనుడా! అని నిరతము స్తుతించునట్టి, భీతుడైనట్టి, దీనుడనైన నన్ను ఓ పరమదయాస్వరూపుడా! రక్షింపుము అస్తు.

7. 'శ్రేయస్కరీ' స్తోత్రమునందు గల ఈ శ్లోకమును కూడా తృప్తితీర ఆస్వాదింతురుగాక.

శ్లో॥ శ్రేయస్కరీతి వరదేతి దయాపరేతి
వేదోదరేతి విధి–శంకర–పూజితేతి ।
వాణీతి శమ్బురమణీతి చ తారిణీతి
శ్రీదేశికేంద్రకరుణేతి గృణామి నిత్యమ్ ॥ 5

8. **'ఇతి'** – "ఇతి హేతుప్రకారస్వరూపసమాప్తివివక్షానియమశబ్దప్రాదుర్భావైవమర్థేషు॥

"హేతౌ, ప్రకారే, స్వరూపే, సమాప్తే, ఏవమర్థే, ప్రకర్షే, వ్యవస్థాయామ్, ప్రకృతౌ,

సముచ్చయే, ఆద్యర్థే, నిదర్శనే, అవధారణే, ప్రత్యక్షే, మానే, ప్రకాశే” మరిన్ని వివరములకు ‘అవ్యయకోశము (195) చూడగలరు.



## 2

**అవతారిక :** ఈ శ్లోకమున ముకుందుడు – ‘సర్వోత్కర్షతో విరాజిల్లుగాక’ అని ఘోషింపబడుచున్నాడు.

**శ్లో॥ జయతు జయతు దేవో దేవకీనన్దనోఽయం**
**జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః ।**
**జయతు జయతు మేఘశ్యామలః కోమలాఙ్గో**
**జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః ॥ 2**

**పదవిభాగము :**

జయతు, జయతు, దేవః, దేవకీనందనః, అయమ్,
జయతు, జయతు, కృష్ణః, వృష్ణివంశప్రదీపః ।
జయతు, జయతు, మేఘశ్యామలః, కోమలాంగః,
జయతు, జయతు, పృథ్వీభారనాశః, ముకుందః ॥

**అన్వయక్రమము :** దేవకీనందనః అయమ్ దేవః జయతు జయతు, వృష్ణవంశప్రదీపః కృష్ణ జయతు జయతు, మేఘశ్యామలః కోమలాంగః జయతు జయతు, పృథ్వీ–భార–నాశః ముకుందః జయతు జయతు.

**ప్రతిపదార్థము :**

దేవకీనందనః = దేవకీదేవియొక్క పుత్రుడగు,
అయమ్ = ఈ
దేవః = భగవదంతుడగు శ్రీకృష్ణుడు,
జయతు జయతు = సర్వోత్కృష్టుడగునుగాక;
వృష్ణి–వంశ–ప్రదీపః = వృష్టివంశమునకు ప్రకాశకుడగు,
కృష్ణః = శ్రీకృష్ణపరమాత్మ,

జయతు జయతు = సర్వోత్కృష్టుడగునుగాక;
మేఘశ్యామలః = కారుమబ్బువలె నల్లని దేహచ్ఛాయ గల,
కోమలాంగః = సున్నితమైన అవయవములుగల శ్రీకృష్ణుడు,
జయతు జయతు = సర్వోత్కృష్టుడగును గాక;
పృథ్వీ–భార–నాశః = భూభారమును పోగొట్టునట్టి వాడగు,
ముకుందః = పరమపురుషార్థప్రదాత ముకుంద భగవానుడు,
**జయతు జయతు** = సర్వోత్కృష్టుడగును గాక;

**తాత్పర్యము :** దేవకీదేవియొక్క పుత్రుడగు ఈ దేవుడు సర్వోత్కృష్టుడగుగాక; వృష్ణివంశమును యదువంశమునకు ప్రకాశకుడగు శ్రీకృష్ణపరమాత్మ సర్వోత్కృష్టుడగునుగాక; కారుమబ్బువలె నల్లని దేహఛాయగల సున్నితమైన అవయవములుగల శ్రీకృష్ణుడు సర్వోత్కృష్టుడగునుగాక; భూభారమును పోగొట్టునట్టివాడగు ముకుంద భగవానుడు సర్వోత్కృష్టుడగునుగాక,

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. దేవః – **దేవః** – దేవౌ – దేవాః, అ.పుం., దేవశబ్దః, ప్ర.ఏ; 2. దేవకీనందనః – **...నందనః** – ...నందనౌ – ...నందనాః, అ.పుం., ...నందనశబ్దః, ప్ర.ఏ; 3. అయమ్ – **అయమ్** – ఇమౌ – ఇమే, మకారాన్తః పుంలిఙ్గః, ఇదమ్ శబ్దః, ప్ర.ఏ; 4. కృష్ణః – **కృష్ణః** – కృష్ణౌ – కృష్ణాః, అ.పుం., కృష్ణశబ్దః, ప్ర.ఏ; 5. ...ప్రదీపః – **...ప్రదీపః** – ...ప్రదీపౌ – ...ప్రదీపాః, అ.పుం., ...ప్రదీపశబ్దః, ప్ర.ఏ; 6. మేఘశ్యామలః – ...శ్యామలః – ...శ్యామలౌ – ...శ్యామలాః, అ.పుం., ...శ్యామలశబ్దః, ప్ర.ఏ; 7. కోమలాంగః – **కోమలాంగః** – కోమలాంగౌ – కోమలాంగాః, అ.పుం., కోమలాంగశబ్దః, ప్ర.ఏ; 8. పృథ్వీభారనాశః – **...నాశః** – ...నాశౌ – ...నాశాః, అ.పుం., ...నాశశబ్దః, ప్ర.ఏ; 9. ముకుందః – **ముకుందః** – ముకుందౌ – ముకుందాః, అ.పుం., ముకుందశబ్దః, ప్ర.ఏ; 10. జయతు – జి అభిభవే (ఓడించుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, ప్ర.ఏ.

**క్రియాదర్శము :** లోట్ – భ్వాది

| | | |
|---|---|---|
| **జయతు** / జయతాత్ | జయతామ్ | జయన్తు |
| జయ / జయతాత్ | జయతమ్ | జయత |
| జయాని | జయావ | జయామ |

**ఛందస్సు :** 1. అతిశక్వరీ, 2. **మాలినీ**

**లక్షణము :** ననమయయ యుతేయం **మాలినీ** భోగిలోకైః ।

**శ్లోకపాదము / గణవిభజన –** 15 అక్షరాలు, (8, 7)

| | | | | |
|---|---|---|---|---|
| జ య తు | జ య తు | దే వో దే | వ కీ న | న్ద నో౽ యం |
| I I I | I I I | U U U | I U U | I U U |
| న | న | మ | య | య |

**పదాదర్శము :** 1. ముకుందః 2. దేవః 3. జయతు

**1. ముకుందః –** అ) ముకుం ముక్తిం దదాతి। ముకుం + దా + క, పృషోదరాదిత్వమ్।
విష్ణుః

శ్లో॥ ముకుమవ్యయమాన్తఞ్చ నిర్వాణమోక్షవాచకమ్ ।
తద్దదాతి చ యో దేవో **ముకున్దస్తేన** కీర్తితః ॥

శ్లో॥ ముకుం భక్తిరసప్రేమవచనం వేదసమ్మతమ్ ।
యస్తద్దదాతి విప్రేభ్యో **ముకున్దస్తేన** కీర్తితః ।
– ఇతి బ్రహ్మవైవర్తే

ఆ) శ్లో॥ భాస్వత్త్రిపుణ్డ్రో భసితైస్సితస్సన్
మౌనీ జటీవల్కలవాన్ **ముకున్దః** ।
నిరంతరం చేతసి చన్ద్రచూడం
విచిన్తయన్ పంచ జజాప వర్షాన్ ॥ – ఇతి హరివంశే

సర్వాంగభస్మోద్ధూళనముతో తన కృష్ణరూపము శుక్లరూపము నొందగా, నొసట భస్మత్రిపుండ్రము వెలుగొందుచుండగా, జటావల్కలముల ధరించి, మౌనము నవలంబించి ముకున్దుడు చిత్తమున అనితరముగ **చంద్రశేఖరుని** ధ్యానించుచు, పంచాక్షర మహామంత్రము (నమశ్శివాయ)ను జపించెను.

ఇ) శ్లో॥ యశోదే చ ప్రయత్నేన స్వాత్మనః పుత్రమీశ్వరమ్ ।
రామ! నారాయణానంత! **ముకుంద!** మధుసూదన! ॥

శ్లో॥ కృష్ణ! కేశవ! కంసారే! హరే! వైకుంఠ! వామన! ।
ఇత్యేకాదశనామాని పఠేద్వా పాఠయేదితి ॥

శ్లో॥ జన్మకోటి సహస్రాణాం పాతకాదేవ ముచ్యతే ॥

– ఇతి బ్రహ్మవైవర్తే – 3 అ.

ఇవ్విధముగనే శ్రీకులశేఖరాళ్వార్లు 'ముకుందమాలా' స్తోత్రమును రచించి మనకందఱకు శ్రేయోమార్గమును కల్పించినారు.

ఈ) తన భక్తులను వారియొక్క కర్మబంధాలనుండి విముక్తుడిని గావించి మఱు జన్మనొందకుండా పరమపురుషార్థమైన మోక్షాన్ని / పరమపద ప్రాప్తిని ఇచ్చి తన వద్దకు అక్కున చేర్చుకునేవాడు ముకుందుడు.

ఉ) శ్లో॥ జీవో వినయితా సాక్షీ **ముకున్దో౾** మితవిక్రమః ।
అమ్భోనిధిరనన్తాత్మా మహోదధిశయో౾న్తకః ॥

55 (515వ నామము)

– ఇతి శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్

భాష్యమ్ : తైర్థికాన్యగరిమ్ణా ప్రార్థితః స్వయం ముక్తిభూమిం దదాతీతి **ముకున్దః**, పృషోదరాదిత్వాత్ సాధుః – శ్రీపరాశరభట్టరువారు.

ఊ) శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్ – ధ్యానశ్లోకమ్

శ్లో॥ క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణివిలసత్సైకతే మౌక్తికానాం
మాలాక్లృప్తాసనస్థస్స్ఫటికమణినిభైర్మౌక్తికైర్మణ్డితాఙ్గః ।
శుభ్రైరభ్రైరదభ్రైరుపరివిరచితైర్ముక్తపీయూషవర్షై –
రానన్దీ నః పునీయాదరినలినగదాశఙ్ఖపాణి**ర్ముకున్దః** ॥

2. **దేవః** – అ) దీవ్యతి ఆనందేన క్రీడతీతి । దివ్ + అచ్ । దేవతా.

శ్లో॥ **దేవా**నృషీన్ మనుష్యాంశ్చ పితౄన్ గృహ్యాశ్చ దేవతాః ।
పూజయిత్వా తతః పశ్చాద్ గృహస్థః శేషభుగ్ భవేత్ ॥

– ఇతి మనుః 3/117

దేవతలను, ఋషులను, మనుష్యులను, పితరులను, గృహదేవతలను అన్నాదులచే బూజించి ఆ పిమ్మట గృహస్థుడు మిగత యన్నము – భుజింపవలయును.

ఆ) శ్లో॥ ఈశానదేవచరణాభరణేన నీవీ–
దామోదరస్థిరయశఃస్తబకోద్గమేన ।
లీలాశుకేన రచితం తవ **దేవ!** కృష్ణ!
కర్ణామృతం వహతు కల్పశతాంతరేఽపి ॥

శ్రీకృష్ణకర్ణామృతే 1–111

'శివుని పాదారవిందములయందు భక్తికలిగి, పూగుత్తికై యెగురు లీలాశుకము వలె, నీ కీర్తియందు మిగులాసక్తి గల్గియుండు లీలాశుకుడను కవి కర్ణామృతముగా రచించిన యీ కర్ణామృతగ్రంథము పెక్కు కల్పములుండునుగాక.

ఇవ్విధముగనే శ్రీకులశేఖరాళ్వార్ల విరచితమైన ఈ 'ముకుందమాలా' గ్రంథమును పెక్కు కల్పములుండునుగాక.

3. **జయతు :** జి–అభిభవే (ఓడించుట) భ్వాది, లోట్–ప్ర.ఏ.

శ్లో॥ జయతు జయతు లక్ష్మీర్లక్షణాలంకృతాఙ్గీ
జయతు జయతు పద్మా పద్మసద్మాభివన్ద్యా ।
జయతు జయతు విద్యా విష్ణువామాంకసంస్థా
జయతు జయతు సమ్యక్సర్వసంపత్కారశ్రీః ॥

శ్లో॥ జయతు జయతు దేవీ దేవసంఘాభిపూజ్యా
జయతు జయతు భద్రా భార్గవీ భాగ్యరూపా ।
జయతు జయతు నిత్యా నిర్మలజ్ఞానవేద్యా
జయతు జయతు సత్యా సర్వభూతాంతరస్థా ॥

శ్లో॥ జయతు జయతు రమ్యా రత్నగర్భాంతరస్థా
జయతు జయతు శుద్ధా శుద్ధజాంబూనదాభా ।
జయతు జయతు కాన్తా కాన్తిమద్భాసితాఙ్గీ
జయతు జయతు శాన్తా శీఘ్రమాగచ్ఛ సౌమ్యే! ॥

– ఇత్యథర్వణరహస్యే – ఉత్తరభాగే ఆద్యాది
శ్రీమహాలక్ష్మీహృదయస్తోత్రే – 15, 16, 17 శ్లోకాలు.

ఇవ్విధముగనే శ్రీకులశేఖరాళ్వార్ల విరచితమైన ఈ 'ముకుందమాలా' యందలి ఈ ౨ వ శ్లోకమున్నూ **'మహామంత్ర'**మే.

నిరతము 'శ్రీలక్ష్మి-నారాయణు'లను స్మరించుదుముగాక.

4. అ) ఇదే నడకనున్న శ్రీరామకర్ణామృతమునందున్న శ్లోకమును చూడుదు

శ్లో॥ జయ జయ రఘురామ! శ్రీముఖాంభోజభానో!
జయ జయ రఘువీర! శ్రీమదంభోజనేత్ర! ।
జయ జయ రఘునాథ! శ్రీకరాభ్యర్చితాంఘ్రే!
జయ జయ రఘువర్య! శ్రీశ! కారుణ్యసింధో! ॥ 1-97

సంబోధనప్రథమావిభక్త్యంతములతో అత్యన్తసుందరముగా సాగిన ఈ శ్లోకమున శ్రీరామచంద్రుడు కీర్తింపబడినాడు.

ఆ) శ్లో॥ జానాతి రామ! తవ నామరుచిం మహేశో
జానాతి గౌతమసతీచరణప్రభావమ్ ।
జానాతి దోర్బలపరాక్రమమీశచాపో
జానాత్యమోఘపటుబాణగతిం పయోధిః ॥ 1-36

ఓ రామా! నీ నామముయొక్క రుచిని మహేశుడు ఎఱుగును.
నీ పాదసామర్థ్యమును అహల్య ఎఱుగును.
నీ భుజపరాక్రమము శివధనుస్సు ఎఱుగును.
నీ బాణప్రయోగమును సముద్రుడు ఎఱుగును.

5. శ్లో॥ **జయతు జయతు** రామో జానకీవల్లభో౭యం
**జయతు జయతు** రామశ్చంద్రచూడార్చితాంఘ్రిః ।
**జయతు జయతు** వాణీనాథనాథః పరాత్మా
**జయతు జయతు** రామో నాథనాథః కృపాళుః ॥

అనే ఈ శ్లోకమున్ను 'ముకుందమాలా' ఈ ద్వితీయ శ్లోకమునకు ప్రతిబింబ ప్రాయముగా నున్నది.



**3**

**అవతారిక :** ఈ శ్లోకమున ఎటువంటి జన్మమందును **'నిన్ను మఱువకుండుట'** కలుగునుగాక, అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ముకున్ద! మూర్ధ్నా ప్రణిపత్య యాచే**
**భవన్తమేకాన్తమియన్తమర్థమ్ ।**
**'అవిస్మృతిస్త్వచ్చరణారవిన్దే**
***భవే భవే మేఽస్తు భవత్ప్రసాదాత్ ॥'*** ***3***

**పదవిభాగము :**

ముకున్ద! మూర్ధ్నా ప్రణిపత్య, యాచే,
భవంతమ్, ఏకాంతమ్, ఇయంతమ్, అర్థమ్ ।
అవిస్మృతిః, త్వత్ + చరణ + అరవిందే,
భవే భవే, మే, అస్తు, భవత్ప్రసాదాత్ ॥

**అన్వయక్రమము :** ముకున్ద! మూర్ధ్నా ప్ర + నిపత్య భవంతమ్ ఏకాంతమ్ ఇయంతం యాచే, భవత్ప్రసాదాత్ త్వత్ + చరణారవిందే అవిస్మృతిః మే భవే భవే అస్తు.

**ప్రతిపదార్థము :**

ముకున్ద! = ఓ ముకుంద!
మూర్ధ్నా = శిరస్సుతో
ప్రణిపత్య = త్రికరణశుద్ధిగా సేవించి,
భవంతమ్ = నిన్ను,
ఏకాంతమ్ = వేరొక్క ఫలము నాశింపకుండా
ఇయంతమ్ = ఈ మాత్రపు
అర్థమ్ = వెసులుబాటును
యాచే = అర్థించుచున్నాను.
భవత్ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన,
త్వత్ + చరణారవిందే = నీ పాదారవిందములందు
అవిస్మృతిః = మఱుపు లేకుండుట,

మే = నాకు,
భవే భవే = ప్రతి జన్మమునందును
**అస్తు** = కలుగును గాక!

**తాత్పర్యము :** ఓ ముకుంద! శిరస్సుతో త్రికరణశుద్ధిగా సేవించి, నిన్ను, వేరొక్క ఫలమాశింపకుండా ఈమాత్రపు వెసులుబాటును అర్థించుచున్నాను. **'నీ అనుగ్రహము వలన నీ పాదపద్మములందు మఱపులేకుండుట నాకు ప్రతిజన్మమందును కలుగునుగాక.'**

**పాఠాంతరాలు :**

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. ముకుంద! - (హే) **ముకుంద!** - (హే) ముకుందౌ! - (హే) ముకుందాః!, అ.పుం., ముకుందశబ్దః, సం.ప్ర.ఏ; 2. మూర్ధ్నా - **మూర్ధ్నా** - మూర్ధభ్యామ్ - మూర్ధభిః, నకారాన్తః, పుంలిఙ్గ, మూర్ధన్‌శబ్దః, తృ.ఏ; 3. ప్రణిపత్య - (ప్రనిపత్‌ల్యప్) అవ్యయము; 4. భవంతమ్ - **భవన్తమ్** - భవన్తౌ - భవతః, తకారాన్తః, పుంలిఙ్గః, భవత్‌శబ్దః, ద్వి.ఏ; 5. ఏకాంతమ్ - **ఏకాన్తమ్** - ఏకాన్తౌ - ఏకాన్తాన్, అకారాన్తః, పుంలిఙ్గః, ఏకాన్తశబ్దః, ద్వి.ఏ; 6. ఇయంతమ్ - **ఇయన్తమ్** - ఇయన్తౌ - ఇయన్తః, తకారాన్తః పుంలిఙ్గః, ఇయత్‌శబ్దః, ద్వి.ఏ; 7. అర్థమ్ - **అర్థమ్** - అర్థౌ - అర్థాన్, అకారాన్తః పుంలిఙ్గః, అర్థశబ్దః, ద్వి.ఏ; 8. యాచే - టూయాచృ - యాచ్ఞాయామ్, సకర్మకమ్, సేట్, ఉభయపదీ, ఉ.ఏ; 9. భవత్ప్రసాదాత్ - **...ప్రసాదాత్** - ...ప్రసాదాభ్యామ్ - ...ప్రసాదేభ్యః, అకారాన్తః, పుంలిఙ్గః, ...ప్రసాదశబ్దః, పం.ఏ; 10. ...అరవిందే - **...అరవిందే** - ...అరవిందయోః - ...అరవిందేషు, అకారాన్తః, నపుం.లిఙ్గః, అరవిందశబ్దః, స.ఏ; 11. అవిస్మృతిః - **అవిస్మృతిః** - అవిస్మృతే - అవిస్మృతయః, ఇకారాన్తః, స్త్రీలిఙ్గః, అవిస్మృతిశబ్దః, ప్ర.ఏ; 12. అస్తు - అస(అస్) భువి (ఉండుట), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, ప్ర.ఏ; 13. భవే భవే - ద్విరుక్తభవశబ్దః, అకారాన్తః, పుంలిఙ్గః, సప్తమీ ఏకవచనాంతః.

**క్రియాదర్శము :** అస్తు - లోట్ - అదాది (2)

| | | |
|---|---|---|
| **అస్తు** / స్తాత్ | స్తామ్ | సన్తు |
| ఏధి / స్తాత్ | స్తమ్ | స్త |
| అసాని | అసావ | అసామ |

**ఛందస్సు :** 1. త్రిష్టుభ్ 2. **ఉపేన్ద్రవజ్రా**

**లక్షణము :** ఉపేన్ద్రవజ్రా ప్రథమే లఘౌ సా ।

**శ్లోకపాదము / గణవిభజన** 11 అక్షరాలు (5, 6)

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ము | కు | న్ద! | మూ | ర్ధ్నా | ప్ర | ణి | ప | త్య | యా | చే |
| I | U | I | U | U | I | I | U | I | U | U |
| | జ | | | త | | | జ | | గ | గ |

**పదాదర్శము : ముకుంద** దశాక్షరీమంత్రము

మొదటి శ్లోకములో కృష్ణుని పిలిచి, రెండవ శ్లోకములో ఎదుట నిలచిన కృష్ణునకు జయము పలికి, యిచట నుండి శ్రీకులశేఖరులు స్తోత్రము చేయుచున్నారు. ఈ శ్లోకము **ముకుంద** తో ప్రారంభమగుటవలన 'ముకుందమాలా' యను నామము ఈ స్తోత్రమునకు కలిగెను. ఇందు **'ముకుందదశాక్షరీమంత్రము'** నిక్షేపితమైనదని పెద్దలు చెప్పుదురు అని శ్రీభాష్యం అప్పలాచార్యులు వారు 'ముకుందమాలా' స్తోత్రమునకు వారు అందించిన వ్యాఖ్యాన గ్రంథమున పేర్కొనినారు.

**'ముకుందదశాక్షరీమంత్రము'** ఇట ప్రదర్శింపబడుతున్నది. శ్రీ సమతామూర్తి స్ఫూర్తికి నమస్సులతో

## గోపీజనవల్లభాయ స్వాహా

శ్లో॥ అథ గోపాలమనవః ప్రోచ్యన్తే స్వేష్టసాధకాః । 14-51

శ్లో॥ గోపీజనపదస్యాన్తే వల్లభాయాగ్నిసుందరీ ।
దశాక్షరో మనుః ప్రోక్తో మనోరథఫలప్రదః ॥ 52

శ్లో॥ నారదోఽస్య విరాట్ కృష్ణో మునిపూర్వాః సమీరితాః ।
బీజశక్తీ తు విజ్ఞేయే క్రమాత్కామానలప్రియే ॥ 53

**విరాట్ ఛందః, క్లీం బీజమ్, స్వాహా శక్తిః**

శ్లో॥ ఆచక్రాయహృదాఖ్యాతం విచక్రాయ శిరోఽపి చ ।
సుచక్రాయ శిఖాపశ్చాత్ త్రైలోక్యరక్షణం తతః ॥ 54

శ్లో॥ చక్రాయ కవచం ప్రోక్తమసురాన్తకశబ్దతః ।
చక్రాయాస్త్రమిదం కుర్యాదఙ్గానాం పంచకం మనోః ॥ 55

శ్లో॥ సర్వాంగే త్రిమనుం న్యస్య వర్ణన్యాసం సమాచరేత్ ।
మస్తకే నేత్రయోః శ్రుత్యోర్నసోర్వక్త్రే హృదంబుజే ॥ 56

శ్లో॥ జఠరే లింగదేశే చ జానునోః పాదయోరపి ।
వర్ణాంస్తారపుటాన్న్యస్యేద్వ్విన్ద్వాధ్యాన్నమసాయుతాన్ ॥ 57

–ధ్యానమ్–

**శ్లో॥ వృన్దారణ్యగకల్పపాదపతలే సద్రత్నపీఠేఽమ్బుజే**
**శోణాభే వసుపత్రకే స్థితమజం పీతామ్బరాలంకృతమ్ ।**
**జీమూతాభమనేకభూషణయుతం గోగోపగోపీవృతం**
**గోవిందం స్మర సుందరం మునియుతం వేణుం రణన్తం స్మరేత్ ॥** 58

– ఇతి మంత్రమహోదధౌ – 14 తరంగః

'ఏ జన్మమునందైనను, ఏ స్థితియందైనను నిరతము నిన్ను మఱువకుండుటయే' అని శ్రీకులశేఖరాళ్వార్లు ఆ ముకుందుణ్ణి ఈ మంత్రముతో మనము భగవత్సాన్నిధ్యాన్ని చేరే సులభతరుణోపాయమును ఇట చూచించినట్లైనది.



## 4

**అవతారిక :** ఈ శ్లోకమున ఐహికాముష్మికసుఖములను వలదని చెప్పుచున్నారు.

**శ్లో॥ నాహం వన్దే తవ చరణయోర్ద్వన్ద్వమద్వన్ద్వహేతోః**
**కుమ్భీపాకం గురుమపి హరే! నారకం నాపనేతుమ్ ।**
**రమ్యా రామా మృదుతనులతా నన్దనే నాపి రన్తుం**
**భావే భావే హృదయభవనే భావయేయం భవన్తమ్ ॥** **4**

**పదవిభాగము :**

న, అహమ్, వన్దే, తవ, చరణయోః, ద్వంద్వమ్, అద్వంద్వహేతోః
కుంభీపాకమ్, గురుమ్, అపి, హరే! నారకమ్, న, అపనేతుమ్ ।

రమ్యాః రామాః మృదు–తను–లతాః, నందనే, న, అపి, రన్తుమ్,
భావే భావే, హృదయ–భవనే, భావయేయమ్, భవన్తమ్ ।

**అన్వయక్రమము :** హరే! అహమ్ అద్వంద్వహేతోః తవ చరణయోః ద్వంద్వం న వన్దే. గురుమ్ కుంభీపాకం నారకమ్ అపనేతుమ్ అపి న వందే, నందనే రమ్యాః రామాః మృదు–తను–లతాః రామాః రంతుమ్ అపి న వందే. భావే భావే హృదయ–భవనే భవంతం భావయేయమ్.

**ప్రతిపదార్థము :**

హే హరే! = ఓ హరీ,
అహమ్ = నేను,
అద్వంద్వహేతోః + అపి = ద్వంద్వాతీతస్థితి లేకుండుటకై
తవ = నీ
చరణయోః = పాదములయొక్క
ద్వంద్వమ్ = జంటను
న వందే = సేవింపను
గురుమ్ = ఓర్వరానిదైన
కుంభీపాకమ్ = కుంభీపాకమును
నారకమ్ = నరకమును
అపనేతుమ్ అపి = పోగొట్టుకోనుటకు కూడ,
న వందే = సేవింపను.
నందనే = నందనవనమునో (ఇంద్రుని యుద్యానవనములో)
మృదు–తను–లతాః = మృదువైన తీగలవంటి దేహముగల,
రమ్యాః = అందమైన,
రామాః = స్త్రీలను గూర్చి,
రంతుమ్ అపి = రమించుటకున్ను
న వందే = సేవింపను.
భావే భావే = ప్రతి తలంపునందును,
హృదయ–భవనే = హృదయమనే గూటి యందు
భవంతమ్ = నిన్ను
**భావయేయమ్** = భావింతును.

**తాత్పర్యము :** ఓ హరీ! నీ పాదద్వంద్వమును ద్వంద్వాతీతస్థితిలేకుండుట కొఱకున్ను సేవింపను, ఓర్వరానిదైన కుంభీపాకమను నరకమును పోగొట్టుకొనుటకు కూడ సేవింపను. నందనోద్యానవనంలో మృదువైన తీగలవంటి దేహముగల అందమైన స్త్రీల తోడ రమించుటకున్ను సేవింపను. ప్రతి తలంపునందును హృదయమనే గూటియందు నిన్ను (నిరతము) భావింతును. ఓ స్వామీ.

ఈ శ్లోకమునకు పూర్వులు అందించిన **వేఱర్థము** ఇట యథాతథంగా ఇవ్వబడుచున్నది.

(అ = అకారవాచ్యుడా!, ద్వందహేతోః = భార్యాభర్తల చేరిక వలన గలుగు ద్వంద్వసుఖమునకుగాను, నాహం వందే తవ చరణయోర్ద్వంద్వమ్ = నీ చరణద్వయమును సేవింపనేరను, హరే! = ఓ హరీ, ఆప = ఈశ్వరాంతరరహితా = అనగా అధికుడా!, నారకమ్ = అనేక మనుజులు సుఖపడునట్టి, కుంభీపాకమ్ = పాత్రమున చేయబడిన వంటను, గురుమపి = అధికముగానైనను, న నేతుమ్ = తీసుకొనుటకు సేవింపను, అనేకులు సుఖపడునట్లు అధికముగ వంటలు కావలెనని కోరను; నందనేన = కుమారునితో గూడి, రమ్యాః = సుందరులు, మృదుతనులతాః = కోమలమైన తీగవంటి మేనులు గల, రామాః = స్త్రీలను, న రంతుమపి = అనుభవించుటకు నమస్కరింపను.)

**పాఠాంతరాలు :**

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. న - అవ్యయము; 2. అహమ్ - **అహమ్** - ఆవామ్ - వయమ్, దకారాన్తః, పుంలిఙ్గః, అస్మత్ శబ్దః, ప్ర.ఏ; 3. తవ - **తవ/తే** - యువయోః/వామ్ - యుష్మాకమ్/వః, దకారాన్తః, పుంలిఙ్గః, యుష్మచ్ఛబ్దః, ష.ఏ; 4. ...హేతోః (హితున్) - **...హేతోః** - ...హేత్వోః - ...హేతూనామ్, ఉకారాన్తః, పుంలిఙ్గః, ...హేతుశబ్దః, ష.ఏ; 5. చరణయోః - చరణస్య - **చరణయోః** - చరణానామ్, అకారాన్తః, పుంలిఙ్గః, చరణశబ్దః, ష.ద్వి; 6. ద్వంద్వమ్ (ద్వౌ ద్వౌ సహాభివ్యక్తౌ) - **ద్వంద్వమ్** - ద్వంద్వౌ - ద్వంద్వాన్, అకారాన్తః, పుంలిఙ్గః, ద్వంద్వశబ్దః, ద్వి.ఏ; 7. గురుమ్ - **గురుమ్** - గురూ - గురూన్, ఉకారాన్తః, పుంలిఙ్గః, గురుశబ్దః, ద్వి.ఏ; 8. కుంభీపాకమ్ (కుంభీపచ్/ ఘఞ్) - **కుంభీపాకమ్** - కుంభీపాకౌ - కుంభీపాకాన్, అకారాన్తః, పుంలిఙ్గః, ఏవం నారకః, కుంభీపాకశబ్దః, ద్వి.ఏ; 9. అపనేతుమ్ - అవ్యయము - అప, ణీఞ్-ప్రాపణే,

నేతుమ్ – తుమున్ ప్రత్యయాంతమ్; 10. నందనే – **నందనే** – నందనయోః – నందనేషు, అకారాన్తః, పుంలిఙ్గః, నందనశబ్దః, స.ఏ; 11. రామాః – రామామ్ – రామే – రామాః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, రామాశబ్దః, ద్వి.బ; ఏవం ... లతాః, రమ్యా చ; 12. రంతుమ్ – అవ్యయము, – రము – క్రీడాయామ్, తుమున్ ప్రత్యయాంతమ్; 13. అపి – అవ్యయము; 14. హృదయభవనే – **...భవనే** – ...భవనయోః – ...భవనేషు, అకారాన్తః, నపుం., భవనశబ్దః, స.ఏ; 15. వందే – 'వది' అభివాదనస్తుత్యోః, భ్వాది, సకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లట్ – ఉ.ఏ; 16. భావయేయమ్ – భూ సత్తాయామ్, భ్వాది, అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, ణిచ్ వి.లిజ్, ఉ.ఏ; 17. భావే భావే – ద్విరుక్తభావశబ్దః, అకారాన్తః, పుంలిఙ్గః, సప్తమీ ఏకవచనాంతః; 18. హరే! – **(హే) హరే!** – (హే) హరీ! – (హే) హరయః, ఇకారాన్తః పుంలిఙ్గో హరిశబ్దః, సం.ప్ర.ఏ.

**క్రియాదర్శము :**

1. భావయేయమ్ – భ్వాది – వి.లిజ్ – ణిచ్, ఉ.ఏ.

| | | |
|---|---|---|
| భావయేత్ | భావయేతామ్ | భావయేయుః |
| భావయేః | భావయేతమ్ | భావయేత |
| **భావయేయమ్** | భావయేవ | భావయేమ |

2. వందే – భ్వాది – లట్ – ఉ.ఏ.

| | | |
|---|---|---|
| వన్దతే | వన్దేతే | వన్దన్తే |
| వన్దసే | వన్దేథే | వన్దధ్వే |
| **వన్దే** | వన్దావహే | వన్దామహే |

**ఛందస్సు :** 1. అత్యష్టి 2. **మందాక్రాన్తా**

**లక్షణము :** మందాక్రాన్తామ్బుధిరసనగైర్మోభనౌ తౌ గయుగ్మమ్

**శ్లోకపాదము / గణవిభజన** 17 అక్షరాలు (4, 6, 7)

| | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| నా | హం | వ | న్దే | త | వ | చ | ర | ణ | యో | ర్ద్వం | ద్వ | మ | ద్వం | ద్వ | హే | తోః |
| U | U | U | U | I | I | I | I | I | U | U | I | U | U | I | U | U |
| | మ | | | భ | | | న | | | త | | | త | | గ | గ |

**పదాదర్శము :**

1. **హరిః** (హరతి పాపానీతి। హృ + 'హృపిషిరుహీతి' ఇన్) విష్ణుః - అని హలాయుధకోశము.

అ) శ్లో॥ విష్ణుః కృష్ణః కేశవో మంజుకేశీ
శ్రీవత్సాఙ్కః శ్రీపతిః పీతవాసాః ।
విష్వక్సేనో విశ్వరూపో మురారిః
శౌరిః శార్ఙ్గీ పద్మనాభో **ముకుందః** ॥ 21

శ్లో॥ గోవిందో ధరణిధరః సుపర్ణకేతు -
ర్వైకుణ్ఠో జలశాయనశ్చతుర్భుజశ్చ ।
దైత్యారిర్మధుమథనో రథాఙ్గపాణి -
ర్దాశార్హః క్రతుపురుషో వృషాకపిః స్యాత్ ॥ 22

శ్లో॥ జనార్దనాధోక్షజవాసుదేవం దామోదరం శ్రీధరమచ్యుతం చ ।
ఉపేన్ద్రమిన్ద్రావరజం చ బభ్రం **హరిం** హృషీకేశముదాహరన్తి ॥ 23

శ్లో॥ ఆత్మభూః పుండరీకాక్షః శ్రీవత్సో విష్టరశ్రవాః ।
నారాయణో జగన్నాథో వనమాలీ గదాధరః ॥ 24

శ్లో॥ సనాతనో జినః శంభుర్విధిర్వేధా గదాగ్రజః ।
కైటభారిరజో జిష్ణుః కంసజిత్పురుషోత్తమః ॥ 25

ఇలా **'హలాయుధకోశము'** 56 నామములను 'హరి'కి పేర్కొన్నది.

ఆ) మహామంత్రము : శ్లో॥ **హరే! కృష్ణ! హరే! కృష్ణ!**
**కృష్ణ! కృష్ణ! హరే! హరే! ।**
**హరే! రామ! హరే! రామ!**
**రామ! రామ! హరే! హరే! ॥**

ఇది **యాజుషీయకలిసంతారణోపనిషత్** నందలి మంత్రభాగము.
**ఇతి షోడశకం నామ్నాం కలికల్మషనాశనమ్,**

శ్లో॥ యద్దివ్యనామస్మరతాం సంసారో గోష్పదాయతే ।
స్వానన్యభక్తిర్భవతి తద్రామ పరమాశ్రయే ॥

ఓం సహనావవత్వితి శాంతిః

ఇ) సచ్చిదానందభక్తివినోదఠాగూర్‌వారి మహామంత్రవ్యాఖ్య యథాతథంగా ఇవ్వబడుతుంది.

హరే! – నా మనస్సును హరించి సంసారబంధమునుండి విడిపింపుము.

కృష్ణ! – నా చిత్తము నాకర్షింపుము.

హరే! – నీ మాధుర్యముచే నా మనస్సును హరించుము.

కృష్ణ! – నీ భక్తులద్వారా భక్తిని ప్రసాదించి నా చిత్తమును శోధింపుము.

కృష్ణ! – నీ నామరూపగుణలీలాదులందు నాకు నిష్ఠను కల్గింపుము.

కృష్ణ! – నాకు నీయందు రుచి కల్గించుము.

హరే! – నీకు సేవచేయుటకు యోగ్యతను కల్గింపుము.

హరే! – నీకు సేవచేయుటకు నన్నాదేశింపుము.

హరే! – నీ ప్రియతమభక్తులతో కలసి నీకభీష్టమగు లీలను నేను దర్శించునట్లు చేయుము.

రామ! – నీ నామరూపగుణలీలాదులయందు నన్ను వినియోగింపుము.

హరే! – ఓ రాధికా! నీ ప్రియతముడగు శ్రీకృష్ణునితో కూడా నీ అభీష్టలీలను నాకు సందర్శింపచేయుము.

రామ! – నీ సేవకు యోగ్యునిగా నన్నొనర్పుము.

రామ! – ఓ రాధారమణా! నీ ప్రియతమయగు రాధతో గూడి నీ అభీష్టలీలను దర్శనము చేయించుము.

రామ! – అంతరంగభక్తులతో క్రీడించు కృష్ణా! నన్ను నీ నామరూపలీలా స్మరణాదులయందు సంబంధము కలిగియుండువానినిగా చేయుము.

హరే! – నన్ను నీవానినిగా అంగీకరించి నీతో క్రీడించునట్లు చేయుము.

హరే! – నన్ను నీవైపు ఆకర్షించి నాతో రమింపుము.

ఈ మహామంత్రము సాక్షాత్ ఉపనిషత్సారము. శ్రీకులశేఖరాళ్వార్లు రచించిన 'ముకుందమాలా' స్తోత్రమునందలి నాల్గవ శ్లోకమున్నూ ఉపనిషత్ సారమే. జ్ఞానప్రదాయినీ.

ఉ) ఇట శ్రీ కోదండరామసేవకధర్మసమాజము – దాసకుటి, అంగలకుదురు వారు 1953లో ప్రచురించిన **'శ్రీశ్రీ మహామంత్రకల్పతరువు'** గ్రంథమును అనుసంధానము చేసుకుందురుగాక.



**5**

**అవతారిక :** ఈ శ్లోకమున సుఖములకు హేతువుగ నుండు 'ధర్మార్థకామము'లను పురుషార్థములందును 'ఆశ' లేదని చెప్పుచున్నారు.

**శ్లో॥ నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే**
**యద్యద్భవ్యం భవతు భగవన్! పూర్వకర్మానురూపమ్ ।**
**ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాన్తరేఽపి**
**త్వత్పాదామ్భోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు ॥ 5**

**పదవిభాగము :**

న + ఆస్థా, ధర్మే, న, వసు–నిచయే, న + ఏవ, కామ + ఉపభోగే,
యత్ + యత్, భవ్యమ్, భవతు, భగవన్!, పూర్వ–కర్మ–అనురూపమ్ ।
ఏతత్, ప్రార్థ్యమ్, మమ, బహుమతమ్, జన్మజన్మాన్తరే + అపి,
త్వత్ + పాద + అంభోరుహ–యుగ–గతా, నిశ్చలా, భక్తిః, అస్తు ॥

**అన్వయక్రమము :** (హే) భగవన్! మమ ధర్మే ఆస్థా న. వసు–నిచయే ఆస్థా న. కామ + ఉపభోగే ఆస్థా న + ఏవ, పూర్వ–కర్మ–అనురూపం యత్ యత్ భవ్యం (తత్) భవతు. ఏతత్ మమ బహుమతం ప్రార్థ్యమ్. జన్మజన్మాంతరే + అపి త్వత్ + పాద + అంభోరుహ–యుగ–గతా నిశ్చలా భక్తిః మమ అస్తు.

**ప్రతిపదార్థము :**

(హే) భగవన్! = ఓ స్వామీ,

మమ = నాకు,

ధర్మే = ధర్మమునందు,

ఆస్థా న = ఆసక్తి లేదు.

వసు-నిచయే = ధనరాశియందు

ఆస్థా న = ఆసక్తి లేదు.

కామ + ఉపభోగే = కామభోగాలనుభవించుటయందును

ఆస్థా న + ఏవ = ఆసక్తి లేనే లేదు.

పూర్వ-కర్మ-అనురూపమ్ = గతములో చేసిన కర్మకు తగినట్లు

యత్ యత్ = ఏదేది

భవ్యమ్ = జరుగదగియున్నదో (తత్ = అది)

భవతు = అగుగాక.

ఏతత్ = ఇది,

మమ = నాకు

బహుమతమ్ = అభీష్టమైనది,

ప్రార్థ్యమ్ = కోరదగినది.

జన్మ-జన్మాంతరేఽపి = ప్రతి జన్మమునందును,

త్వత్ + పాద-అంభోరుహ-యుగ-గతా = నీ పాదపద్మముల జంట యందు అచంచలమైన,

నిశ్చలా = దృఢమైన,

భక్తిః = భక్తి,

మమ = నాకు,

**అస్తు** = కలుగుగాక.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నాకు ధర్మమునందు ఆసక్తిలేదు. ధనరాశియందు ఆసక్తి లేదు. కామభోగాలనుభవించుటయందును ఆసక్తి లేనే లేదు. పూర్వం చేసిన కర్మకు తగినట్లు ఏదేది జరుగదగియున్నదో అది జరుగుగాక. ఇది నాకు అభీష్టమైనది, కోరదగినది. ప్రతి జన్మమునందును నీ పాదపద్మముల జంటయందు దృఢమైన భక్తి నాకు కలుగుగాక.

**పాఠాంతరాలు :** 1. యద్యద్భవ్యం భవతు - యద్భావ్యం తద్భవతు.

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. హే భగవన్! - **హే భగవన్!** - హే భగవన్తౌ! - హే భగవన్తః, తకారాన్తః పుంలిఙ్గో, భగవత్‌శబ్దః, సం.ప్ర.ఏ; 2. మమ - దకారాన్తః, పుంలిఙ్గోఽస్మచ్ఛబ్దః, షష్ఠీవిభక్తీ, ఏకవచనాంతః; 3. ధర్మే - (ధ్రియేతి లోకోఽనేన ధరతి లోకం వా ధృమన్) - **ధర్మే** - ధర్మయోః - ధర్మేషు, అకారాన్తః, పుంలిఙ్గో ధర్మశబ్దః, స.ఏ; 4. ఆ స్థా - (ఆ స్థా అఙ్) - **ఆస్థా** - ఆస్థే - ఆస్థాః, ఆకారాన్తః, స్త్రీలింగః, ఆస్థాశబ్దః, ప్ర.ఏ; 5. ...భోగే - **...భోగే** - ...భోగయోః - ...భోగేషు, అకారాన్తః, పుంలిఙ్గః, ...భోగశబ్దః, స.ఏ; 6. అనురూపమ్ - రూపస్య సాదృశ్యం యోగ్యత్వం వా - అవ్యయము; 7. భవ్యమ్ - భూ - యత్ ప్రత్యయాన్తము, కృద్వృత్తి, **భవ్యం** - భవ్యే - భవ్యాని; అకారాన్తః, నపుం., భవ్యత్‌శబ్దః, ప్ర.ఏ; 8. ...జన్మాంతరే - **...అన్తరే** - ...అన్తరయోః - ...అన్తరేషు, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ...అంతరశబ్దః, స.ఏ; 9. ...యుగగతా - **...గతా** - ...గతే - ...గతాః, ఆకారాన్తః స్త్రీలింగో గతాశబ్దః, ప్ర.ఏ; 10. నిశ్చలా - (నిర్ చల్ అచ్ టాప్) - **నిశ్చలా** - నిశ్చలే - నిశ్చలాః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గో నిశ్చలాశబ్దః, ప్ర.ఏ; 11. భక్తిః - (భజ్ క్తిన్) - **భక్తిః** - భక్తీ - భక్తయః, ఇకారాన్తః, స్త్రీలిఙ్గో భక్తిశబ్దః, ప్ర.ఏ; 12. అస్తు - అస(అస్) భువి (ఉండుట) అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, ప్ర.ఏ; 13. యత్ - **యత్** - యే - యాని, దకారాన్తః, నపుం.లిఙ్గః, యత్ శబ్దః, ప్ర.ఏ; 14. బహుమతమ్ - (బహుభిర్మతమ్), **బహుమతమ్** - బహుమతే - బహుమతాని, అకారాన్తః, నపుంసకలింగః, ప్ర.ఏ.

**క్రియాదర్శము :** అస్తు - 3వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**ఛందస్సు :** 1. అత్యష్టి, 2. **మందాక్రాన్తా.** - 4వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :** ఈ శ్లోకమున పరమపురుషార్థముగా **'భక్తి'**నే కోరుచున్నాడు.

**భక్తిః** - అ) భజ్యతే ఇతి, భజ్ + క్తిన్, స్త్రీలింగ ఇకారాన్తశబ్దః, ఈశ్వరే పరానురక్తిః

శ్లో॥ అన్యాభిలాషితాశూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్ ।
ఆనుకూల్యేన కృష్ణానుశీలనం **భక్తి**రుచ్యతే ॥
- భక్తిరసామృతసింధౌ

శ్లో॥ నాథ! యోనిసహస్రేషు యేషు యేషు వ్రజామ్యహమ్ ।
తేషు తేష్వచ్యుతా భక్తిరచ్యుతాస్తు సదా త్వయి ॥

శ్లో॥ యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ ।
త్వామనుస్మరతః సా మే హృదయాన్మాఽపసర్పతు ॥
- ఇతి విష్ణుపురాణే (1-20/18, 19)
- ప్రహ్లాదకృతా - శ్రీనరసింహస్తుతిః నామ పారిజాతస్తోత్రరాజమ్

ఆ) శ్రీచైతన్యమహాప్రభువులవారు తన **'శిక్షాష్టకమ్'**లో ఇలా పేర్కొన్నాడు.

శ్లో॥ న ధనం న జనం న సుందరీం
కవితాం వా జగదీశ! కామయే ।
మమ జన్మని జన్మనీశ్వరో
భవతాద్ **భక్తి**రహైతుకీ త్వయి ॥

'ఓ జగదీశ్వర! నాకు ధనము వలదు, సుందరులు వలదు, కవిత్వము వలదు, జన్మజన్మాంతరాల్లో నీయందు అహేతుకమైన భక్తి నెలకొని ఉండుగాక' అని దేవుడిని అర్థించాడు ఈ శ్లోకములో.

**'మనకేదో ఆపద కలిగితేనో, అవసరము కలిగితేనో భగవంతుడు గుర్తుకు వస్తాడు. అలా కాకుండా ఆపదకలిగినా, కలగకపోయినా, అవసరము ఏర్పడినా, ఏర్పడకపోయినా భగవంతుడు అనుకోకుండా గుర్తుకురావాలి.'**

ఇ) శివమహాపురాణమున 'పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఏం కావాలి' అని అడిగినపుడు అగస్త్యమహర్షి అన్న మాటలు చూడండి.

**శ్లో॥ శివే భక్తిః శివే భక్తిః శివే భక్తిః భవే భవే ।**
**సదా భూయాత్ సదా భూయాత్ సదా భూయాత్ సునిశ్చలా ॥**

శివే భక్తిః శివే భక్తిః శివే భక్తిః - శివునియందు భక్తి, శివునియందు భక్తి, శివునియందు భక్తి, సదా భూయాత్ సదా భూయాత్ సదా భూయాత్ - ఎప్పుడూ కలుగుగాక, ఎప్పుడూ కలుగుగాక, ఎప్పుడూ కలుగుగాక!, ఎలాంటి భక్తి అంటే సునిశ్చలా - నిశ్చలా అంటే చలించకుండా ఉండి స్థిరమైనది, సునిశ్చలా అంటే బాగా స్థిరమైన భక్తి కావాలి. ఎప్పుడు కావాలి? అంటే నిరతమూ కావాలి. ఈ జన్మ చాలించితే? మరో జన్మ కలిగినా శివభక్తి ఉంటే చాలు అన్నాడు. అందుకే భవే భవే అన్నాడు. భవే భవే అంటే జన్మజన్మలకి అని, ప్రతి జన్మలోను అని.

మనం జ్ఞానమార్గంలో, వేదాంతమార్గములో, మోక్షమార్గములో మాట్లాడే వాళ్ళు ఏమంటారు అంటే జన్మలేకుండా ఉంటే చాలు అంటారు. భక్తుడు ఏమంటాడంటే **'ఏజన్మవచ్చినా, ఏ స్థితిలోనైనా ఉండనీ, నీపై భక్తి ఉంటే చాలు'** అంటాడు – అంటుంది సనాతనహిందూధర్మం.

ఈ) శ్లో॥ రామ! రామ! దయాసింధో! రావణారే! జగత్పతే! ।
**త్వత్పాదకమలాసక్తిర్భవేజ్జన్మని జన్మని ॥**
– శ్రీరామకర్ణామృతము 3-110

ఓ రామా! రామా! దయాసముద్రుడా! నీ పాదపద్మములయందాసక్తి ప్రతిజన్మమందు నగుగాక.

ఉ) ఇట **'నారదభక్తిసూత్రాలు'** అనుసంధానము చేసుకొనదగును.

ఊ) శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥

భగవత్కథాశ్రవణము, ఈశ్వరమహిమాసంకీర్తనము, భగవన్నామస్మరణ, విష్ణుపాదసేవ, పూజ, నమస్కరించుట, దాసానుదాసుడగుట, స్నేహము, ఆత్మనివేదనము – ఈ తొమ్మిదిన్నీ భక్తిసోపానములుగా చెప్పబడినవి.

ఎ) శ్లో॥ స్వస్వరూపానుసంధ్యాం **భక్తి**రిత్యభిధీయతే ।
స్వాత్మతత్త్వానుసంధానం **భక్తి**రిత్యపరే జగుః ॥
– వివేకచూడామణిః

'నేను' అనుదాని స్వరూపమేమో అవగాహన చేసికొనుటకు చేయు నిరంతర విచారమే **'భక్తి'** యని కొందఅందురు. ఆత్మవస్తువివేకవిచారమే **'భక్తి'** యని మఱికొంద అందురు.

ఏ) శ్లో॥ కర్మణా జాయతే భక్తిః, భక్త్యా జ్ఞానం ప్రజాయతే ।
జ్ఞానాత్ ప్రజాయతే ముక్తిః, ఇతి శాస్త్రార్థసంగ్రహః ॥

కర్మలవల్ల భక్తి కలుగుచున్నది, భక్తిమూలమున జ్ఞానము కలుగుచున్నది. జ్ఞానమువల్ల మోక్షము కలుగుచున్నదని శాస్త్రనిర్ణయము.

ఐ) సద్భక్తుని లక్షణాలను శ్రీ యథావాక్కుల అన్నమయ్య తన 'సర్వేశ్వర శతకము' (55)లో ఎలా స్పష్టంగా చెప్పారో చూడండి.

సత్యం బెప్పుడు తప్పఁడేనియు దురాచారుండుగాఁడేని యౌ
చిత్యంబేమఱఁడేని దుర్జనుల గోష్ఠింబొందఁడే భక్తసాం
గత్యంబాదటఁ బాయఁడేని మదనగ్రస్తుండు గాఁడేని నీ
భృత్యుండాతఁడు మూఁడు లోకములలోఁ బూజ్యుండు సర్వేశ్వరా!

'సర్వేశ్వరా! ఎప్పుడూ సత్యం తప్పనివాడూ, దురాచారుడు కానివాడూ, ఔచిత్యాన్ని విస్మరించనివాడూ, దుర్జనసాంగత్యంలో ఉండనివాడూ, భక్తుల సాంగత్యాన్ని ప్రేమతో విడువనివాడూ, కాముకుడు కానివాడూ నీ సేవకుడవుతాడు. అలాంటివాడు ముల్లోకాల్లో పూజ్యుడవుతాడు.'



## 6

**అవతారిక :** ఈ శ్లోకమున 'అంత్యసమయముననను నీ పాదద్వయచింతనయే చేయుదు'నని చెప్పుచున్నాడు.

**శ్లో॥ దివి వా భువి వా మమాస్తు వాసో**
**నరకే వా నరకాన్తక! ప్రకామమ్ ।**
**అవధీరిత-శారదారవిన్దౌ**
**చరణౌ తే మరణేఽపి చిన్తయామి ॥ 6**

**పదవిభాగము :**

దివి, వా, భువి, వా, మమ + అస్తు, వాసః,
నరకే, వా, నరక + అన్తక! ప్రకామమ్ ।
అవధీరిత – శారద + అరవిందౌ,
చరణౌ, తే, మరణే + అపి, చింతయామి ।

**అన్వయక్రమము :** నరక + అన్తక! మమ దివి వా భువి వా నరకే వా ప్రకామ్యమ్ వాసః అస్తు. అవధీరిత – శారద + అరవిందౌ తే చరణౌ మరణే + అపి చింతయామి.

**ప్రతిపదార్థము :**

నరక + అన్తక! = నరకుడనే పేరుగల అసురుని సంహరించినవాడా!
మమ = నాకు,
దివి వా = దేవలోకమునందైననూ,
భువి వా = భూలోకమునందైననూ,
నరకే వా = నరకమునందైననూ
ప్రకామమ్ = నీ కిష్టమైన తీరుగ
వాసః = నివాసము
అస్తు = ఉండును గాక.
అవధీరిత - శారదారవిందౌ = శరదృతువునందలి తామరపుష్పాలను త్రోసిపుచ్చజాలిన,
తే = నీయొక్క
చరణౌ = పాదములను
మరణే + అపి = అంతిమగడియలయందు కూడ
**చింతయామి** = ధ్యానించుచుందును.

**తాత్పర్యము :** 'నరకుడు' అనే పేరుగల అసురుని సంహరించినవాడా! నాకు దేవలోకము నందైననూ, భూలోకమునందైననూ, నరకమునందైననూ నీకిష్టమైన తీరుగ నివాస ముండును గాక. శరదృతువునందలి తామరపుష్పాలను త్రోసిపుచ్చజాలిన నీయొక్క పాదములను అంతిమగడియలయందు కూడ ధ్యానించుచుందును ఓ స్వామీ.

**పాఠాంతరాలు : 1. చిన్తయామి - చిన్తయేయమ్.**

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. నరకాన్తక! - **హే నరకాంతక!** - హే నరకాన్తకౌ - హే నరకాన్తకాః, అకారాన్తః, పుంలిఙ్గ, నరకాన్తకశబ్దః, సం.ప్ర.ఏ; 2. దివి - **దివి** - దివోః - ద్యుషు, వకారాన్తః, నిత్యస్త్రీలిఙ్గః, దివ్‌శబ్దః, స.ఏ; 3. భువి - **భువి** - భువోః - భ్యుషు, వకారాన్తః, స్త్రీలిఙ్గః, భువ్‌శబ్దః, స.ఏ; 4. నరకే - **నరకే** - నరకయోః - నరకేషు, అకారాన్తః, పుంలిఙ్గః, నరకశబ్దః, స.ఏ; 5. వాసః - (వస్ ఘఞ్) (వాస్ అచ్) - **వాసః** - వాసౌ - వాసాః, అకారాన్తః, పుంలిఙ్గః, వాసశబ్దః, ప్ర.ఏ; 6. ప్రకామమ్ - (ప్ర కమ్ ణ్వుల్) అవ్యయము;

7. ...అరవిందౌ – ...అరవిందమ్ – **...అరవిందౌ** – ...అరవిందాన్, అకారాన్తః, పుంలిఙ్గః, ...అరవిందశబ్దః, ద్వి.ద్వి; 8. చరణౌ – చరణమ్ – **చరణౌ** – చరణాన్, అకారాన్తః, పుంలిఙ్గః, చరణశబ్దః, ద్వి.ద్వి; 9. మరణే – **మరణే** – మరణయోః – మరణేషు, అకారాన్తః, నపుం., మరణశబ్దః, స.ఏ; 10. చింతయేయమ్ – చురాది – చితి (చిన్త్) స్మృత్యామ్ (చింతించుట) వి.లిఙ్, ఉ.ఏ., అకర్మకమ్, సేట్, పరస్మైపదీ.

**క్రియాదర్శము : చింతయేయమ్** – వి.లిఙ్. ఉ.ఏ.

| | | |
|---|---|---|
| చిన్తయేత్ | చిన్తయేతామ్ | చిన్తయేయుః |
| చిన్తయేః | చిన్తయేతమ్ | చిన్తయేత |
| **చిన్తయేయమ్** | చిన్తయేవ | చిన్తయేమ |

**ఛందస్సు : మాలాభారిణీ**

**లక్షణము :** 'విషమే ససజా యదా గురు చేత్ ।
సభరా యేనతు **మాలాభారిణీ**యమ్ ।' – ఛందోమంజరీ

**శ్లోకపాదము / గణవిభజన** అర్ధసమవృత్తమ్

1. ది వి వా భు వి వా మా మా స్తు వా సో – ప్రథమపాదం (11 అక్షరాలు)
I I U I I U I U I సససజగగ
స స జ గ గ

2. న ర కే వా న ర కాం త క ప్ర కా మమ్ – ద్వితీయపాదం (12 అక్షరాలు)
I I U U I I U I U I U U సభరయ
స భ ర య

**పదాదర్శము :**

చింతయామి : ఈ శ్లోకమున చింతయేయమ్ అను పదమునకు చింతయామి అను పదము పాఠాంతరముగ చెప్పబడినది.

అ) చితి (చిన్త్) స్మృత్యామ్ చింతించుట, అకర్మకమ్, సేట్, చురాది, లట్, ఉ.ఏ

ఆ) **'జయచంద్రచామరాజవడయార్'** మైసూర్ మహారాజావారిచే చేయబడిన ఈ కృతిని చూడుడు. తొలుత వారిచే తెలుగుభాషయందు చేయబడినది.

పల్లవి: **చింతయామి** జగదంబ చాముణ్డాంబ
చిత్తరంజన దివ్యకాన్తి చిప్రభ
(చింతయామి)

అ.ప.: చిరాప్రమిత వర్య నయనాం హర్యవర్మదం
చంద్రప్రభ సమ మందహాసవదనామ్
(చింతయామి)

చ : తత్వప్రకాశక కరకరూప ప్హ్లాదాత్మిక
జ్ఞానతీర్థ జ్యోతిస్వరూప
తుంబురు నారదాది సేవిత చరణారవింద తాన
లయ మూర్ఛనయుత హిందోళప్రీతమ్
(చింతయామి)

ఇ) శ్లో॥ చింతయామి హరిరేవ సంతతం
మందహాసముదితాననాంబుజమ్ ।
నందగోపతనయం పరాత్పరం
నారదాది మునిబృంద వందితమ్ ॥

శ్రీవారిని చింతన చేయవలెను. అది శుభప్రదము. శుభమన మోక్షమనియే. హరినిమాత్రమే చింతన చేయవలెను. హరిని మాత్రమే నిరతము నిష్ఠగా చింతించుచున్నా నని చెప్పుచున్నాడు కవి. అది ఎల్లప్పుడూ మనఃపూర్వకముగ చేయవలసినది. (ప్రహ్లాదాదులు నిద్రలో కూడ హరినామస్మరణము మరువలేదుగదా). 'హరినామస్మరణము' జరుగునప్పుడు శ్రీహరియొక్క సుందరాతిసుందరమైన ముఖారవిందమును, అది అనుగ్రహపూర్వకముగా చిందించుచున్న చిఱునవ్వులను మనస్సులో రూపుకట్టవలెను. ఆ శ్రీహరి నందగోపునకు దయతో కుమారుడైనవాడు. ఆయన పరాత్పరుడు ఆయనకు నిజముగ తండ్రి యెవడు? అది నందుడు చేసుకొన్న పూర్వపుణ్యప్రభావముచేతనేగదా!, ఆ శ్రీహరి నారదాదుల హృదయములలో నిత్యనివాసియై యుండును. ఆ మహాత్ములకు శ్రీహరి స్మరణ కీర్తనములు తప్ప వేరు కార్యక్రమములే యుండవుగదా! అంటుంది 'శ్యామలీయం'. ధన్యోఽస్మి.



**7**

**అవతారిక :** ఈ శ్లోకమున 'శ్రీకులశేఖరాళ్వార్లు' తన 'మనస్సు అనే రాజహంస' 'కృష్ణపదపంకజపంజరాన్తము'ను అంతిమగడియలకు ముందుగనే చేరుగాక - అని ప్రార్థించుచున్నారు.

**శ్లో॥ కృష్ణ! త్వదీయపదపఙ్కజపఞ్జరాన్త -**
**మద్యైవ మే విశతు మానసరాజహంసః ।**
**ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః**
**కణ్ఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే ॥ 7**

**పదవిభాగము :**

కృష్ణ! త్వదీయ - పద - పంకజ - పంజర + అన్తమ్,
అద్య + ఏవ, మే, విశతు, మానస - రాజహంసః ।
ప్రాణ - ప్రయాణ - సమయే, కఫ - వాత - పిత్తైః,
కణ్ఠ + అవరోధన - విధౌ, స్మరణమ్, కుతః + తే ॥

**అన్వయక్రమము :** (హే) కృష్ణ! మే మానసరాజహంసః త్వదీయపదపంకజపంజరాన్తమ్ అద్యైవ విశతు, ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః కంఠ - అవరోధన - విధౌ తే స్మరణమ్ కుతః.

**ప్రతిపదార్థము :**

(హే) కృష్ణ! = హే కృష్ణ!
మే = నాయొక్క
మానస - రాజహంసః = మనస్సనెడి రాయంచ,
త్వదీయ-పదపంకజ-పంజర+అంతమ్ = నీయొక్క పాదపద్మములనెడి పంజరములో
అద్యైవ = ఇప్పుడే
విశతు = ప్రవేశించుగాక.
ప్రాణప్రయాణసమయే = ప్రాణములు పోవు చివరి గడియల్లో,
కఫ - వాత - పిత్తైః = కఫవాతపైత్యములచేత,

కంఠావరోధవిధౌ = గొంతుక కొట్టుకులాడుతున్నప్పుడు,
తే = నీయొక్క,
స్మరణమ్ = ధ్యానము,
కుతః = ఎట్లు? (భవేత్ = సంభవించును)

**తాత్పర్యము :** హే కృష్ణ! నాయొక్క మనస్సనెడి రాయంచ నీయొక్క పాదపద్మములనెడి పంజరములో ఇప్పుడే ప్రవేశించుగాక. ప్రాణములు పోవు చివరి గడియల్లో గొంతుక కొట్టుకులాడుతున్నప్పుడు నీయొక్క ధ్యానము ఎట్లు? (సంభవించును)

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. (హే) కృష్ణ! – **(హే) కృష్ణ!** – (హే) కృష్ణౌ! – (హే) కృష్ణాః, అకారాన్తః, పుంలిఙ్గః, కృష్ణశబ్దః, సం.ప్ర.ఏ; 2. ...అంతమ్ – **...అంతమ్** – ...అన్తౌ – ...అన్తాన్, అకారాన్తః పుంలిఙ్గః, ...అంతశబ్దః, ద్వి.ఏ; (అమ్ తన్, అన్తః 3. అద్య, ఏవ, కుతః (కస్మాదిత్యర్థే) – అవ్యయాలు; 4. ...హంసః – **...హంసః** – ...హంసౌ – ...హంసాః, అకారాన్తః, పుంలిఙ్గః, ...హంసశబ్దః, ప్ర.ఏ; 5. ...సమయే – **...సమయే** – ...సమయోః, ...సమయేషు, అకారాన్తః, పుంలిఙ్గః, ...సమయశబ్దః, స.ఏ; 6. ...పిత్తైః – ...పిత్తేన – ...పిత్తాభ్యామ్ – **...పిత్తైః**, అకారాన్తః, నపుంసకలిఙ్గః, పిత్తశబ్దః, తృ.బ; 7. ...విధౌ – **...విధౌ** – ...విధ్యోః – ...విధిషు, ఇకారాన్తః, పుంలిఙ్గః, ...విధిశబ్దః, స.ఏ; 8. స్మరణమ్ – **స్మరణమ్** – స్మరణే – స్మరణాని; అకారాన్తః, నపుంసకలిఙ్గః, స్మరణశబ్దః, ప్ర.ఏ; 9. విశతు – విశ(విశ్) ప్రవేశనే (ప్రవేశించుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, తుదాది (6), లోట్, ప్ర.ఏ.

**క్రియాదర్శము :** లోట్ – ప్ర.ఏ.

| | | |
|---|---|---|
| **విశతు** / విశతాత్ | విశతామ్ | విశన్తు |
| విశ / విశతాత్ | విశతమ్ | విశత |
| విశాని | విశావ | విశామ |

**ఛందస్సు :** 1. ఒకటవ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు – వసంతతిలకా

**పదాదర్శము :** 1. ప్రాణప్రయాణసమయే, 2. మానసరాజహంసః.

1. అ) ప్రాణప్రయాణసమయే – ప్రాణములు పోవు చివరిగడియల్లో; సప్తమీవిభక్తి – ఏకవచనాంతః.

శ్రీ లీలాశుకులవారు తమ శ్రీకృష్ణకర్ణామృతమున ఆ దేవదేవుణ్ణి ఎలా వర్ణిస్తున్నారో, అర్థిస్తున్నారో చూడండి ఈ శ్లోకములో

**శ్లో॥ వ్యత్యస్తపాదమవతంసితబర్హిబర్హం**
**సాచీకృతాననినివేశితవేణురంధ్రమ్ ।**
**తేజఃపరం పరమకారుణికం పురస్తాత్**
**ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్ ॥** 2–22

వ్యత్యస్తపాదమ్ = వ్యత్యాసముగా నిలిపిన పాదములు గలదియు; (అనగా ఎడమపాదముపై అడ్డము సాచి నిలిపిన కుడిపాదము గలదియును),

అవతంసితబర్హిబర్హమ్ = సిగబంతిగా అవధరింపబడిన నెమలిపింఛము గలదియును,

సాచీకృతాననినివేశితవేణురంధ్రమ్ : సాచీకృత = ప్రక్కగా త్రిప్పబడిన, ఆనన = నెమ్మోమునందు, నివేశిత = నిలిపికొనిన, వేణు = పిల్లనగ్రోవియొక్క, రంధ్రమ్ = బెజ్జములు గలదియును.

పరమకారుణికమ్ = పరమకరుణామయమైనదియును అగు

పరంతేజః = పరతేజము,

మమ = నాయొక్క, ప్రాణప్రయాణసమయే, పురస్తాత్ = ఎట్టయెదుట,

సన్నిధత్తామ్ = వచ్చి నిలుచుగాక!

అద్భుతవర్ణన గావించిన శ్రీలీలాశుకులవారికి నమస్సులు.

ఆ) శ్లో॥ అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥
– భగవద్గీతే 8–5

శం.భా. – అన్తకాల ఇతి। అంతకాలే చ మరణకాలే మామేవ పరమేశ్వరం విష్ణుం స్మరన్ముక్త్వా పరిత్యజ్య కలేబరం శరీరం యః ప్రయాతి గచ్ఛతి స మద్భావం వైష్ణవం తత్త్వం యాతి నాస్తి న విద్యతేఽత్రాస్మిన్నర్థే సంశయో యాతి వా న వేతి.

ఈ శ్లోకమున 'కలేబరం ముక్త్వా యాతి' దేహమును విడిచిపెట్టి ఆత్మ పోవును – అని చెప్పుటచే ఆత్మ దేహము కంటె వేఱనియు, 'యద్భావం యాతి' అనుటవలన జీవునకీశ్వరాభేదము చెప్పబడెను.

ఇ) శ్లో॥ **భజ గోవిందం భజ గోవిందం**
**గోవిందం భజ మూఢమతే! ।**
**సంప్రాప్తే సన్నిహితే కాలే**
**నహి నహి రక్షతి డుకృఞ్ కరణే ॥**

గోవిందుని సేవించు, గోవిందుని సేవించు, ఓ మూఢమతీ! మృత్యువు దరిజేరినపుడు నీ యీ 'డుకృఞ్ కరణే' అనే వ్యాకరణసూత్రం ముందుకు వచ్చి నిన్ను రక్షించదు గదా! గోవిందుడినే సేవించవోయీ! అని అంటున్నారు జగద్గురువు శ్రీ ఆదిశంకరాచార్యులవారు తమ 'భజగోవిందమ్' సోత్రమున. గోవిందుడిని స్మరించుదుము.

2. మానసరాజహంసః – శ్రేయస్కరీస్తోత్రమ్ – 3

శ్లో॥ శ్రేయస్కరి ప్రణతపామరపారదాన –
జ్ఞానప్రదానసరణిశ్రితపాదపీఠే ।
శ్రేయాంసి సన్తి నిఖిలాని సుమంగలాని
తత్రైవ మే వసతు **మానసరాజహంసః** ॥



## 8

**అవతారిక :** ఈ శ్లోకమున 'శ్రీహరినే నిరతము ధ్యానింతునని' శ్రీ కులశేఖరులు పలుకుచున్నారు.

**శ్లో॥ చిన్తయామి హరిమేవ సన్తతం**
**మన్ద–మన్ద–హసితాననామ్బుజమ్ ।**
**నన్దగోప–తనయం పరాత్పరం**
**నారదాదిమునిబృన్దవన్దితమ్ ॥** **8**

**పదవిభాగము :**

చిన్తయామి, హరిమ్, ఏవ, సన్తతమ్,
మన్ద – మన్ద – హసిత + ఆనన + అంబుజమ్ ।
నందగోప – తనయమ్, పరాత్పరమ్
నారద + ఆది – ముని – బృంద – వన్దితమ్ ॥

**అన్వయక్రమము :** నందగోప – తనయమ్ పరాత్పరమ్ నారదాది – మునిబృంద – వందితమ్ మంద – మంద – హసిత + ఆనన + అంబుజమ్ హరిమ్ ఏవ చింతయామి.

**ప్రతిపదార్థము :**

నందగోపతనయమ్ = నందగోప కుమారుడును,
పరాత్పరమ్ = ఉన్నతోన్నతుడును,
నారద + ఆది – మునిబృంద – వందితమ్ = నారదుడు మొదలుగాగల మునిసమూహముచేతను నమస్కరింపబడువాడును,
మంద – మంద – హసిత + ఆనన + అంబుజమ్ = చిఱుచిఱునవ్వుతో కమలమువంటి మోము గలవాడగు,
హరిమ్ + ఏవ = శ్రీహరినే,
**చింతయామి** = ధ్యానించుచున్నాను.

**తాత్పర్యము :** నందగోపకుమారుడును, ఉన్నతోన్నతుడును, నారదాది మునిసమూహము చేతను నమస్కరింపబడువాడును, చిఱుచిఱునవ్వుతో కమలము వంటి మోము గలవాడగు శ్రీహరినే ధ్యానించుచున్నాను.

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. హరిమ్ – **హరిమ్** – హరీ – హరీన్, ఇకారాన్తః, పుంలిఙ్గః, హరిశబ్దః, ద్వి.ఏ; ఏవం నందగోపతనయమ్, పరాత్పరమ్, మంద...అమ్బుజమ్, నారదాది... వందితమ్ చ; 2. ఏవ – అవ్యయము; 3. చింతయామి – చురాది (10) చితి (చిన్తి) స్మృత్యామ్ (చింతించుట) అకర్మకమ్ సేట్, పరస్మైపదీ, లట్ – ఉ.ఏ.

**క్రియాదర్శము :** చింతయామి – లట్ ఉ.ఏ.

| | | |
|---|---|---|
| చిన్తయతి | చిన్తయతః | చిన్తయన్తి |
| చిన్తయసి | చిన్తయథః | చిన్తయథ |
| **చిన్తయామి** | చిన్తయావః | చిన్తయామః |

**ఛందస్సు :** 1. త్రిష్టుభ్ 2. **రథోద్ధతా**

**లక్షణము :** రాన్నరైర్నరలగై రథోద్ధతా

**శ్లోకపాదము / గణవిభజన** 11 అక్షరాలు (3, 8; 4, 7)

చి న్త యా మి హ రి మే వ స న్త తం
U I U I I I U I U I U
ర న ర ల గ

**పదాదర్శము :** సన్తతమ్ అ) (సమ్ + తన్ + క్త। 'సమో వా హిత – తతయోః' ఇతి పక్షే మలోపాభావః). సతతమ్; తద్వతి త్రి। అవ్యయమ్.

శ్లో॥ సతతం **సన్తత**మనిశం నిత్యమజస్రం చ శశ్వదశ్రాన్తమ్।
అవిరతమనవరతం స్యాదేకార్థమనారతమసక్తమ్॥ 4–698
– అని హలాయుధకోశము 11 నామములను పేర్కొన్నది.

ఆ) శ్లో॥ లక్షణాత్పరమేశస్య లింగమిత్యభిధీయతే।
సన్నిధానాత్సమస్తేషు జన్తుష్వపి చ **సన్తతమ్**॥
– యోగశిఖోపనిషత్ 10

పరమేశ్వరుని లక్షణమే లింగం. అందఱు జీవులకు ఎల్లప్పుడూ ఇది సన్నిధానము.

ఇ) శ్లో॥ తత్రస్థం శాన్తమూర్తిం మణిమయమకుటం కుణ్డలోద్భాసితాఙ్గమ్।
లక్ష్మీనారాయణాఖ్యం సరసిజనయనం **సన్తతం** చిన్తయామి॥

"... లక్ష్మీసహితుడునగు నారాయణుడనుపేరుగల శ్రీమహావిష్ణువును నేనెల్లప్పుడును ధ్యానించుచున్నాడను." – శ్రీనారాయణహృదయస్తోత్రమ్ – ధ్యానశ్లోక భాగమిది.

ఈ) సన్తతమ్ : సమ్ తన్ క్త, త్రి. సన్తతః, అకారాన్తః పుంలిఙ్గః, సన్తతశబ్దః, సన్తతమ్ – సన్తతౌ – సన్తతాన్; ద్వి.ఏ. శాశ్వతుడను అర్థము. శ్రీశివకర్ణామృతమునందలీ శ్లోకమును (3–1) చూడుడు.

శ్లో॥ శ్రీమన్తం స్వనితాన్తకాన్తపదకంజస్వాన్తచింతామణిం
శాన్తం నాన్తరమన్తకాన్తకమతిక్రాన్తప్రియం **సన్తతమ్** ।
సన్తం భాన్తమనన్తకున్తలసువిభ్రాన్తమ్మహాన్తం శివం
దాన్తం కన్తురిపుం తమన్తరహితం స్వర్దన్తికాన్తిం స్తుమః ॥ (3–1)



## 9

**అవతారిక :** ఈ శ్లోకమున 'తాపత్రయము వీడెద'ననుచున్నాడు శ్రీకులశేఖరాళ్వార్లు.

**శ్లో॥ కరచరణసరోజే కాన్తిమన్నేత్రమీనే**
**శ్రమముషి భుజవీచివ్యాకులేఽగాధమార్గే ।**
**హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం**
**భవమరుపరిఖిన్నః ఖేదమద్య త్యజామి ॥ 9**

**పదవిభాగము :**

కర – చరణ – సరోజే, కాన్తిమన్నేత్రమీనే,
శ్రమ – ముషి, భుజ – వీచి – వ్యాకులే, అగాధమార్గే ।
హరి – సరసి, విగాహ్య, ఆపీయ, తేజః + జల + ఓఘమ్
భవ – మరు – పరిఖిన్నః, ఖేదమ్, అద్య, త్యజామి ॥

**అన్వయక్రమము :** కర – చరణ – సరోజే కాన్తిమత్ + నేత్ర–మీనే శ్రమ – ముషి భుజ – వీచి – వ్యాకులే అగాధమార్తే హరి – సరసి విగాహ్య తేజః + జలౌఘమ్ ఆపీయ భవ – మరు – పరిఖిన్నః అహమ్ అద్య ఖేదం త్యజామి.

**ప్రతిపదార్థము :**

కర–చరణ–సరోజే = హస్తములు పాదములనెడు కమలములు గలదియు,

కాన్తిమత్ + నేత్ర–మీనే = కాంతిగల కన్నులనెడు చేపలు గలదియు,
శ్రమ–ముషి = బడలికను పోగొట్టునదియు,
భుజ–వీచి–వ్యాకులే = భుజములనెడు తరంగములతో సంకులమైనదియు,
అగాధమార్గే = లోతైన మార్గము గలదియు, అగు
హరి–సరసి = 'శ్రీహరి' అనెడు సరోవరమునందు
విగాహ్య = మునిగి,
తేజః + జలౌఘమ్ = 'తేజస్సు' అనెడు నీటిని
ఆపీయ = తనివితీరగ త్రావి,
భవ–మరు–పరిఖిన్నః = సంసారమనెడు ఎడారిలో డస్సినట్టి,
అహమ్ = నేను
అద్య = ఇపుడు
ఖేదమ్ = తాపత్రయమును
**త్యజామి** = 'వీడెద'ను.

**తాత్పర్యము :** హస్తములు పాదములనెడు కమలములుగలదియు, కాంతిగల కన్నులనెడు చేపలు గలదియు, బడలికను పోగొట్టునదియు, భుజములనెడు తరంగములతో సంకుల మైనదియు, లోతైన మార్గము గలదియు, అగు 'శ్రీహరి' అనెడు సరోవరమునందు మునిగి 'తేజస్సు' అనెడు నీటిని తనివితీరగ త్రావి సంసారమనెడు ఎడారిలో డస్సినట్టి నేను ఇపుడు తాపత్రయమును వీడుచున్నాను. (అని శ్రీకులశేఖరులు)

**పాఠాంతరాలు :** 1. ఖేదమ్ – క్లేశమ్.

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. హరిసరసి – **హరసరసి** – హరిసరసోః – హరిసరస్సు, సకారాన్తః, నపుంసకలిఙ్గః, సరశ్శబ్దః, సప్తమీవిభక్తి, ఏకవచనాంతః; *(ఏవం 1. కర–చరణ–సరోజే, 2. కాన్తిమన్నేత్రమీనే, 3. శ్రమముషి, 4. భుజవీచివ్యాకులే, 5. అగాధమార్గే)*; 2. విగాహ్య – గాహ్ (గాహూ) ల్యప్ – కృదన్త – అవ్యయము; 3. ఆపీయ – పీఙ్ (పానే) ల్యప్ – కృదన్త – అవ్యయము; 4. జలౌఘమ్ – **జలౌఘమ్** – జలౌఘౌ – జలౌఘాన్, అకారాన్తః, పుంలిఙ్గః, జలౌఘశబ్దః, ద్వి.ఏ; 5. ...పరిఖిన్నః – **...పరిఖిన్నః** – ...పరిఖిన్నౌ – ...పరిఖిన్నాః, అకారాన్తః, పుంలిఙ్గః, పరిఖిన్నశబ్దః, ప్ర.ఏ; 6. అహమ్ – **అహమ్** –

ఆవామ్ – వయమ్; దకారాన్తః, పుంలిఙ్గః, అస్మచ్ఛబ్దః, ప్ర.ఏ; 7. ఖేదమ్ – **ఖేదమ్** – ఖేదౌ – ఖేదాన్, అకారాన్తః, పుంలిఙ్గః, ఖేదశబ్దః, ద్వి.ఏ; 8. త్యజామి – భ్వాది – త్యజ్ (హానౌ), సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్ – ఉ.ఏ.

**క్రియాదర్శము :** త్యజామి – భ్వాది (1), లట్, ఉ.ఏ.

| | | |
|---|---|---|
| త్యజతి | త్యజతః | త్యజన్తి |
| త్యజసి | త్యజథః | త్యజథ |
| **త్యజామి** | త్యజావః | త్యజామః |

**ఛందస్సు :** 1. అతిశక్వరీ, 2. **మాలినీ**

**లక్షణము :** ననమయయ యుతేయం **మాలినీ** భోగిలోకైః

**శ్లోకపాదము / గణవిభజన** 15 అక్షరాలు (8, 7)

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | ర | చ | ర | ణ | స | రో | జే | కా | న్తి | మ | న్నే | త్ర | మీ | నే |
| I | I | I | I | I | I | U | U | U | I | U | U | I | U | U |
| | న | | | న | | | మ | | | య | | | య | |

**పదాదర్శము : విగాహ్య**

విగాహ్య – అ) గాహూ (గాహ్) విలోడనే (చొచ్చుట, కలియబెట్టుట) సకర్మకమ్, సేట్, భ్వాది. వి–గాహ్య – ల్యబన్తము; అవ్యయము, కృదన్తము.

అ) శ్లో॥ తతః సౌభద్రమాసాద్య మహర్షిస్తీర్థముత్తమమ్ ।
**విగాహ్య** సహసా శూరః స్నానం చక్రే పరంతపః ॥
మహాభారతే –ఆదిపర్వే

అంతట మహర్షి ఉత్తమమైన సౌభద్రతీర్థమును చేరి సాహసముతో సరస్సులో మునిగి స్నానము చేసెను.

ఇ) శ్లో॥ **విగాహ్య** తస్మిన్నమృతాంబు నిర్మలం
హేమారవిందోత్పలరేణువాసితమ్ ।
పపౌ నికామం నిజపుష్కరోద్ధృత –
మాత్మానమద్భిస్నపయన్ గతక్లమః ॥ ఇతి భాగవతమహాపురాణమ్

... (ఆ సరస్సులోని) స్వచ్ఛమైన నీరు బంగారురంగుగల పద్మములు మరియు కలువల పుప్పొడితో సుగంధితమైయుండెను. (ఆ యేనుగు) దానిలో దిగి తనపై నీళ్లను చల్లుకుంటూ అమృతము వంటి ఆ నీటిని తనివితీరగ త్రాగి సేదదీరెను.

ఈ) శ్లో॥ "ఏష కారండవః పక్షీ **విగాహ్య** సలిలం శుభమ్ ।
రమతే కాన్తయా సార్థం కామమ్ ఉద్దీపయన్ మమ ॥"
ఇతి వాల్మీకిరామాయణే కిష్కింధాకాండే

'ఈ కన్నెలేడియను పిట్ట పవిత్రములైన (పంపా)జలములలో మునిగి తన కాంతతో జలక్రీడలాడుచు నాలో కోరికలను రేకెత్తించుచున్నట్లున్నది."



## 10

**అవతారిక : 'హరిచరణస్మరణ'** అనునది అమృతతుల్యమని ఈ శ్లోకమున 'ఓ మనసా' అని శ్రీ కులశేఖరాళ్వార్లు ప్రస్తావిస్తున్నారు.

**శ్లో॥ సరసిజనయనే సశఙ్ఖచక్రే**
**మురభిది మా విరమస్వ చిత్త! రన్తుమ్ ।**
**సుఖతరమపరం న జాతు జానే**
**హరిచరణస్మరణామృతేన తుల్యమ్ ॥ 10**

**పదవిభాగము :**

సరసి–జ–నయనే, స–శంఖ–చక్రే
మురభిది, మా, విరమస్వ, చిత్త!, రంతుమ్ ।
సుఖతరమ్, అపరమ్, న, జాతు, జానే,
హరి–చరణ–స్మరణ + అమృతేన, తుల్యమ్ ॥

**అన్వయక్రమము :** చిత్త! సరసిజనయనే సశంఖచక్రే మురభిది రన్తుం మా విరమస్వ. హరిచరణస్మరణామృతేన తుల్యం సుఖతరమ్ అపరం జాతు న జానే.

**ప్రతిపదార్థము :**

(హే) చిత్త! = ఓ మనసా,
సరసిజ–నయనే = కమలమును బోలిన నేత్రములు గలవాడును,
స–శంఖచక్రే = శంఖచక్రములతో గూడినవాడును,
మురభిది = మురాంతకుడునగు శ్రీహరియందు,
రన్తుమ్ = ఓలలాడుటకు,
మా విరమస్వ = వెనుదీయకుము.
హరి–చరణ–స్మరణామృతేన = 'శ్రీహరి పాదస్మరణ' అనెడు అమృతముతో,
తుల్యమ్ = సరిసాటియైన,
సుఖతరమ్ = సుఖప్రదమైనదగు
అపరమ్ = మఱొకటి,
జాతు = ఒకప్పుడును,
**న జానే** = ఎఱుగను.

**తాత్పర్యము :** ఓ మనసా! కమలమును బోలిన నేత్రములుగలవాడును, శంఖచక్రములతో గూడినవాడును, మురాంతకుడును అగు శ్రీహరియందు ఓలలాడుటకు వెనుదీయకుము. **'శ్రీహరిపాదస్మరణ'** అనెడు అమృతముతో సరిసాటియైన సుఖప్రదమైనదగు మఱొకటి ఒకప్పుడును ఎఱుగను.

**పాఠాంతరాలు :** 1. మా విరమ స్వచిత్త! – మా విరమస్వ చిత్త!

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. సరసిజనయనే – **...నయనే** – ...నయనయోః – ...నయనేషు, అకారాన్తః, పుంలిఙ్గః, ...నయనశబ్దః, స.ఏ; 2. సశంఖచక్రే – **...చక్రే** – ...చక్రయోః – ...చక్రేషు, అకారాన్తః, నపుం.లిఙ్గః, ...చక్రశబ్దః, స.ఏ; 3. మురభిది – **మురభిది** – మురభిదోః – మురభిత్సు, దకారాన్తః పుంలిఙ్గః, మురభిచ్ఛబ్దః, స.ఏ; 4. హే చిత్త! – **(హే) చిత్త!** – (హే) చిత్తౌ! – (హే) చిత్తాః!, అకారాన్తః, పుంలిఙ్గః, చిత్తశబ్దః, సం.ప్ర.ఏ, చిత్త (చిత్ కర్మణి కర్తరివా క్త) త్రి. త్తః–తా–త్తం; 5. రన్తుమ్ – తుమున్ ప్రత్యయాన్తము. రము (రమ్) క్రీడాయామ్ (ఆడుట); 6. మా – (మా క్విప్) అవ్యయము, '**మా** నిషాద! ప్రతిష్ఠాం త్వామగమః

శాశ్వతీః సమాః।' – రామాయణమ్; 7. ...అమృతేన – **...అమృతేన** – ...అమృతాభ్యామ్ – ...అమృతైః, అకారాన్తః, నపుం.లిఙ్గః, అమృతశబ్దః, తృ.ఏ; 8. అపరమ్ – (న పృ అచ్) – **అపరమ్** – అపరే – అపరాని, అకారాన్తః, నపుం.లిఙ్గః, అపరశబ్దః, ప్ర.ఏ, ఏవమ్ సుఖతరమ్, తుల్యమ్ చ; 9. జాతు – కదాచిదర్థః – అవ్యయము; 10. విరమస్వ రము (రమ్) క్రీడాయామ్ (ఆడుట) – భ్వాది, అకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ; 11. జానే – జ్ఞా (అవబోధనే) తెలిసికొనుట, క్ర్యాది, సకర్మకమ్, అనిట్ (ఉభయ) ఆత్మనేపదీ.

**క్రియాదర్శము :** 1. **వి–రమస్వ** – లోట్ – మ.ఏ.

| | | |
|---|---|---|
| రమతాత్ | రమేతాత్ | రమన్తామ్ |
| **రమస్వ** | రమేథామ్ | రమధ్వమ్ |
| రమై | రమేవహై | రమామహై |

2. **జానే** – లట్ – ఉ.ఏ.

| | | |
|---|---|---|
| జానీతే | జానాతే | జానతే |
| జానీషే | జానాథే | జానీధ్వే |
| **జానే** | జానీవహే | జానీమహే |

**ఛందస్సు :** 1. అర్ధసమవృత్త, 2. **పుష్పితాగ్రా** / ఔపచ్ఛందసికా

**లక్షణము :** అయుజి నయుగరేఫతో యకారో ।
యుజితు నజౌ జరగాశ్చ **పుష్పితాగ్రా** ॥

**శ్లోకపాదము / గణవిభజన**

మొదటి పాదము (12) – స ర సి జ న య నే స శం ఖం చ క్రే
I I I I I I U I U I U U
న న ర య

రెండవ పాదము (13) – ము ర భి ది మా వి ర మ స్వ చి త్త రం తుమ్
I I I I U I I U I U I U U
న జ జ ర గ

**పదాదర్శము : తుల్యమ్:** అ) త్రి. (తులయా సమ్మితః। నౌవయోవర్మేతి యత్) తుల్యః, తుల్యా, తుల్యమ్; సాదృశ్యయుక్తః, సమః, సదృశ్యః, సదృక్, సమానః, స్వరూపః,...

ఆ) శ్లో॥ తుల్యార్థం తుల్యసామర్థ్యం మర్మజ్ఞం వ్యవసాయినమ్ ।
అర్ధరాజ్యహరం భృత్యం యో న హన్యాత్ స హన్యతే ॥
– ఇతి పంచతంత్రే 1-218

ఇ) శ్లో॥ తుల్యపాణిభుజగ్రీవస్తుల్యబుద్ధీంద్రియాత్మకః ।
తుల్యదుఃఖసుఖాత్మా చ తుల్యపృష్టముఖోధరః ॥

శ్లో॥ తుల్యశుక్రాస్థిమజ్జా చ తుల్యమాంసాసృగేవ చ ।
నిఃశ్వాసోచ్ఛ్వాసతుల్యశ్చ తుల్యప్రాణశరీరవాన్ ॥

శ్లో॥ సమానజన్మమరణః సమః సర్వైర్గుణైర్నృణామ్ ।
విశిష్టబుద్ధీన్ శూరాంశ్చ కథమేకోఽధితిష్ఠతి ॥
– ఇతి మహాభారతే శాన్తిపర్వే

'మానవులందఱకు వలెనే రాజునకు చేతులు, కాళ్ళు, మెడ, బుద్ధి, ఇంద్రియములు, ఆత్మ, సుఖదుఃఖములు, ఆసనము, మొగము, పొట్ట, శుక్రము, ఎముకలు, మజ్జ, మాంసము, నెత్తురు, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, ప్రాణము, శరీరము, పుట్టుక, చావు, సమానముగా కలవు. అట్లే గుణములన్నింటితో అతడు ఇతరులకు సమానుడే.'...

ఈ) శ్లో॥ శివేన **తుల్యం** జ్ఞానం తే-పరమాయుశ్చ బాలక! ।
పరాక్రమే మయా **తుల్య**సర్వసిద్ధేశ్వరో భవ ॥ బ్రహ్మవైవర్తే.

"ఓ బాలకా! నీకు శంకరునితో సమానమగు జ్ఞానము, ఆయుష్షు కలుగుగాక! అట్లే నాతో సమానమైన పరాక్రమము కలుగును గాక! నీవు సమస్త సిద్ధులకు అధిపతిగా వెలుగొందుదు"వని **'శ్రీమన్నారాయణుడు'** గణపతి జన్మోత్సవ సమయమున శుభాశీస్సు లందించిన సందర్భమున పలికినదిది.



## 11

**అవతారిక :** ఈ శ్లోకమున నమ్మికతో 'శ్రీధరు'ణ్ణి ధ్యానింపుమని తన చిత్తమునకు చెప్పుచున్నారు శ్రీ కులశేఖరులు.

**శ్లో॥ మా భీర్మన్దమనో విచిన్త్య బహుధా యామీశ్చిరం యాతనా**
**నామీ నః ప్రభవన్తి పాపరిపవస్స్వామీ నను శ్రీధరః ।**
**ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం ధ్యాయస్వ నారాయణం**
**లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిన్న క్షమః ॥11**

**పదవిభాగము :**

మా, భీః, మన్దమనః, విచిన్త్య, బహుధా, యామీః, చిరమ్, యాతనాః,
న + అమీ, నః, ప్రభవన్తి, పాపరిపవః, స్వామీ, నను, శ్రీధరః ।
ఆలస్యమ్, వ్యపనీయ, భక్తి-సులభమ్, ధ్యాయస్వ, నారాయణమ్,
లోకస్య, వ్యసన + అపనోదన-కరః, దాసస్య, కిమ్, న, క్షమః ॥

**అన్వయక్రమము :** (హే) మందమనః! యామీః బహుధా యాతనాః చిరం విచిన్త్య మా భీః. అమీ పాపరిపవః నః న ప్రభవన్తి. స్వామీ శ్రీధరః నను ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం నారాయణం ధ్యాయస్వ. లోకస్య వ్యసన + అపనోదన-కరః దాసస్య కిం న క్షమః.

**ప్రతిపదార్థము :**

(హే) మందమనః! = ఓ మూఢమనసా!
యామీః = యముని సంబంధమైన,
బహుధా = అనేకవిధములైన,
యాతనాః = బాధలను,
చిరమ్ = చాలకాలము, (ఎక్కువగా),
విచింత్య = ఆలోచించి,
భీః మా = భయం పెట్టుకోకు.
అమీ = ఈ,
పాపరిపవః = పాపములనెడు శత్రువులు,
నః = మనను,

న ప్రభవన్తి = ఏమియు చేయజాలవు.

స్వామీ = స్వామి

శ్రీధరః నను = లక్ష్మీపతి కదా.

ఆలస్యమ్ = జాగుచేయుటను,

వ్యపనీయ = వీడి,

భక్తిసులభమ్ = భక్తిసులభుడైన,

నారాయణమ్ = శ్రీమన్నారాయణుని,

**ధ్యాయస్వ** = స్మరింపుము.

లోకస్య = జగత్ యొక్క,

వ్యసన + అపనోదన-కరః = కష్టాలను కడతేర్చేవాడు

(సః = శ్రీమన్నారాయణుడు)

దాసస్య = దాసునియొక్క

కిం న క్షమః = (కష్టాలు కడతేర్చుటయందు) సమర్థుడు కాదా యేమి?

**తాత్పర్యము :** ఓ మూఢమనసా! యముని సంబంధమైన బాధలను ఎక్కువగా ఆలోచించి భయపడకుము. ఈ పాపములనెడు శత్రువులు మనను ఏమియు చేయజాలవు. స్వామి, లక్ష్మీపతికదా. జాగుచేయుటను వీడి భక్తిసులభుడైన శ్రీమన్నారాయణుని స్మరింపుము. జగత్‌యొక్క కష్టాలను కడతేర్చేవాడు దాసునియొక్క కష్టాలను పోగొట్టుటయందు సమర్థుడు కాడా యేమి? 'కడు సమర్థుడు' అని భావము.

**పాఠాంతరాలు :** 1. నామీ నః – నైవామీ

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. మన్దమనః! – **(హే) మందమనః** – (హే) మందమనసీ – (హే) మందమనాంసి, సకారాన్తః నపుంసకలిఙ్గః, మనశ్శబ్దః, సం.ప్ర.ఏ; 2. యామీ (**యమస్యేయం యమో దేవతా యస్య వా అణ్ ఙీప్**) యామీః – యామీమ్ – యామ్యౌ – **యామీః**, ఈకారాన్తః, స్త్రీలిఙ్గో యామీశబ్దః, ద్వి.బ; 3. బహుధా – (బహు ధాచ్) – అవ్యయము; 4. యాతనాః – (యత్ యుచ్) – యాతనామ్ – యాతనే – **యాతనాః**, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, యాతనాశబ్దః, ద్వి.బ; 5. చిరమ్ – అవ్యయము; 6. విచింత్య – చితి స్మృత్యామ్ – ల్యప్ – కృదన్త – అవ్యయము; 7. అమీ – అసౌ – అమూ – **అమీ**, సకారాన్తః,

పుంలిఙ్గోఽ దశ్శబ్దః, ప్ర.బ; 8. పాపరిపవః – ...రిపుః – ...రిపూ – **...రిపవః**, ఉకారాన్తః, పుంలిఙ్గో రిపుశబ్దః, ప్ర.బ; 9. శ్రీధరః – **శ్రీధరః** – శ్రీధరౌ – శ్రీధరాః, అకారాన్తః, పుంలిఙ్గః, శ్రీధరశబ్దః, ప్ర.ఏ; 10. స్వామీ – **స్వామీ** – స్వామినౌ – స్వామినః, నకారాన్తః, పుంలిఙ్గః, స్వామిన్ శబ్దః, ప్ర.ఏ; 11. ఆలస్యమ్ – (ఆలసస్య భావః ష్యఞ్) – 'ఆలస్యాదన్నదోషాచ్చ విప్రాన్మృత్యుర్జిఘాంసతి' – **మనుః; ఆలస్యమ్** – ఆలస్యే – ఆలస్యాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ఆలస్యశబ్దః, ప్ర.ఏ; 12. వ్యపనీయ – ల్యప్ – వి + అప + నీయ; 13. భక్తిసులభమ్ – **భక్తిసులభమ్** – భక్తిసులభౌ – భక్తిసులభాన్; అకారాన్తః, పుంలిఙ్గో భక్తిసులభశబ్దః, ద్వి.ఏ; 14. నారాయణమ్ – **నారాయణమ్** – నారాయణౌ – నారాయణాన్, అకారాన్తః, పుంలిఙ్గో నారాయణశబ్దః, ద్వి.ఏ; 15. క్షమః (క్షమ్ అచ్) – **క్షమః** – క్షమౌ – క్షమాః, అకారాన్తః, పుంలిఙ్గః, క్షమశబ్దః, ప్ర.ఏ; 16. భీః – భీః – భియౌ – భియః, ఈకారాన్తః, స్త్రీలిఙ్గః, భీశబ్దః, ప్ర.ఏ; హ్రీః భీః, ధీః ఇత్యాదయః శ్రీవదేవ బోధ్యాః, (కాని శబ్దచిన్తామణి నిఘంటువు ఈకారాన్త స్త్రీలింగశబ్దముగా పేర్కొంటూ 'భీ' గానే ప్రథమావిభక్తి ఏకవచనంగా పేర్కొన్నది. అప్పుడు భీః అనేది ద్వితీయావిభక్తి బహువచనంగా కూడా చెప్పవచ్చునేమో?); 17. ప్రభవన్తి – ప్ర/భూ – సత్తాయామ్, అకర్మకమ్ సేట్, పరస్మైపదీ, భ్వాది, లట్, ప్ర.బ; 18. ధ్యాయస్వ – ధ్యై చిన్తాయామ్, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాది, కర్మణి, లోట్, మ.ఏ. ఆత్మనేపదీ.

**క్రియాదర్శము :** 1. ప్ర–భవన్తి, 2. ధ్యాయస్వ

1. ప్ర–భవన్తి – లట్ – ప్ర.బ.

| | | |
|---|---|---|
| భవతి | భవతః | **భవన్తి** |
| భవసి | భవథః | భవథ |
| భవామి | భవావః | భవామః |

2. ధ్యాయస్వ – లోట్ – మ.ఏ.

| | | |
|---|---|---|
| ధ్యాయతామ్ | ధ్యాయేతామ్ | ధ్యాయన్తామ్ |
| **ధ్యాయస్వ** | ధ్యాయేథామ్ | ధ్యాయధ్వమ్ |
| ధ్యాయై | ధ్యాయావహై | ధ్యాయామహై |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. **శార్దూలవిక్రీడితమ్.**

**లక్షణము :** సూర్యాశ్వైర్యది మః సజౌ సతతగాః శార్దూలవిక్రీడితమ్ ।

**శ్లోకపాదము / గణవిభజన** 19 అక్షరాలు (12, 7)

| | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మా | భీ | ర్మ | న్ద | మ | నో | వి | చి | న్త్య | బ | హు | ధా | యా | మీ | శ్చి | రం | యా | త | నా |
| U | U | U | I | I | U | I | U | I | I | I | U | U | U | I | U | U | I | U |
| | మ | | | స | | | జ | | | స | | | త | | | త | | గ |

**పదాదర్శము : శ్రీధరః - ఓం శ్రీధరాయ నమః**

అ) శ్లో॥ శ్రీదశ్శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిశ్శ్రీవిభావనః ।
**శ్రీధర**శ్శ్రీకరశ్శ్రేయఃశ్రీమాన్ లోకత్రయాశ్రయః ॥
- శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్ - 65

శ్రీపరాశరభట్టర్ వారి భాష్యము

"తాం రత్నమివార్చిషం పుష్పమివ సురభిం ఇన్దురివ చన్ద్రికాం అమృతమివ స్వాదుతాం ఔత్పత్తికేన సమ్బన్ధేన ధరతీతి" - **శ్రీధరః**

"నహి హాతుమియం శక్యా కీర్తిరాత్మవతో యథా" ఇతి.

ఆంధ్రానువాదము : రత్నము కాంతిచే శోభించినట్లు, పుష్పము సువాసనచే వాసికెక్కినట్లు, చంద్రుడు వెన్నెలతో వెలుగొందినట్లు, అమృతము మాధుర్యముచే ఒప్పారినట్లు ఈ లక్ష్మీదేవిని తన వక్షఃస్థలమున ధరించియుండుటచే ఈ స్వామియు ప్రకాశించినాడు, గనుక శ్రీధరః అనబడుచున్నాడు. శ్రీరామాయణములోని 'నహి హాతుం... యథా' అను శ్లోకమిచట ప్రమాణము. ఆత్మాభిమానము కల వ్యక్తిని కీర్తి నిరంతరము వదలక యుండునట్లు ఈ సీతయు రాముని వదలి ఉండజాలదు అని అర్థము.
- శ్రీమాన్ శ్రీ న.చ.రఘునాథాచార్య స్వామివారు

ఆ) **'శ్రీధర'** పదమునకు సంబంధించిన మరిన్ని వివరములకు గరుడపురాణము- ఆచారకాండ చూడుడు. ఇట గరుడపురాణాంతర్గత 'శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్"ను అనుసంధానము చేసుకుందురుగాక.

ఓం

శ్లో॥ వామదేవో మహావిష్ణుర్వాసవో వాసవో వసుః । .....

శ్లో॥ నిర్వికారో నిర్నిమిత్తో నిరాంతకో నిరాశ్రయః ॥

ఇతి నామసహస్రం తే వృషభధ్వజ! కీర్తితమ్ ।
దేవస్య విష్ణోరీశస్య సర్వపాపవినాశనమ్ ॥

పఠన్ ద్విజశ్చ విష్ణుత్వం క్షత్రియో జయమాప్నుయాత్ ।
వైశ్యో ధనం సుఖం **శూద్రో విష్ణుభక్తిసమన్వితః** ॥

**ఇ) శ్రీకులశేఖరాళ్వార్ల ఈ శ్లోకపారాయణ 'శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర' పారాయణకు సమముగ చెప్పదగును.**

ఈ) ధరతీతి, ధృా+అచ్, శ్రియా ధరః, విష్ణుః.



## 12

**అవతారిక :** ఈ శ్లోకమున సంసారసాగరమున మునిగిన నరులు తరించుటకు 'విశ్వవ్యాప్తుడైన శ్రీమహావిష్ణు'వనెడు తెప్ప యొక్కటియే శరణ్యమగునని చెప్పుచున్నారు శ్రీ కులశేఖరాళ్వార్లు.

**శ్లో॥ భవజలధిగతానాం ద్వన్ద్వవాతాహతానాం**
**సుతదుహితృకలత్రత్రాణభారార్దితానామ్ ।**
**విషమవిషయతోయే మజ్జతామప్లవానాం**
**భవతు శరణమేకో విష్ణుపోతో నరాణామ్ ॥** **12**

**పదవిభాగము :**

భవ–జలధి–గతానామ్, ద్వంద్వ–వాత + ఆహతానామ్,
సుత–దుహితృ–కలత్ర–త్రాణ–భార + అర్దితానామ్ ।
విషమ–విషయ–తోయే, మజ్జతామ్, అప్లవానామ్,
భవతు, శరణమ్, ఏకః, విష్ణుపోతః, నరాణామ్ ॥

**అన్వయక్రమము :** భవ–జలధి–గతానాం ద్వంద్వ–వాత + ఆహతానాం సుత–దుహితృ–కలత్ర–త్రాణ–భార + అర్దితానాం విషమ–విషయ–తోయే మజ్జతామ్ అప్లవానాం నరాణాం విష్ణుపోతః ఏకః శరణం భవతు.

**ప్రతిపదార్థము :**

భవ–జలధి–గతానామ్ = సంసారమనెడు సాగరమును పొందినవారును,
ద్వంద్వ–వాత + ఆహతానామ్ = జననమరణాలనెడు జంట మారుతాలచే కొట్టుకుపోతున్న వారును,
సుత–దుహితృ–కలత్ర–త్రాణ–భార+అర్దితానామ్ = కొడుకులు, కూతుళ్ళు, భార్యలు – వీళ్లను సాకే భారముచేత క్రుంగిపోతున్నవారును,
విషమ–విషయ–తోయే = విషమములైన శబ్దాదివిషయములనెడు నీటియందు,
**మజ్జతామ్** = మునుగువారును,
అప్లవానామ్ = దారి తెన్ను లేనటువంటివారును, అగు
నరాణామ్ = నరులకు,
విష్ణుపోతః ఏకః = 'శ్రీమహావిష్ణువు' అనెడు 'నావ' యొక్కటే
శరణమ్ = గతి,
**భవతు** = అగుగాక.

**తాత్పర్యము :** సంసారమనెడు సాగరమును పొందినవారును, జననమరణాలనెడు జంటమారుతాలచే కొట్టుకుపోతున్నవారును, కొడుకులు–కూతుళ్ళు–భార్యలు – వీళ్ళను సాకే భారముచేత క్రుంగిపోతున్నవారును, విషమములైన శబ్దాదివిషయములనెడు నీటియందు మునుగువారును, దారి తెన్ను లేనటువంటివారును అగు నరులకు 'శ్రీమహావిష్ణువు' అనెడు 'నావ' యొక్కటే గతి అగుగాక.

**పాఠాంతరాలు :** 1. భవతు – భవతి.

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. నరాణామ్ – నరస్య – నరయోః – **నరాణామ్**, అకారాన్తః, పుంలిఙ్గ, నరశబ్దః, ష.బ, *(ఏవం 1. ...గతానామ్, 2. ...ఆహతానామ్, 3. ...అర్దితానామ్, 4. ...మజ్జతామ్, 5. ...అప్లవానామ్ – షష్ఠీవిభక్తిబహువచనాంతాలు)*; 2. విషమ–విషయ–తోయే – **...తోయే** – ...తోయయోః – ...తోయేషు, అకారాన్తః, పుంలిఙ్గః, తోయశబ్దః, స.ఏ; 3. ఏకః – **ఏకః** – ఏకౌ – ఏకే, అకారాన్తః, పుంలిఙ్గః, సర్వనామ 'ఏక'శబ్దః, ప్ర.ఏ; 4. విష్ణుపోతః – **విష్ణుపోతః** – విష్ణుపోతౌ – విష్ణుపోతాః, అకారాన్త, పుంలిఙ్గః, విష్ణుపోతశబ్దః, ప్ర.ఏ; 5. శరణమ్ (**శౄ ల్యుట్**), 'అగ్నిశరణం ప్రవిష్టస్య శరీరం వినా ఛందోమయ్యా

వాచయా' – శాకున్తలమ్, **శరణమ్** – శరణే – శరణాని, అకారాన్తః, నపుం.లిఙ్గః, శరణశబ్దః, ప్ర.ఏ; 6. భవతు – భూ సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాది, లోట్, ప్ర.ఏ.

**క్రియాదర్శము :** భవతు – లోట్ – ప్ర.ఏ.

| | | |
|---|---|---|
| **భవతు** / భవతాత్ | భవతామ్ | భవన్తు |
| భవ / భవతాత్ | భవతమ్ | భవత |
| భవాని | భవావ | భవామ |

**ఛందస్సు :** 9వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు – 1. అతిశక్వరీ, ఉ. మాలినీ

**పదాదర్శము : మజ్జతామ్**

1. మజ్జతామ్ – అ) మజ్జత్ (మస్జ్ శతృ) త్రి.మజ్జన్, మజ్జన్తీ, మజ్జత్ ।

ఆ) మజ్జన్ (మస్జ్ క్వినిన్) పుం. మజ్జా.

శ్లో॥ అస్థి యత్స్వాగ్నినా పక్వం తస్య సారో ద్రవో ఘనః ।
యః స్వేదవత్ పృథగ్భూతః స మజ్జేత్యభిధీయతే ॥

ఇ) మజ్జన (మస్జ్ ల్యుట్) క్లీ. మజ్జనమ్.

ఈ) మజ్జత్ – తకారాన్తో నపుంసకలిఙ్గో 'మజ్జత్' శబ్దః (జగత్‌శబ్దవత్)

షష్ఠీవిభక్తిరూపాణి
మజ్జతః మజ్జతోః **మజ్జతామ్** – షష్ఠీబహువచనమ్

శ్లో॥ నిమజ్జ్యోన్**మజ్జతాం** ఘోరే భవాబ్ధౌ పరమాయణమ్ ।
సన్తో బ్రహ్మవిదః శాన్తా నౌర్దృఢేవాప్సు **మజ్జతామ్** ॥
– శ్రీమద్భాగవతే 11-21-32

ఘోరమైన సంసారసముద్రములో మునిగితేలుతున్నవారికి సత్పురుషులే ఆధారము. బ్రహ్మజ్ఞానము కలవారు, శాంతులు; నీటిలో మునుగుతున్న వారికి గట్టి పడవ దొరికితే ఎలా దాటిస్తుందో సంసారములో మునిగేవారికి; సత్పురుషులు దొరికితే సంసారాన్ని దాటుతారు.



## 13

**అవతారిక :** ఈ శ్లోకమున 'భక్తియే భవసాగరమును దాటించు'ననుచున్నారు శ్రీకులశేఖరులు.

**శ్లో॥ భవజలధిమగాధం దుస్తరం నిస్తరేయం**
**కథమహమితి చేతో మా స్మ గాః కాతరత్వమ్ ।**
**సరసిజదృశి దేవే తావకీ భక్తిరేకా**
**నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్ ॥ 13**

**పదవిభాగము :**

భవ–జలధిమ్, అగాధమ్, దుస్తరమ్, నిస్తరేయమ్,
కథమ్, అహమ్, ఇతి, చేతః!, మా స్మ గాః, కాతరత్వమ్ ।
సరసిజ–దృశి, దేవే, తావకీ, భక్తిః + ఏకా,
నరకభిది, నిషణ్ణా, తారయిష్యతి + అవశ్యమ్ ॥

**అన్వయక్రమము :** (హే) చేతః! అగాధం దుస్తరం భవ–జలధిం కథమ్ అహం నిస్తరేయమ్ ఇతి కాతరత్వం మా స్మ గాః. సరసిజదృశి దేవే నరకభిది నిషణ్ణా తావకీ భక్తిః + ఏకా అవశ్యం తారయిష్యతి.

**ప్రతిపదార్థము :**

(హే) చేతః! = ఓ మనసా!
అగాధమ్ = లోతైనదియు,
దుస్తరమ్ = దాటుటకు వీలులేనిదియు అగు,
భవ–జలధిమ్ = సంసారసాగరమును,
కథమ్ = ఏవిధముగ,
అహమ్ = నేను,
నిస్తరేయమ్ = దాటగలను?
ఇతి = అని,
కాతరత్వమ్ = వ్యాకులపాటును,
**మా స్మ గాః** = పొందకుము.

సరసిజ–దృశి = కమలములవంటి నేత్రములుగల,
దేవే = భగవంతుడగు,
నరకభిది = 'నరకుడు' అను రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణునియందు,
నిషణ్ణా = మొక్కవోని,
తావకీ = నీదైన,
భక్తిః + ఏకా = భక్తియొక్కటే,
అవశ్యమ్ = తప్పకుండా,
**తారయిష్యతి** = దరిజేర్చగలదు.

**తాత్పర్యము :** ఓ మనసా! లోతైనదియు, దాటుటకు వీలులేనిదియు అగు సంసార–సాగరమును ఏవిధముగ నేను దాటగలను? అని వ్యాకులపాటును పొందకుము. కమలములవంటి నేత్రములుగల భగవంతుడును, నరకుని సంహరించినవాడును అగు శ్రీకృష్ణుని యందు మొక్కవోని నీదైన భక్తియొక్కటే తప్పకుండా దరిజేర్చగలదు.

**పాఠాంతరాలు :** 1. తావకీ – తారకీ

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. (హే) చేతః! = **(హే) చేతః!** – (హే) చేతసీ! – (హే) చేతాంసి, సకారాన్తః, నపుంసకలిఙ్గః, చేతస్‌శబ్దః, సం.ప్ర.ఏ; 2. అగాధమ్ (న గాధమ్) – **అగాధమ్** – అగాధే – అగాధాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ద్వి.ఏ, *(ఏవమ్ 1. దుస్తరమ్ 2. భవజలధిమ్)*; 3. కథమ్ = కిం ప్రకారేణేత్యర్థః, అవ్యయము; 4. నిస్తరేయమ్ = నిః + తరేయమ్ – తౄ–ప్లవనతరణయోః, భ్వాది, సకర్మకమ్ / అకర్మకమ్ సేట్, పరస్మైపదీ, వి.లిఙ్, ఉ.ఏ; 5. కాతరత్వమ్ – **(కాతరస్య భావః)**, **కాతరత్వమ్** – కాతరత్వే – కాతరత్వాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, కాతరత్వశబ్దః, ద్వి.ఏ; 6. దేవే – **దేవే** – దేవయోః – దేవేషు, అకారాన్తః, పుంలిఙ్గః, దేవశబ్దః, స.ఏ; 7. నిషణ్ణా (నిసద్ క్త) ణ్ణః, ణ్ణా, ణ్ణమ్ (త్రి.) – **నిషణ్ణా** – నిషణ్ణే – నిషణ్ణాః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, నిషణ్ణాశబ్దః, ప్ర.ఏ; 8. భక్తిః – **భక్తిః** – భక్తీ – భక్తయః, ఇకారాన్తః, స్త్రీలిఙ్గః, భక్తిశబ్దః, ప్ర.ఏ; 9. ఏకా – (ఏకః టాప్) – **ఏకా** – ఏకాశబ్దః, **నిత్యైకవచనాంతః**, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, ప్ర.ఏ; 10. అవశ్యమ్ **(న వశ్యః)** త్రి. శ్యః – శ్యా – శ్యం, **అవశ్యమ్** – అవశ్యే – అవశ్యాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, అవశ్యశబ్దః, ప్ర.ఏ; 11. తారయిష్యతి – తౄ – ప్లవనతరణయోః, భ్వాది, స / అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, ణిచ్, లృట్ – ప్ర.ఏ.

**క్రియాదర్శము :** 1. నిః–తరేయమ్, 2. తారయిష్యతి, 3. మా స్మ గాః

| | | | |
|---|---|---|---|
| 1. నిస్తరేయమ్ | తరేత్ | తరేతామ్ | తరేయుః |
| | తరేః | తరేతమ్ | తరేత |
| | **తరేయమ్** | తరేవ | తరేమ |
| 2. తారయిష్యతి | **తారయిష్యతి** | తారయిష్యతః | తారయిష్యన్తి |
| | తారయిష్యసి | తారయిష్యథః | తారయిష్యథ |
| | తారయిష్యామి | తారయిష్యావః | తారయిష్యామః |

3. **మా స్మ గాః (అగాః)** – ఇణ్ (ఇ) గతౌ సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, **అదాది**, లుఙ్ – మ.ఏ.

| | | |
|---|---|---|
| అగాత్ | అగాతామ్ | అగుః |
| **అగాః** | అగాతమ్ | అగాత |
| అగామ్ | అగావ | అగామ |

మాఙ్ (మా) ఇత్యస్య ప్రయోగే అగాత్ ఇత్యాదౌ అకారస్య లోపః భవతి.

శ్లో॥ క్లైబ్యం **మా స్మ గమః** పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! ॥ భ.గీ. 2–3

ఇట **మా స్మ గమః** (అగమః)

గమ్లృ (గమ్) గతౌ, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాది, లుఙ్, మ.ఏ. మాఙ్ (మా) ఇత్యస్య ప్రయోగే అగమత్ ఇత్యాదౌ అకారస్య లోపః భవతి.

| | | |
|---|---|---|
| అగమత్ | అగమతామ్ | అగమన్ |
| **అగమః** | అగమతమ్ | అగమత |
| అగమమ్ | అగమావ | అగమామ |

**ఛందస్సు :** 1. అతిశక్వరీ, 2. **మాలినీ**; 12వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : నిషణ్ణా**

1. శ్లో॥ తస్యోపరి శ్రీభువనేశ్వరి త్వం
సర్వేశ వామాంకతలే **నిషణ్ణా** ।

చతుర్భుజా భూషణభూషితాంగే
నిర్వ్యాజకారుణ్యవతీ విభాసి ॥
– 39–8 'మణిద్వీపనివాసినీ' దేవీనారాయణీయమ్.

2. శ్లో॥ సాదృశ్యతే రాగిజనైరదృశ్యా
మంచే **నిషణ్ణా** బహుశక్తియుక్తా ।
ఏషైవ దృక్ సర్వమిదం చ దృశ్య –
మహేతురేషా ఖలు సర్వహేతుః ॥
– 9–8 'శ్రీభువనేశ్వరీదర్శనమ్' దేవీనారాయణీయమ్.

3. శ్లో॥ నృత్తవాదిత్రకుశలా రాక్షసేంద్రభుజాంకగాః ।
వరాభరణధారిణ్యో **నిషణ్ణా** దదృశే హరిః ॥
– శ్రీమద్వాల్మీకిరామాయణే, సుందరకాండే 10–32

నిషణ్ణాః = బహువచనాంతః

'ఆ రావణాసురుని భుజములమీదను, ఒడిలోను, శయనించియున్నట్టి, గొప్ప నృత్యనిపుణులను, వాద్యప్రవీణులను, అమూల్యమైన భూషణములను ధరించిన వారిని పెక్కండ్రును హనుమ చూచెను.'



## 14

**అవతారిక :** ఈ శ్లోకమున శ్రీకులశేఖరులు 'సంసారసాగరములో మునిగియుండు వారికి 'నీ పాదభక్తియనెడు **నావ** నొసంగు' మని అర్థించుచున్నారు.

**శ్లో॥ తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులే చ ।
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామ –
న్పాదామ్భోజే వరద! భవతో భక్తినావం ప్రయచ్ఛ ॥ 14**

**పదవిభాగము :**

తృష్ణా–తోయే, మదన–పవన + ఉద్ధూత–మోహ + ఊర్మి–మాలే,
దార + ఆవర్తే, తనయ–సహజ–గ్రాహ–సంఘ + ఆకులే, చ ।

సంసార + ఆఖ్యే, మహతి, జలధౌ, మజ్జతామ్, నః + త్రిధామన్!,
పాద + అమ్భోజే, వర-ద!, భవతః, భక్తి-నావమ్, ప్రయచ్ఛ ॥

**అన్వయక్రమము :** (హే) త్రిధామన్! (హే) వర-ద! తృష్ణా-తోయే మదన-పవన + ఉద్ధూత-మోహ + ఊర్మి-మాలే దార + ఆవర్తే తనయ-సహజ-గ్రాహ-సంఘ + ఆకులే చ సంసార + ఆఖ్యే మహతి జలధౌ మజ్జతాం నః భవతః పాద + అమ్భోజే భక్తినావం ప్రయచ్ఛ.

**ప్రతిపదార్థము :**

(హే) త్రిధామన్! = ఓ త్రివిక్రముడా!
(హే) వర-ద! = ఓ వరముల నొసంగువాడా!
తృష్ణా-తోయే = ఆశయనెడు నీళ్లు గలదియు,
మదన-పవన + ఉద్ధూత-మోహ + ఊర్మి-మాలే = కాముడనెడు ప్రభంజనముచే ఉప్పొంగుతున్న మోహమనెడు అలల వరుస గలదియు,
దార + ఆవర్తే = భార్యయనెడు సుడిగుండము గలదియు,
తనయ-సహజ-గ్రాహ-సంఘ + ఆకులే = కొడుకులు, తోడబుట్టినవారు అనెడు మొసళ్ల గుంపుతో కూడినదియు,
సంసార + ఆఖ్యే = సంసారమనబడునదియు,
మహతి = గొప్పదగు,
జలధౌ = సాగరమునందు,
మజ్జతామ్ = మునుగుచున్న,
నః = మాకు,
భవతః = మీయొక్క,
పాద + అంబుజే = పాదపద్మమునందు,
భక్తినావమ్ = భక్తియనెడు నావను,
**ప్రయచ్ఛ** = ఒసంగుము.

**తాత్పర్యము :** ఓ త్రివిక్రముడా! ఓ వరముల నొసంగువాడా! ఆశయనెడు నీళ్లు గలదియు, కాముడనెడు ప్రభంజనముచే ఉప్పొంగుతున్న మోహమనెడు అలల వరుసగలదియు, భార్యయనెడు సుడిగుండము గలదియు, కొడుకులు - తోడబుట్టినవారు అనెడు మొసళ్ల

గుంపుతో కూడినదియు అగు సంసార మనెడు గొప్పదగు సాగరమునందు మునుగుచున్న మాకు మీయొక్క పాదపద్మమునందు భక్తియనెడు **నావ** నొసంగుము.

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. (హే) త్రిధామన్! – **హే త్రిధామన్!** (త్రిధామ) – హే త్రిధామ్నీ (ధామనీ) – హే త్రిధామాని, నాన్తః, నపుంసకలిఙ్గో ధామన్ శబ్దః, సం.ప్ర.ఏ; 2. (హే) వరద! – **(హే) వరద!** – (హే) వరదౌ – (హే) వరదాః, అకారాన్తః పుం.లిఙ్గః, వరదశబ్దః, సం.ప్ర.ఏ; 3. జలధౌ – **(జలం ధీయతేఽత్ర ధా కి)** జలధిః, పుం, **జలధౌ** – జలధ్యోః – జలధిషు, ఇకారాన్తః, స.ఏ., *(ఏవం 1. ...తోయే, 2. ...మాలే, 3. ...ఆవర్తే, 4. ...ఆకులే, 5. ...ఆఖ్యే, 6. ...మహతి – ఇవన్నీ స.ఏ);* 4. భవతః – **భవతః** – భవతోః – భవతామ్, తకారాన్తః, పుంలిఙ్గో భవత్ శబ్దః, ష.ఏ; 5. పాదాంబుజే – **...అంబుజే** – ...అంబుజయోః – ...అంబుజేషు, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ...అంబుజశబ్దః, స.ఏ; 6. భక్తినావమ్ – **...నావమ్** – ...నావౌ – ...నావః, ఔకారాన్తః, స్త్రీలిఙ్గో 'నౌ' శబ్దః, ద్వి.ఏ; 7. ప్రయచ్ఛ – దాణ్ (దానే) ఇచ్చుట, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాది, లోట్, మ.ఏ.

**క్రియాదర్శము :** ప్ర–యచ్ఛ

| | | |
|---|---|---|
| ప్రయచ్ఛతు / ప్రయచ్ఛతాత్ | ప్రయచ్ఛతామ్ | ప్రయచ్ఛన్తు |
| **ప్రయచ్ఛ** / ప్రయచ్ఛతాత్ | ప్రయచ్ఛతమ్ | ప్రయచ్ఛత |
| ప్రయచ్ఛాని | ప్రయచ్ఛావ | ప్రయచ్ఛామ |

**ఛందస్సు :** 1. అత్యష్టి, 2. **మందాక్రాన్తా** – 4వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు,

**పదాదర్శము : వరద!** – సంబోధనప్రథమావిభక్తి – ఏకవచనపదమిది.

అ) (వరం దదాతి దాక) త్రి. **వరదః**, వరదా, వరదమ్;

ఆ) శ్లో॥ స్కన్దః స్కన్దధరో ధుర్యో **వరదో** వాయువాహనః ।
వాసుదేవో బృహద్భానురాదిదేవః పురన్దరః ॥ 36

– ఇతి విష్ణుసహస్రనామస్తోత్రమ్

వరదః – **ఓం వరదాయ నమః**

పరాశరభట్టర్‌వారి భాష్యము

అన్యేభ్యోపి లోకకార్యధుర్యేభ్యో దేవేభ్యః తాంస్తాన్ వరాన్ దదాతీతి **వరదః**.

లోకపాలకులుగా కీర్తించబడిన ఆయాదేవతల అందఱికిని కావలసిన కోరికలను తీర్చినవాడు గనుక ఈ స్వామి **'వరదః'** అనబడుచున్నాడు.

ఇ) శ్లో॥ వరాన్ దదాత్యభిమతాన్ వరంగాం దక్షిణామూత ।
ఇత్యచ్యుతః స వరదో గౌర్వై వర ఇతి శ్రుతేః ।
యజమానస్వరూపేణ హరి**ర్వరద** ఉచ్యతే ॥

భక్తులకు అభిమతములగు వరములను ఇచ్చును. లేదా వరము అనగా యజ్ఞమునందు యజమానరూపమున నుండి ఋత్విజులకు ఇచ్చు దక్షిణ అని శ్రౌతసంప్రదాయము, యజ్ఞమున విష్ణువే యజమానరూపముననుండి ఋత్విజులకు గోరూపదక్షిణను ఇచ్చుచున్నాడు అని అర్థము.

ఈ) శ్రీశనైశ్చరధ్యానమ్ – శనిదేవకవచం

శ్లో॥ నీలాంబరో నీలవపుః కిరీటిగృధ్రస్థితస్త్రాసకరో ధనుష్మాన్ ।
చతుర్భుజో సూర్యసుతః ప్రసన్నాః సదా మమ స్యాద్ **వరదః** ప్రశాన్తః ॥

ఉ) ఇట శ్రీమదప్పయదీక్షితేంద్రప్రణీతమైన **'వరదరాజస్తవము'**నకు డా॥ కందాళ లక్ష్మీనారాయణగారందించిన తత్త్వవేది ఆంధ్రానువాదమును అనుసంధానము చేసికొనదగును.

శ్లో॥ ఉద్ఘాట్య యోగకలయా హృదయాబ్జకోశం
ధన్యైశ్చిరాదపి యథారుచి గృహ్యమాణః ।
యః ప్రస్ఫురత్యవిరతం పరిపూర్ణరూపః
శ్రేయస్స మే దిశతు శాశ్వతికం **ముకుందః** ॥ 1

**ముకున్దః** – ముకుమ్ – మోక్షమును, దదాతి – ఇచ్చును, లేక ము – మోక్షమును, కుమ్ – ఇహలోకసౌఖ్యములను, ద – ఇచ్చువాదని యర్థము.

**మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్** అను మహర్షివచనమును బట్టి మోక్షప్రదాత శ్రీమన్నారాయణుడే.

ఆయనయే ఈ స్తోత్రములో 'పశ్యన్ భవన్తముపయాతి భవాబ్ధిపారమ్' - శ్లో॥ 11 అని, తన్మాత్రతోఽపి తవ ముక్తిదతామబుద్ధ్వా - శ్లో॥ 34 అనియు వరదునిగా స్తుతింపబడినాడు.



## 15

**అవతారిక :** 'ఏ జన్మమునందైనను నా యింద్రియములు నీకు (భగవంతునకు) అభిముఖమై యుండుగాక' అని అర్థిస్తున్నారు శ్రీ కులశేఖరులు.

**శ్లో॥ మాఽద్రాక్షం క్షీణపుణ్యాన్ క్షణమపి భవతో భక్తిహీనాన్ పదాబ్జే**
**మాఽశ్రౌషం శ్రావ్యబన్ధం తవచరితమపాస్యాన్యదాఖ్యానజాతమ్ ।**
**మాఽస్మార్షం మాధవ! త్వామపి భువనపతే! చేతసాఽపహ్నువానాన్**
**మాఽభూవం త్వత్సపర్యావ్యతికరరహితో జన్మజన్మాన్తరేఽపి ॥ 15**

**పదవిభాగము :**

మా, అద్రాక్షమ్, క్షీణపుణ్యాన్, క్షణమ్ + అపి, భవతః, భక్తిహీనాన్, పద + అబ్జే,
మా, అశ్రౌషమ్, శ్రావ్య-బన్ధమ్, తవ-చరితమ్, అపాస్య, అన్యత్, ఆఖ్యాన-జాతమ్।
మా, అస్మార్షమ్, మాధవ!, త్వామ్ + అపి, భువన-పతే!, చేతసా, అపహ్నువానాన్,
మా, అభూవమ్, త్వత్-సపర్యా-వ్యతికర-రహితః, జన్మ-జన్మాన్తరేఽపి ॥

**అన్వయక్రమము :** (హే) భువనపతే! (హే) మాధవ! క్షణమ్ + అపి భవతః పద + అన్తే భక్తిహీనాన్ క్షణపుణ్యాన్ మాఽద్రాక్షమ్. శ్రావ్య-బంధం తవచరితమ్ అపాస్య అన్యత్ ఆఖ్యానజాతం మాఽశ్రౌషమ్. త్వామ్ చేతసా + అపి అపహ్నువానాన్ మాఽస్మార్షమ్. జన్మజన్మాన్తరేఽపి త్వత్సపర్యా-వ్యతికర-రహితః మాఽభూవమ్.

**ప్రతిపదార్థము :**

హే భువనపతే! = ఓ జగన్నాయకా!,
హే మాధవ! = ఓ మాధవా!,
క్షణమ్ + అపి = ఇంచుక సేపైనా,
భవతః = నీయొక్క,

పద + అబ్జే = కమలములవంటి పాదములయందు,
భక్తి–హీనాన్ = భక్తిలేనివారైన,
క్షీణ–పుణ్యాన్ = పుణ్యహీనులను (పాపులను),
**మా౽ద్రాక్షమ్** = చూడకుందునుగాక!
శ్రావ్య–బంధమ్ = చెవుల కింపైన కూర్పుగలదగు,
తవ–చరితమ్ = నీ గాథను,
అపాస్య = విడిచి,
అన్యత్ = ఇతరమైన,
ఆఖ్యానజాతమ్ = గాథల సముదాయమును,
**మా౽శ్రౌషమ్** = వినకుందును గాక!,
త్వామ్ = నిన్ను
చేతసా + అపి = మనసులో ఐనా సరే,
అపహ్నువానాన్ = లేదనుకునేవారిని,
**మా౽స్మార్షమ్** = తలచకుందునుగాక!,
జన్మ–జన్మాన్తరే౽పి = జన్మజన్మల్లోను,
త్వత్ + సపర్యా–వ్యతికర–రహితః = నీ సేవాభాగ్యము లేనివాడుగా
**మా౽భూవమ్** = అవకుందును గాక!

**తాత్పర్యము :** ఓ జగన్నాయకా! ఓ మాధవా! ఇంచుకసేపైనా నీయొక్క పాదకమలముల యందు భక్తిలేనివారైన పుణ్యహీనులను చూడకుందునుగాక. చెవికింపైన కూర్పుగలదగు నీ గాథను విడచి ఇతరమైన గాథలసముదాయమును వినకుందునుగాక. నిన్ను మనసులో ఐనా సరే లేదనుకునేవారిని తలచకుందునుగాక. జన్మజన్మల్లోను నీ సేవాభాగ్యము లేనివాడుగా అవకుందునుగాక.

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. పదాబ్జే – **పదాబ్జే** – పదాబ్జయోః – పదాబ్జేషు, అకారాన్తః, పుంలిఙ్గః, పదాబ్జశబ్దః, స.ఏ; 2. భక్తిహీనాన్ – **భక్తిహీనమ్** – భక్తిహీనౌ – భక్తిహీనాన్, అకారాన్తః, పుంలిఙ్గః, భక్తిహీనశబ్దః, ద్వి.బ; 3. క్షీణపుణ్యాన్ – క్షీణపుణ్యమ్ – క్షీణపుణ్యౌ – **క్షీణపుణ్యాన్,**

అకారాన్తః, పుంలిఙ్గః, క్షీణపుణ్యశబ్దః, ద్వి.బ; 4. శ్రావ్యబంధమ్ – **శ్రావ్యబంధమ్** – శ్రావ్యబంధౌ – శ్రావ్యబంధాన్, అకారాన్తః, పుంలిఙ్గః, శ్రావ్యబన్ధశబ్దః, ద్వి.ఏ; 5. తవ చరితమ్ – **…చరితమ్** – …చరితౌ – …చరితాన్, అకారాన్తః, పుంలిఙ్గః, తవచరితశబ్దః, ద్వి.ఏ; 6. అపాస్య – అప అస్ ల్యప్ – అవ్యయము, **'వద సత్యమపాస్య పక్షపాతం యది, జాతికుసుమానుకారి పుష్పమ్'** – ఉద్భటః; 7. అన్యత్ – అన్ యతి – అవ్యయము; 8. ఆఖ్యానజాతమ్ – **ఆఖ్యానజాతమ్** – ఆఖ్యానజాతే – ఆఖ్యానజాతాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ఆఖ్యానజాతశబ్దః, ద్వి.ఏ; 9. అపహ్నువానాన్ – అపహ్నువానమ్ – అపహ్నువానౌ – **అపహ్నువానాన్**, అకారాన్తః, పుంలిఙ్గః, అపహ్నువానశబ్దః, ద్వి.బ; 10. …రహితః – **…రహితః** – …రహితౌ – …రహితాః, అకారాన్తః, పుంలిఙ్గః, …రహితశబ్దః, ప్ర.ఏ; 11. అద్రాక్షమ్ = దృశిర్ (దృశ్) ప్రేక్షణే, భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లుఙ్(2), ఉ.ఏ; 12. అస్మార్షమ్ – స్మృ (ఆధ్యానే) తలంచుట, భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లుఙ్, ఉ.ఏ; 13. అశ్రౌషమ్ – శ్రు (శ్రవణే) వినుట, భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లుఙ్, ఉ.ఏ; 14. అభూవమ్ – భూ (సత్తాయామ్) ఉండుట, భ్వాది, అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లుఙ్, ఉ.ఏ.

**క్రియాదర్శము :** 1. అద్రాక్షమ్, 2. అస్మార్షమ్, 3. అశ్రేషమ్, 4. అభూవమ్.

1. అద్రాక్షమ్ – లుఙ్ (2) ఉ.ఏ.

| | | |
|---|---|---|
| అద్రాక్షీత్ | అద్రాష్టామ్ | అద్రాక్షుః |
| అద్రాక్షీః | అద్రాష్టమ్ | అద్రాష్ట |
| **అద్రాక్షమ్** | అద్రాక్ష్వ | అద్రాక్ష్మ |

2. అస్మార్షమ్ – లుఙ్ – ఉ.ఏ. స్మృ – ఆధ్యానే

| | | |
|---|---|---|
| అస్మార్షీత్ | అస్మార్ష్టామ్ | అస్మార్షుః |
| అస్మార్షీః | అస్మార్ష్టమ్ | అస్మార్ష్ట |
| **అస్మార్షమ్** | అస్మార్ష్వ | అస్మార్ష్మ |

3. అశ్రౌషమ్ – లుఙ్ – ఉ.ఏ.

శ్రువః శృ చ (సూ.3–1–74) అను సూత్రముచే శ్రు ధాతువునకు శృ ఆదేశము, శ్ను ప్రత్యయము చెప్పబడినది. శృ + ను + తి = శృ + నో + తి 'ను' కారములో ఉ కారమునకు గుణము 'ఓ', ను కారమునకు పరసవర్ణము (శృ+ణో+తి = శృణోతి)

| | | |
|---|---|---|
| అశ్రౌషీత్ | అశ్రేష్టామ్ | అశ్రౌషుః |
| అశ్రేషీః | అశ్రౌష్టమ్ | అశ్రౌష్ట |
| **అశ్రౌషమ్** | అశ్రౌష్వ | అశ్రౌష్మ |

4. అభూవమ్ = లుఙ్, భూతే, ఉ.ఏ.

| | | |
|---|---|---|
| అభూత్ | అభూతామ్ | అభూవన్ |
| అభూః | అభూతమ్ | అభూత |
| **అభూవమ్** | అభూవ | అభూమ |

**ఛందస్సు :** 1. అతిశక్వరీ, 2. **మాలినీ**, 2వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : న మాఙ్యోగే 6-4-74**

**1. అడాటౌ న స్తః. మా భవాన్ భూత్, మా స్మ భవత్, మా స్మ భూత్, 'లుఙ్ లఙ్ లృఙ్ క్ష్వడుదాత్తః', 'ఆడజాదీనామ్' అను సూత్రములనుండి 'అట్' 'ఆట్' అను పదము లనువర్తించును. 'మాఙ్' తో సంబంధమున్నపుడు అడాగమము, ఆడాగమమును రావు.**

**'మా భవాన్ భూత్' అను నుదాహరణమున మాఙిలుఙ్ అను సూత్రముచే లుఙ్ వచ్చినది. ఇచట మాఙ్ ఉన్నది గాన అడాగమము రాలేదు. భూత్ అనియే యున్నది. రెండవ ఉదాహరణమున స్మ తో కలసిన మాఙ్ ఉత్తరపదమగుటచే స్మోత్తరే లఙ్ చ అను సూత్రముచే 'లఙ్' 'లుఙ్' లు వైకల్పికముగ వచ్చినవి. ఈ సూత్రము ననుసరించి అడాగమము రాకుండుటచే 'మా స్మ భవత్' అని లఙ్ రూపము, మా స్మ భూత్ అను లుఙ్ రూపమును ఉండును. 'ఆట్' ఆగమము 'ఆడజాదీనామ్' అను సూత్రముచే అజాది ధాతువులకు విధింపబడినది.** - లఘుసిద్ధాన్త కౌముదీ, బాలానన్దిన్యాఖ్యయా, 297 పుట.



## 16

**అవతారిక :** ఈ శ్లోకమున 'సర్వేంద్రియములచేతను, మనోబుద్ధులచేతను సుఖము కలుగవలయును' అని శ్రీకులశేఖరాళ్వార్లు భగవంతుని వివిధనామములతో కీర్తించుచున్నారు.

శ్లో॥ జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వన్ద్వ! సమర్చయాచ్యుతకథాః శ్రోత్రద్వయ! త్వం శృణు।
కృష్ణం లోకయ లోచనద్వయ! హరేర్గచ్ఛాఙ్ఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ! ముకున్ద-పాద-తులసీం మూర్ధన్నమాధోక్షజమ్॥ 16

**పదవిభాగము :**

జిహ్వే!, కీర్తయ, కేశవమ్, మురరిపుమ్, చేతః!, భజ, శ్రీధరమ్, పాణిద్వన్ద్వ!, సమర్చయ + అచ్యుతకథాః, శ్రోత్రద్వయ!, త్వమ్, శృణు, కృష్ణమ్, లోకయ, లోచనద్వయ!, హరేః, గచ్ఛ+అంఘ్రియుగ్మ!+ఆలయమ్, జిఘ్ర, ఘ్రాణ!, ముకున్ద-పాద-తులసీమ్, మూర్ధన్!, నమ, అధోక్షజమ్ ।

**అన్వయక్రమము :** జిహ్వే! కేశవం కీర్తయ. చేతః మురరిపుం భజ. పాణిద్వంద్వ! శ్రీధరం సమర్చయ. శ్రోత్రద్వయ! త్వమ్ అచ్యుతకథాః శృణు. లోచనద్వయ! కృష్ణం లోకయ. అంఘ్రిద్వయ! హరేః ఆలయం గచ్ఛ. ఘ్రాణ! ముకుంద-పాద-తులసీం జిఘ్ర. మూర్ధన్! అధోక్షజం నమ.

**ప్రతిపదార్థము :**

(హే) జిహ్వే! = ఓ నాలుకా!,
కేశవమ్ = కేశవుని,
**కీర్తయ** = కీర్తించుము.
(హే) చేతః! = ఓ మనసా!,
మురరిపుమ్ = మురారిని,
**భజ** = సేవింపుము.
(హే) పాణిద్వంద్వ! = ఓ హస్తద్వయమా!,
శ్రీధరమ్ = శ్రీధరుని,
**సమర్చయ** = చక్కగా పూజింపుము.
(హే) శ్రోత్రద్వయ! = ఓ శ్రవణద్వంద్వమా!,
త్వమ్ = నీవు,
అచ్యుతకథాః = అచ్యుతుని కథలను,
**శృణు** = వినుము.

(హే) లోచనద్వయ! = ఓ నేత్రద్వయమా!,
కృష్ణమ్ = కృష్ణుణ్ణి,
**లోకయ** = దర్శింపుము.
(హే) అంఘ్రిద్వయ! = ఓ చరణద్వంద్వమా!,
హరేః = హరియొక్క,
ఆలయమ్ = గుడినిగూర్చి
**గచ్ఛ** = వెళ్లుము.
(హే) ఘ్రాణ! = ఓ నాసికా!,
ముకుంద–పాద–తులసీమ్ = ముకుందునియొక్క పాదములందలి తులసిని
**జిఘ్ర** = ఆఘ్రాణించుము.
(హే) మూర్ధన్! = ఓ శిరసా!,
అధోక్షజమ్ = అధోక్షజుడైన భగవంతునిగూర్చి;
**నమ** = నమస్కరింపుము.

**తాత్పర్యము :** ఓ నాలుకా! కేశవుని కీర్తించుము. ఓ మనసా! మురారిని సేవింపుము. ఓ హస్తద్వయమా! శ్రీధరుని చక్కగ పూజింపుము. ఓ శ్రవణద్వంద్వమా! నీవు అచ్యుతుని కథలను వినుము. ఓ నేత్రద్వయమా! కృష్ణుణ్ణి దర్శించుము. ఓ చరణద్వంద్వమా! హరియొక్క గుడికి వెళ్లుము. ఓ నాసికా! ముకుందునియొక్క పాదములందలి తులసిని ఆఘ్రాణించుము. ఓ శిరసా! అధోక్షజుడైన భగవంతునికి నమస్కరింపుము.

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1.(హే) జిహ్వే! – **(హే) జిహ్వే!** – (హే) జిహ్వే! – (హే) జిహ్వాః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, జిహ్వాశబ్దః, సం.ప్ర.ఏ; 2. కేశవమ్ – **కేశవమ్** – కేశవౌ – కేశవాన్, అకారాన్తః, పుంలిఙ్గః, కేశవశబ్దః, ద్వి.ఏ; 3. (హే) చేతః – **(హే) చేతః** – (హే) చేతసీ, (హే) చేతాంసి, సకారాన్తః, నపుంసకలిఙ్గః, చేతస్‌శబ్దః, సం.ప్ర.ఏ; 4. మురరిపుమ్ – **మురరిపుమ్** – మురరిపూ – మురరిపూన్, ఉకారాన్తః, పుంలిఙ్గః, మురరిపుశబ్దః, ద్వి.ఏ; 5. (హే) పాణిద్వంద్వ! – **(హే) పాణిద్వంద్వ!** – (హే) పాణిద్వంద్వే – (హే) పాణిద్వంద్వాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, పాణిద్వంద్వశబ్దః, సం.ప్ర.ఏ; 6. శ్రీధరమ్ – **శ్రీధరమ్** – శ్రీధరౌ – శ్రీధరాన్, అకారాన్తః, పుంలిఙ్గః, శ్రీధరశబ్దః, ద్వి.ఏ; 7. (హే) శ్రోత్రద్వయ! –

**(హే) శ్రోత్రద్వయ!** – (హే) శ్రోత్రద్వయే – (హే) శ్రోత్రద్వయాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, శ్రోత్రద్వయశబ్దః, సం.ప్ర.ఏ; 8. అచ్యుతకథాః – అచ్యుతకథామ్ – అచ్యుతకథే – **అచ్యుతకథాః**, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, అచ్యుతకథాశబ్దః, ద్వి.బ; 9. కీర్తయ – కృాత సంశబ్దనే, చురాది, సకర్మకమ్, సేట్, ఉభయ (పరస్మైపదీ) లోట్, మ.ఏ; 10. భజ – భజ్ సేవాయామ్ (సేవించుట) సకర్మకమ్, భ్వాది, అనిట్, ఉభయ (పరస్మైపదీ) లోట్, మ.ఏ; 11. సమర్చయ – సం+అర్చయ, అర్చ్ పూజాయామ్, చురాది, సకర్మకమ్, సేట్, ఉభయ (పరస్మైపదీ) లోట్, మ.ఏ; 12. శృణు – (శ్రు) శ్రవణే (వినుట), భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, మ.ఏ; 13. లోకయ – లోకృ దర్శనే, సకర్మకమ్, సేట్, ఉభయ (పరస్మైపదీ) లోట్, మ.ఏ; 14. గచ్ఛ – గమ్లు – (గమ్) గతౌ (వెళ్ళుట), భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, మ.ఏ; 15. జిఘ్ర – ఘ్రా, భ్వాది, లోట్

**క్రియాదర్శము :** 1. కీర్తయ, 2. భజ, 3. సమర్చయ, 4. శృణు, 5. లోకయ, 6. గచ్ఛ, 7. నమ, 8. జిఘ్ర

| | | | |
|---|---|---|---|
| 1. కీర్తయ – | కీర్తయతు / కీర్తయాతాత్ | కీర్తయతామ్ | కీర్తయన్తు |
| | **కీర్తయ** / కీర్తయాతాత్ | కీర్తయతమ్ | కీర్తయత |
| | కీర్తయాని | కీర్తయావ | కీర్తయామ |
| 2. భజ – | భజతు / భజతాత్ | భజతామ్ | భజన్తు |
| | **భజ** / భజతాత్ | భజతమ్ | భజత |
| | భజాని | భజావ | భజామ |
| 3. సమర్చయ – | అర్చయతు/అర్చయతాత్ | అర్చయతామ్ | అర్చయన్తు |
| | **అర్చయ** | అర్చయతమ్ | అర్చయత |
| | అర్చయాని | అర్చయావ | అర్చయామ |
| 4. శృణు – | శృణోతు/శృణుతాత్ | శృణుతామ్ | శృణ్వన్తు |
| | **శృణు**/శృణుతాత్ | శృణుతమ్ | శృణుత |
| | శృణువాని | శృణువావ | శృణువామ |
| 5. లోకయ | లోకయతు/ లోకయతాత్ | లోకయతామ్ | లోకయన్తు |
| | **లోకయ**/ లోకయతాత్ | లోకయతమ్ | లోకయత |
| | లోకయాని | లోకయావ | లోకయామ |

6. గచ్ఛ – ఇషుగమియమాం ఛః సూ (7–3–77) చే మకారమునకు ఛకారాదేశము గమ్+అ+తి = గఛ్+అ+తి. తుగాగమము, శ్చుత్వములచే గచ్ఛతి అనురూపము.

| | | |
|---|---|---|
| గచ్ఛతు / గచ్ఛతాత్ | గచ్ఛతామ్ | గచ్ఛన్తు |
| **గచ్ఛ** / గచ్ఛతాత్ | గచ్ఛతమ్ | గచ్ఛత |
| గచ్ఛాని | గచ్ఛావ | గచ్ఛామ. |

7. నమ – ణమ (నమ్) ప్రహత్వే, నమ్రత్వే, శబ్దే చ, భ్వాది, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, మ.ఏ.

| | | |
|---|---|---|
| నమతు / నమతాత్ | నమతామ్ | నమన్తు |
| **నమ** / నమతాత్ | నమతమ్ | నమత |
| నమాని | నమావ | నమామ |

8. జిఘ్ర – జిఘ్ర/జిఘ్రతాత్ – జిఘ్రతమ్ – జిఘ్రత, లోట్, మ.ఏ.

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితమ్, 11వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : 1. అధోక్షజమ్**

అ) **అధోక్షజమ్** – అధోక్షజౌ – అధోక్షజాన్, అకారాన్తః, పుంలిఙ్గః, అధోక్షజశబ్దః, ద్వి.ఏ.

ఆ) అధః జ్ఞాతృత్వాభావాత్ హీనమ్ అక్షజం ప్రత్యక్షజ్ఞానం యస్మై సః । అక్షాత్ ఇంద్రియాత్ జాతమ్ । అక్ష + జన్ + డ. విష్ణుః.

శ్లో॥ 'అధో న క్షీయతే జాతు యస్మాత్తస్మా**దధోక్షజః**।' – ఇతి మహాభారతే

ఇ) శ్లో॥ వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణమః పృథుః ।
హిరణ్యగర్భశ్శత్రుఘ్నో వ్యాప్తో వాయు**రధోక్షజః** ॥ 44

అధోక్షజః – **ఓం అధోక్షజాయ నమః**

భాష్యము : ఏవం అమృతోదధివత్సర్వైః సదోపముజ్యమానోపి 'అధో న క్షీయతే జాతు యస్మాత్తస్మాదధోక్షజః' ఇతి – అధోక్షజః – యథా 'అక్షయ్యమ్మధుహన్తారం జానామి త్వాం సురోత్తమమ్', 'అక్షయ్యకీర్తిశ్చ' ఇత్యాది.

అమృతసముద్రమువలె ఎందఱు ఎంత ఉపయోగించుకున్నను తరగని మాధుర్యము కలవాడు గనుక 'అధోక్షజుడు' అనబడుచున్నాడు. అని భారతములోని 'అధోనక్షీయతే...' శ్లోకము తెలుపుచున్నది. రామాయణములోని 'అక్షయ్యం మధుహన్తారం' అను పరశురాముని వాక్యము, 'అక్షయ్యకీర్తిః' అను తార చెప్పిన వాక్యము రామునిలోని తరగని మాధుర్యమును తెలుపుచున్నది. రామాయణములోని 'అక్షయ్య' పదము 'క్షయ్యజయ్యౌశక్యార్థే అను సూత్రమునుబట్టి – 'ఖర్చుచేసి ఇక లేదు అనిపించుటకు శక్యము కానంతటి విపులగుణ వైభవము కలవాడు' అని తెలుపుచున్నది.

– **శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము**–ఆంధ్రానువాదము.



## 17

**అవతారిక : 'భగవన్నామస్మరణయొక్కటే'** ఆనందమును ప్రసాదించుచున్నదనుచున్నారు శ్రీ కులశేఖరులు.

**శ్లో॥ హే లోకాశ్శృణుత ప్రసూతిమరణవ్యాధేశ్చికిత్సామిమాం**
**యోగజ్ఞాస్సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః।**
**అన్తర్జ్యోతిరమేయమేకమమృతం కృష్ణాఖ్యమాపీయతాం**
**తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణమాత్యన్తికమ్ ॥ 17**

**పదవిభాగము :**

హే, లోకాః!, శృణుత, ప్రసూతి–మరణ–వ్యాధేః, చికిత్సామ్, ఇమామ్, యోగజ్ఞాః, సముదాహరన్తి, మునయః, యామ్, యాజ్ఞవల్క్యాదయః । అన్తర్+జ్యోతిః, అమేయమ్, ఏకమ్, అమృతమ్, కృష్ణ+ఆఖ్యమ్, ఆపీయతామ్, తత్, పీతమ్, పరమ+ఔషధమ్, వితనుతే, నిర్వాణమ్, ఆత్యన్తికమ్ ॥

**అన్వయక్రమము :** హే లోకాః! ప్రసూతి–మరణ–వ్యాధేః ఇమాం చికిత్సాం శృణుత. యామ్ యాజ్ఞవల్క్యాదయః యోగ–జ్ఞాః మునయః సముదాహరన్తి అన్తర్జ్యోతిః అమేయమ్ ఏకం కృష్ణ + ఆఖ్యమ్ అమృతమ్ ఆపీయతాం పీతం తత్ పరమ + ఔషధమ్ ఆత్యన్తికం నిర్వాణం వితనుతే.

**ప్రతిపదార్థము :**

హే లోకాః! = ఓ జనులారా!
ప్రసూతి–మరణ–వ్యాధేః = జననమరణములనెడు వ్యాధికి,
ఇమాం చికిత్సామ్ = ఈ చికిత్సను,
**శృణుత** = వినుడు.
యామ్ = ఏయౌషధమును,
యాజ్ఞవల్క్యాదయః = యాజ్ఞవల్క్యమహాముని మొదలగువారును,
యోగ–జ్ఞాః = యోగశాస్త్రము నెఱింగినవారును, అగు
మునయః = మునులు,
**సముదాహరన్తి** = చెప్పుచున్నారో,
అంతర్జ్యోతిః = స్వయంప్రకాశమైనదియు,
అమేయమ్ = హద్దులేనిదియు, అగు
కృష్ణాఖ్యమ్ = కృష్ణుడనుపేరుగల,
అమృతమ్ ఏకమ్ = అమృతమొక్కటే,
**ఆపీయతామ్** = త్రాగబడునుగాక.
పీతమ్ = త్రాగబడినదైన
తత్ పరమౌషధమ్ = ఆ పరమౌషధము
ఆత్యన్తికమ్ = శాశ్వతమగు,
నిర్వాణమ్ = ఆనందమును,
**వితనుతే** = కలుగజేయుచున్నది.

**తాత్పర్యము :** ఓ జనులారా! జననమరణములనెడు వ్యాధికి ఈ చికిత్సను వినుడు. ఏయౌషధమును యాజ్ఞవల్క్యమహాముని మొదలగువారును, యోగశాస్త్రము నెఱింగినవారును అగు ఋషులు చెప్పుచున్నారో, స్వయంప్రకాశము కలదియు, హద్దులేనిదియు అగు శ్రీకృష్ణుడను పేరుగల అమృతమొక్కటే త్రాగబడునుగాక. త్రాగబడినదైన ఆ పరమౌషధము శాశ్వతమగు ఆనందమును కలుగజేయుచున్నది.

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. హే లోకాః – హే లోకః – హే లోకౌ – **హే లోకాః**, అకారాన్తః, పుంలిఙ్గః,

లోకశబ్దః, సం.ప్ర.బ; 2. ...వ్యాధేః – **వ్యాధేః** – వ్యాధ్యోః – వ్యాధీనామ్, ఇకారాన్తః, పుంలిఙ్గః, వ్యాధిశబ్దః, ష.ఏ; 3. చికిత్సామ్ – **చికిత్సామ్** – చికిత్సే – చికిత్సాః, ఆకారాన్తః స్త్రీలింగః, చికిత్సాశబ్దః, ద్వి.ఏ; 4. యామ్ – **యామ్** – యే – యాః, దకారాన్తః, స్త్రీలింగః, యచ్ఛబ్దః, ద్వి.ఏ; 5. మునయః – మునిః – మునీ – **మునయః**, ఇకారాన్తః, పుంలిఙ్గః, మునిశబ్దః, ప్ర.బ; 6. అంతర్జ్యోతిః – **...జ్యోతిః** – ...జ్యోతిసీ – ...జ్యోతీంసి, సకారాన్తః, నపుంసకలిఙ్గః, 'జ్యోతిస్'శబ్దః, ప్ర.ఏ; 7. అమృతమ్ – **అమృతమ్** – అమృతే – అమృతాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, అమృతశబ్దః, ప్ర.ఏ; 8. పరమౌషధమ్ – **ఔషధమ్** – ఔషధీ – ఔషధాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ఔషధశబ్దః, ప్ర.ఏ; 9. ఆత్యన్తికమ్ – **ఆత్యన్తికమ్** – ఆత్యన్తికే – ఆత్యన్తికాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ఆత్యన్తికశబ్దః, ద్వి.ఏ; 10. శృణుత – భ్వాది, శ్రు శ్రవణే, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, మ.బ; 11. ఆపీయతామ్ – పా పానే (త్రాగుట) భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, కర్మణిప్రయోగం, లోట్, ప్ర.ఏ; 12. సముదాహరన్తి – సమ్+ఉత్+ఆ+ హృఞ్ హరణే, సకర్మకమ్, అనిట్, ఉభయ (పరస్మైపదీ), లట్, ప్ర.బ; 13. వితనుతే – తను (తన్) విస్తారే (విస్తరించుట/వెల్లడించుట), సకర్మకమ్, సేట్, ఉభయ (ఆత్మనేపదీ), లట్, ప్ర.ఏ. 14. హే – సంబోధనశ్లాఘావిస్మయాసూయా అస్యార్థాః। సంబోధనే–హే దేవదత్త!

**క్రియాదర్శము :** 1. శృణుత, 2. ఆపీయతామ్, 3. సముదాహరన్తి, 4. వి–తనుతే.

| | | | |
|---|---|---|---|
| 1. శృణుత – | శృణోతు / శృణుతాత్ | శృణుతామ్ | శృణ్వన్తు |
| | శృణు / శృణుతాత్ | శృణుతమ్ | **శృణుత** |
| | శృణవాని | శృణవావ | శృణవామ |

2. ఆపీయతామ్ – కర్మణి లోట్ – ప్ర.ఏ.(ఆ.ప)

| | | |
|---|---|---|
| **ఆపీయతామ్** | ఆపీయేతామ్ | ఆపీయన్తామ్ |
| ఆపీయస్వ | ఆపీయేథామ్ | ఆపీయధ్వమ్ |
| ఆపీయై | ఆపీయావహై | ఆపీయామహై |

3. సముదాహరన్తి – భ్వాది

| | | |
|---|---|---|
| హరతి | హరతః | **హరన్తి** |
| హరసి | హరథః | హరథ |
| హరామి | హరావః | హరామః |

4. వి–తనుతే – తనాది (8) – ఆత్మనేపదీ

| | | | |
|---|---|---|---|
| వి–తనుతే | **తనుతే** | తన్వాతే | తన్వతే |
| | తనుషే | తన్వాథే | తనుధ్వే |
| | తన్వే | తనువహే/తన్వహే | తనుమహే / తన్మహే |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. **శార్దూలవిక్రీడితమ్.** 11వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : నిర్వాణమ్**

అ) నిర్వాణమ్. క్లీ. నిర్ + వా గతౌ + క్త, తస్య నః । అపవర్గః

ఆ) శ్లో॥ కైవల్యం **నిర్వాణం** నిశ్శ్రేయసమమృతమక్షరం (బ్రహ్మ) ।
అపునర్భవోఽపవర్గో ముక్తిర్మోక్షో మహానందః ॥
అని **హలాయుధకోశము** 11 నామములను పేర్కొన్నది.

'ముక్తాశ్రయం యర్హి నిర్విషయం విరక్తం **నిర్వాణ**మృచ్ఛతి
మనః సహసా యథార్చిః ॥ ఇతి భాగవతే 3/28/35.
విష్ణుః అనే అర్థములో మహాభారతశ్లోకాన్ని ఉటంకించింది.

శ్లో॥ త్రిసామా సామగః సామ ।
**నిర్వాణం** భేషజం భిషక్ ॥ 13/149/75

ఇ) **'శ్రీమచ్ఛంకరాచార్యకృత నిర్వాణషట్కమ్'**ను ఇట అనుసంధానము చేసుకుందురు గాక!

శ్లో॥ మనోబుద్ధ్యహంకారచిత్తాని నాహం
న చ శ్రోత్రజిహ్వే న చ ఘ్రాణనేత్రే ।
న చ వ్యోమ భూమిర్న తేజో న వాయు –
శ్చిదానందరూపః **శివోఽహం శివోఽహమ్** ॥ 1

శ్లో॥ న చ ప్రాణసంజ్ఞో న వై పంచవాయుః
న వా సప్తధాతుర్న వా పంచకోశః ।
న వాక్పాణిపాదౌ న చోపస్థపాయూ
చిదానందరూపః **శివోఽహం శివోఽహమ్** ॥ 2

శ్లో॥ న మే ద్వేషరాగౌ న మే లోకమోహౌ
మదో నైవ మే నైవ మాత్సర్యభావః ।
న ధర్మో న చార్థో న కామో న మోక్ష-
శ్చిదానందరూపః **శివోఽహం శివోఽహమ్** ॥ 3

శ్లో॥ న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం
న మంత్రో న తీర్థం న వేదా న యజ్ఞాః ।
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
చిదానందరూపః **శివోఽహం శివోఽహమ్** ॥ 4

శ్లో॥ న మృత్యుర్న శంకా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మః ।
న బంధుర్న మిత్రం గురుర్నైవ శిష్య -
శ్చిదానందరూపః **శివోఽహం శివోఽహమ్** ॥ 5

శ్లో॥ అహం నిర్వికల్పో నిరాకారరూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణామ్ ।
న చాసంగతం నైవ ముక్తిర్న మేయ-
శ్చిదానందరూపః **శివోఽహం శివోఽహమ్** ॥ 6

- ఇతి శ్రీమచ్ఛంకరాచార్యకృత నిర్వాణషట్కమ్

'ఆనందడోలికల్లో తేలియాడటమే'

ఉ) ఇట ఋగ్వేదానికి సంబంధించినదగు 'నిర్వాణోపనిషత్తు'ను అనుసంధానము చేసుకొనదగును.



## 18

**అవతారిక : 'ఓన్నమో నారాయణాయ'** అను అష్టాక్షరీ మహామంత్రమును పదే పదే వల్లింపుడని ఈ శ్లోకమున శ్రీకులశేఖరులు పలుకుచున్నారు.

**శ్లో॥ హే మర్త్యాః! పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపతః**
**సంసారార్ణవమాపదూర్మిబహులం సమ్యక్ప్రవిశ్య స్థితాః ।**

**నానాజ్ఞానమపాస్య చేతసి నమో నారాయణాయేత్యముం**
**మన్త్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః ॥ 18**

**పదవిభాగము :**

హే మర్త్యాః!, పరమమ్, హితమ్, శృణుత, వః, వక్ష్యామి, సంక్షేపతః
సంసార+అర్ణవమ్, ఆపత్+ఊర్మి-బహులమ్, సమ్యక్, ప్రవిశ్య, స్థితాః ।
నానా-జ్ఞానమ్, అపాస్య, చేతసి, నమః, నారాయణాయ, ఇతి+అముమ్,
మన్త్రమ్, స-ప్రణవమ్, ప్రణామసహితమ్, ప్రావర్తయధ్వమ్, ముహుః ।

**అన్వయక్రమము :** హే మర్త్యాః! వః పరమం హితం సంక్షేపతః వక్ష్యామి. శృణుత. ఆపత్ + ఊర్మి-బహులం సంసార + అర్ణవం సమ్యక్ ప్రవిశ్య స్థితాః నానా-జ్ఞానమ్ అపాస్య చేతసి **'నమో నారాయణాయ'** ఇతి అముం మంత్రం స-ప్రణవం ప్రణామసహితం ముహుః ప్రావర్తయధ్వమ్.

**ప్రతిపదార్థము :**

హే మర్త్యాః! = ఓ నరులారా!,
వః = మీకు,
పరమమ్ = ఉత్తమమైన,
హితమ్ = మేలును గూర్చి,
సంక్షేపతః = సంగ్రహముగ,
వక్ష్యామి = చెప్పబోవుచున్నాను.
శృణుత = వినుడు.
ఆపదూర్మి-బహులమ్ = ఆపదలనెడు యలలతో నిండినదగు
సంసార-అర్ణవమ్ = సంసారమనెడు సాగరమును,
సమ్యక్ ప్రవిశ్య = బెఱుకులేకుండా ప్రవేశించి,
స్థితాః = ఉన్న మీరు,
నానా-జ్ఞానమ్ = నానావిధములైన జ్ఞానమును,
అపాస్య = విడచి,
చేతసి = మనస్సునందు,
స-ప్రణవమ్ = 'ఓం'కారముతో కూడిన

**'నమో నారాయణాయ'** ఇతి = 'నమో నారాయణాయ' అనే,
అముమ్ మంత్రమ్ = ఈ మంత్రమును
ప్రణామసహితమ్ = నమస్కారపూర్వకముగ
ముహుః = పదే పదే
**ప్రావర్తయధ్వమ్** = ఆవృత్తి చేయుడు.

**తాత్పర్యము :** ఓ నరులారా! మీకు ఉత్తమమైన మేలును గూర్చి సంగ్రహముగ చెప్ప బోవుచున్నాను. వినుడు. ఆపదలనెడు అలలతో నిండినదగు సంసార సాగరమును బెఱుకు లేకుండా ప్రవేశించి ఉన్న మీరు నానావిధములైన జ్ఞానమును విడచి, మనస్సు నందు **'ఓం'** కారముతో కూడిన **'నమో నారాయణాయ'** అనే మంత్రమును నమస్కార పూర్వకముగ పదే పదే ఆవృత్తి చేయుడు.

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. పరమమ్ – **పరమమ్** – పరమౌ – పరమాన్, అకారాన్తః, పుంలిఙ్గః, పరమశబ్దః, ద్వి.ఏ; 2. హితమ్ – **హితమ్** – హితౌ – హితాన్, అకారాన్తః, పుంలిఙ్గః, హితశబ్దః, ద్వి.ఏ; 3. సంక్షేపతః – తసిల్ ప్రత్యయాన్తము – అవ్యయము; 4. వక్ష్యామి – వచ్ పరిభాషణే, అదాది, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లృట్, ప్ర.ఏ; 5. సంసారార్ణవమ్ – **సంసారార్ణవమ్** – సంసారార్ణవౌ – సంసారార్ణవాన్, అకారాన్తః, పుంలిఙ్గః, సంసారార్ణవశబ్దః, ద్వి.ఏ; 6. సమ్యక్ – చకారాన్త నపుంసకలిఙ్గః, 'సత్యవాక్' అవ్యయముగ సముదయః; 7. ప్రవిశ్య – ల్యబన్తము – అవ్యయము; 8. స్థితాః – స్థితః – స్థితౌ – **స్థితాః**, అకారాన్తః, పుంలిఙ్గః, స్థితశబ్దః, ప్ర.బ; 9. నానాజ్ఞానమ్ – **జ్ఞానమ్** – జ్ఞానే – జ్ఞానాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, జ్ఞానశబ్దః, ద్వి.ఏ; 10. అపాస్య (అప అస్ ల్యప్) అవ్యయము. 'వద సత్యమపాస్య పక్షపాతం యది జాతి కుసుమానుకారి పుష్పమ్' – ఉద్ధృత; 11. అముమ్ – **అముమ్** – అమూ – అమూన్, సకారాన్తః, పుంలిఙ్గః, అదశ్శబ్దః, ద్వి.ఏ; 12. మంత్రమ్ – **మంత్రమ్** – మంత్రౌ – మంత్రాన్, అకారాన్తః, పుంలిఙ్గః, మంత్రశబ్దః, ద్వి.ఏ; 13. ప్రణామసహితమ్ – **సహితమ్** – సహితౌ – సహితాన్, అకారాన్తః, పుంలిఙ్గః, సహితశబ్దః, ద్వి.ఏ; 14. ముహుః – అసకృదర్థః – (ముహ్ ఉసి) అవ్యయము; 15. ప్రావర్తయధ్వమ్ – ప్ర+అవర్తయధ్వమ్ – వృతు (వృత్) వర్తనే (ఉండుట), భ్వాది, అకర్మకమ్, సేట్, ఆత్మనేపదీ, లఙ్, మ.బ., ణిజన్తమ్.

**క్రియాదర్శము :** అవర్తయధ్వమ్

| | | |
|---|---|---|
| అవర్తయత | అవర్తయేతామ్ | అవర్తయన్త |
| అవర్తయథాః | అవర్తయేథామ్ | **అవర్తయధ్వమ్** |
| అవర్తయే | అవర్తయావహి | అవర్తయామహి |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితమ్, 11వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : అ) 'ఓన్నమో నారాయణాయ'** – అష్టాక్షరీమహామంత్రమిదియే. 'సమతామూర్తి' యైన **'శ్రీరామానుజాచార్యుల'**వారిచే పరిపూర్ణముగ విశ్వవ్యాప్తము చేయబడి జీవాజీవుల్లో అణువణువునా చైతన్యాన్ని నింపిన మహామంత్రమిదియే.

**'శ్రీమన్నారాయణాష్టాక్షరీస్తుతిః'**

**ఓం** ఓం నమః ప్రణవార్థార్థస్థూలసూక్ష్మక్షరాక్షర–
వ్యక్తావ్యక్తకలాతీత **ఓం**కారాయ నమో నమః ॥ 1

**న** నమో దేవాదిదేవాయ దేహసంచారహేతవే ।
దైత్యసంఘవినాశాయ **న**కారాయ నమో నమః ॥ 2

**మో** మోహనం విశ్వరూపఞ్చ శిష్టాచారసుపోషితమ్ ।
మోహవిధ్వంసకం వందే **మో**కారాయ నమో నమః ॥ 3

**నా** నారాయణాయ నవ్యాయ నరసింహాయ నామినే ।
నాదాయ నాదినే తుభ్యం **నా**కారాయ నమో నమః ॥ 4

**రా** రామచంద్రం రఘుపతిం పిత్రాజ్ఞాపరిపాలకమ్ ।
కౌసల్యాతనయం వందే **రా**కారాయ నమో నమః ॥ 5

**య** యజ్ఞాయ యజ్ఞగమ్యాయ యజ్ఞరక్షాకరాయ చ ।
యజ్ఞాంగరూపిణే తుభ్యం **య**కారాయ నమో నమః ॥ 6

**ణా** ణాకారం లోకవిఖ్యాతం నానాజన్మఫలప్రదమ్ ।
నానాభీష్టప్రదం వందే **ణా**కారాయ నమో నమః ॥ 7

**య** యజ్ఞకర్త్రే యజ్ఞభర్త్రే యజ్ఞరూపాయ తే నమః ।
సుజ్ఞానగోచరాయాస్తు **య**కారాయ నమో నమః ॥ 8 ❀

ఆ) ఇట శ్రీమేల్పత్తూర్ నారాయణభట్టతిరి విరచితమైన **'శ్రీమన్నారాయణీయమ్'**ను అనుసంధానము చేసుకుందురుగాక. ఇంకను అథర్వణరహస్యాంతర్గత **'నారాయణ హృదయమ్'**ను మనము మన అణువణువునా నింపుకొందుముగాక.



## 19

**అవతారిక :** ఈ శ్లోకమున 'భగవన్మహిమకు అవధి లేద'ను చున్నారు శ్రీ కులశేఖరాళ్వార్లు.

**శ్లో॥ పృథ్వీ రేణురణుః, పయాంసి కణికాః, ఫల్గుః స్ఫులిఙ్గో లఘు-**
**స్తేజో, నిశ్శ్వసనం మరుత్తనుతరం, రన్ధ్రం సుసూక్ష్మం నభః ।**
**క్షుద్రా రుద్రపితామహప్రభృతయః కీటాస్సమస్తాస్సురా(ః)**
**దృష్టే యత్ర స తావకో విజయతే భూమాఽవధూతావధిః ॥ 19**

**పదవిభాగము :**

పృథ్వీ, రేణుః, అణుః, పయాంసి, కణికాః, ఫల్గుః, స్ఫులిఙ్గః, లఘుః,
తేజః, నిశ్శ్వసనమ్, మరుత్, తనుతరమ్, రంధ్రమ్, సుసూక్ష్మమ్, నభః ।
క్షుద్రాః, రుద్ర-పితామహ-ప్రభృతయః కీటాః, సమస్తాః, సురాః,
దృష్టే, యత్ర, సః, తావకః, విజయతే, భూమా, అవధూత + అవధిః ।

**అన్వయక్రమము :** యత్ర దృష్టే (సతి) పృథ్వీ అణుః రేణుః, పయాంసి, కణికాః, తేజః ఫల్గుః లఘుః, స్ఫులిఙ్గః మరుత్ తనుతరమ్ నిశ్శ్వసనమ్, నభః సుసూక్ష్మమ్ రంధ్రమ్, రుద్ర-పితామహ-ప్రభృతయః సమస్తాః సురాః క్షుద్రాః కీటాః, సః తావకః అవధూతావధిః భూమా విజయతే.

**ప్రతిపదార్థము :**

యత్ర = ఏ నీ మహిమ, (యస్మిన్, ఆకృతిః, అవ్యయతద్ధితప్రత్యయః)
దృష్టే (సతి) = చూడబడినదగుచుండగా,
పృథ్వీ = భూమి,
అణుః = చిన్నదగు,
రేణుః = కణముగానో;

పయాంసి = సమస్తజలాలు,
కణికాః = చిన్నచిన్న తుంపురులుగానో,
తేజః = అగ్ని,
ఫల్గుః = నీరసమైన,
లఘుః = అత్యల్పమైన,
స్ఫులింగః = మిణుగురులుగానో;
మరుత్ = వాయువు,
తనుతరమ్ = మిక్కిలి సన్నదైన,
నిశ్వసనమ్ = నిట్టూర్పుగానో;
నభః = ఆకాశము,
సుసూక్ష్మమ్ = మిక్కిలి చిన్నదైన,
రంధ్రమ్ = రంధ్రముగానో;
రుద్ర–పితామహ–ప్రభృతయః = రుద్రుడు, బ్రహ్మ మొదలగు,
సమస్తాస్సురాః = సమస్తదేవతలు,
క్షుద్రాః = క్షుద్రములైన,
కీటాః = కీటకములుగానో;
సః = అటువంటి
తావకః = నీయొక్క
భూమా = మహిమ
అవధూత + అవధిః = అవధిలేనిదై,
**వి–జయతే** = సర్వోత్కృష్టమై విరాజిల్లుచున్నది.

**తాత్పర్యము :** ఏ నీ మహిమ చూచినపుడు భూమి చిన్న కణముగానో, సమస్తజలరాశులు తుంపురులుగానో, అగ్ని నీరసమైన అత్యల్పమైన మిణుగురుగానో, వాయువు మిక్కిలి సన్నని నిట్టూర్పుగానో, ఆకాశము మిక్కిలి చిన్నదైన రంధ్రముగానో; రుద్రుడు బ్రహ్మ మొదలగు సమస్త దేవతలు క్షుద్రములైన కీటకములుగానో, (కనిపించుదురో), అటువంటి నీ మహిమ అవధిలేనిదై సర్వోత్కృష్టమై విరాజిల్లుచున్నది.

**పాఠాంతరాలు :** 1. తావకః – తారకః, 2. భూమావధూతావధిః – శ్రీపాదధూళీకణః, 3. లఘుః – (2) నలః

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. యత్ర – యస్మిన్నిత్యర్థే – అవ్యయము; 2. దృష్టే – **దృష్టే** – దృష్టయోః – దృష్టేషు, అకారాన్తః పుంలిఙ్గః, దృష్టశబ్దః, స.ఏ; 3. పృథ్వీ – **పృథ్వీ** – పృథ్వ్యౌ – పృథ్వ్యః, ఈకారాన్తః, స్త్రీలిఙ్గః, పృథ్వీశబ్దః, ప్ర.ఏ; 4. అణుః – **అణుః** – అణూ – అణవః, ఉకారాన్తః, పుంలిఙ్గః, అణుశబ్దః, ప్ర.ఏ; 5. రేణుః – **రేణుః** – రేణూ – రేణవః, ఉకారాన్తః, పుంలిఙ్గః, రేణుశబ్దః, ప్ర.ఏ; 6. పయాంసి – పయః – పయసీ – **పయాంసి**, సకారాన్తః, క్లిబలిఙ్గః, పయస్‌శబ్దః, ప్ర.బ; 7. కణికాః – కణికః – కణికౌ – **కణికాః**, అకారాన్తః, పుంలిఙ్గః, కణికశబ్దః, ప్ర.బ; 8. తేజః – **తేజః** – తేజసీ – తేజాంసి, సకారాన్తః, క్లిబలిఙ్గః, తేజస్‌శబ్దః, ప్ర.ఏ; 9. ఫల్గుః – **ఫల్గుః** – ఫల్గూ – ఫల్గవః, ఉకారాన్తః, పుంలిఙ్గః, ఫల్గుశబ్దః, ప్ర.ఏ; 10. లఘుః – **లఘుః** – లఘూ – లఘవః, ఉకారాన్తః, పుంలిఙ్గః, ఫల్గుశబ్దః, ప్ర.ఏ; 11. స్ఫులింగః – **స్ఫులిఙ్గః** – స్ఫులిఙ్గౌ – స్ఫులింగాః, అకారాన్తః, పుంలిఙ్గః, స్ఫులిఙ్గశబ్దః, ప్ర.ఏ; 12. మరుత్ – **మరుత్** – మరుతౌ – మరుతః, తకారాన్తః, పుంలిఙ్గః, మరుచ్ఛబ్దః, ప్ర.ఏ; 13. నిశ్శ్వసనమ్ (బహిర్ముఖశ్వాసః) – (నిర్ శ్వస్ ల్యుట్) – **నిశ్శ్వసనమ్** – నిశ్శ్వసనే – నిశ్శ్వసనాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, నిశ్శ్వసనశబ్దః, ప్ర.ఏ; 14. నభః (దహ్యతే మేఘైః నహ్ అసున్) – **నభః** – నభసీ – నభాంసి, సకారాన్తః, నపుంసకలిఙ్గః, నభస్‌శబ్దః, ప్ర.ఏ; 15. రంధ్రమ్ – **రంధ్రమ్** – రంధ్రే – రంధ్రాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, రంధ్రశబ్దః, ప్ర.ఏ; 16. సురాః – సురః – సురౌ – **సురాః**, అకారాన్తః, పుంలిఙ్గః, సురశబ్దః, ప్ర.బ; 17. భూమా (అ) **భూమా** – భూమానౌ – భూమానః, నకారాన్తః, స్త్రీలిఙ్గః, 'భూమన్' శబ్దః, (సీమన్ శబ్దవత్), ప్ర.ఏ, బహూః స్వార్థే ఇమనిచ్. త్రి. భూమా–భూమా–భూమన్; 18. విజయతే – **జి జయే** – అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాది, లట్, ప్ర.ఏ.

**క్రియాదర్శము : విపరాభ్యాం జేః (1–3–19)** – విపరాపూర్వాజ్జయతేర్ధాతో**రాత్మనేపదం** భవతి। విజయతే। పరాజయతే।

| | | |
|---|---|---|
| **విజయతే** | విజయేతే | విజయన్తే |
| విజయసే | విజయేథే | విజయధ్వే |
| విజయే | విజయావహే | విజయామహే |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితము, 11వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : భూమా** – 17(అ). భూమన్ – **బహోర్భావః** బహు ఇమానిచ్, ఇలోపే భ్వాదేశః, పుం. భూమా.

అ) "యో వై **భూమా** తత్సుఖమ్ నాల్పే సుఖమస్తి । – శ్రుతిః. ఛా.ఉ.7–23–1

ఇట బ్రహ్మన్, the Supreme Bening అనే అర్థములో.

శ్లో॥ ఓం నమో భగవతే ఆకూపారాయ సర్వసత్త్వగుణవిశేషణానుపలక్షిత స్థానాయ నమో వర్ష్మణే నమో **భూమ్నే** నమో నమోఽవస్థానాయ నమస్తే
– భాగవతే 5–18–30

అట్లే "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి స **భూమా.** – ఛా. 7–24–1

ఆ) **భూమ్నా** రసానాం గహనాః ప్రయోగాః – మాలతీమాధవం. 1–4

సంసూయేవ సుఖాని చేతసి పరం **భూమానాం** ఆతన్వతే । – 5–9

ఇట A great quality అనే అర్థములో.

యత్ర నాన్యద్ విజానాతి స **భూమా** ।

ఏది తనకంటె భిన్నమైన వస్తువున్నదని తెలిసికొనదో అది **'భూమా'**యని పేరు.



## 20

**అవతారిక : 'భగవన్నామస్మరణమే'** మాకు నిరతము జీవనమగుగాక అని ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ బద్ధేనాఞ్జలినా నతేన శిరసా గాత్రైస్సరోమోద్గమైః**
**కణ్ఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణబాష్పామ్బునా ।**
**నిత్యం త్వచ్చరణారవిన్దయుగలధ్యానామృతాస్వాదినా –**
**మస్మాకం సరసీరుహాక్ష! సతతం సమ్పద్యతాం జీవితమ్ ॥ 20**

**పదవిభాగము :**

బద్ధేన, అఞ్జలినా, నతేన, శిరసా, గాత్రైః, స–రోమోద్గమైః,
కణ్ఠేన, స్వర–గద్గదేన, నయనేన, ఉద్గీర్ణ – బాష్ప + అమ్బునా ।

నిత్యం, త్వత్+చరణ+అరవిన్ద-యుగల-ధ్యాన+అమృత+ఆస్వాదినామ్
అస్మాకమ్, సరసీ-రుహ + అక్ష!, సతతమ్, సమ్+పద్యతామ్, జీవితమ్ ।

**అన్వయక్రమము :** (హే) సరసీ-రుహ + అక్ష! నిత్యమ్ బద్ధేన అంజలినా నతేన శిరసా స-రోమోద్గమైః గాత్రైః స్వరగద్గేన కణ్ఠేన ఉద్గీర్ణబాష్పాంబునా నయనేన త్వచ్చరణారవింద యుగలధ్యానామృత + ఆస్వాదినామ్ అస్మాకం జీవితం సతతం సంపద్యతామ్ ।

**ప్రతిపదార్థము :**

(హే) సరసీ-రుహ + అక్ష! = ఓ కమలములవంటి కన్నులు గలవాడా!
నిత్యమ్ = ఎల్లప్పుడు,
బద్ధేన = ముకులితమైన,
అంజలినా = అంజలితోను,
నతేన = వంచబడిన,
శిరసా = శిరస్సుతోను,
స-రోమోద్గమైః = గగుర్పాటుతో కూడిన,
గాత్రై = శరీరావయవాలతోను,
స్వరగద్గదేన = కంపించు స్వరముగల,
కంఠేన = కంఠముతోను,
ఉద్గీర్ణ-బాష్పాంబునా = వెలిగ్రక్కు బాష్పాంబువులుగల,
నయనేన = కన్నులతోను,
త్వత్ + చరణ ... ఆస్వాదినామ్ = నీ పాదారవిందయుగలమును
ధ్యానించుటనెడు అమృతమును ఆస్వాదించు,
అస్మాకమ్ = మాయొక్క,
జీవితమ్ = జీవితము,
సతతమ్ = ఎల్లప్పుడు,
**సంపద్యతామ్** = సంపూర్ణమైనదగుగాక.

**తాత్పర్యము :** ఓ కమలాక్షా! ఎల్లప్పుడు ముకులితమైన అంజలితోను, వంచబడిన శిరస్సుతోను, గగుర్పాటుతో కూడిన శరీరావయవములతోను, కంపించు స్వరముగల కంఠముతోను, వెలిగ్రక్కు బాష్పాంబువులుగల కన్నులతోను, నీ పాదారవిందయుగలమును

ధ్యానించుటనెడు అమృతమును ఆస్వాదించు మాయొక్క జీవితము ఎల్లప్పుడు సంపూర్ణ మైనదగుగాక.

**పాఠాంతరాలు :**

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. (హే) సరసీరుహాక్ష! - **(హే) సరసీరుహాక్ష!** - హే సరసీరుహాక్షే! - హే సరసీరుహాక్షాణి, అకారాన్తః, నపుంసకలిఙ్గః, అక్షశబ్దః, సం.ప్ర.ఏ; 2. అంజలినా - **అంజలినా** - అంజలిభ్యామ్ - అంజలిభిః, ఇకారాన్తః, పుంలిఙ్గః, అంజలిశబ్దః, తృ.ఏ; 3. శిరసా - **శిరసా** - శిరోభ్యామ్ - శిరోభిః, సకారాన్తః నపుంసకలిఙ్గః, శిరస్ శబ్దః, తృ.ఏ; 4. గాత్రైః - గాత్రేన - గాత్రాభ్యామ్ - **గాత్రైః**, అకారాన్తః, నపుంసకలిఙ్గః, గాత్రశబ్దః, తృ.బ; 5. కంఠేన - **కంఠేన** - కంఠాభ్యామ్ - కంఠైః, అకారాన్తః, పుంలిఙ్గః, కణ్ఠశబ్దః, తృ.ఏ; 6. నయనేన - **నయనేన** - నయనాభ్యామ్ - నయనైః, అకారాన్తః, పుంలిఙ్గః, నయనశబ్దః, తృ.ఏ; 7. అస్మాకమ్ - మమ/మే - ఆవయోః/నౌ - **అస్మాకమ్**/నః, దకారాన్తః, పుంలిఙ్గః, అస్మచ్ఛబ్దః, ష.బ; 8. జీవితమ్ (అసుధారణమ్) - **జీవితమ్** - జీవితే - జీవితాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, జీవితశబ్దః, ప్ర.ఏ; 9. సంపద్యతామ్ - పద (పద్ల్) గతౌ (నడుచుట, వెళ్లుట), దివాది, సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, లోట్, సమ్-ఉపసర్గ.

**క్రియాదర్శము :** సంపద్యతామ్ - లోట్, ప్ర.ఏ.

| | | | |
|---|---|---|---|
| సంపద్యతామ్ | **సంపద్యతామ్** | సంపద్యేతామ్ | సంపద్యన్తామ్ |
| | సంపద్యస్వ | సంపద్యేథామ్ | సంపద్యధ్వమ్ |
| | సంపద్యై | సంపద్యావహై | సంపద్యామహై |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. **శార్దూలవిక్రీడితం,** 11వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : 'త్వచ్చరణారవిన్దయుగలధ్యానామృతాస్వాదినామ్'**

"భగవంతుని శ్రీచరణాలలోని ధ్యానం - అమృతంవలె భోగ్యమై ఉన్నదని" భావం. ధ్యానం భోగ్యమైనపుడు ఆ ధ్యానానికి విషయమైన శ్రీచరణాలకు కూడా భోగ్యత్వం అర్థాత్ సిద్ధం. 'ధ్యానస్య భోగ్యత్వే విషయభూతరచణస్యాపి భోగత్వమర్థాత్ సిద్ధమ్'. ధ్యాన విషయానికి భోగ్యత లేకపోతే దాని ధ్యానానికి భోగ్యత్వం రాదు కదా! 'సర్పస్యా-

ప్రియత్వాదేవ హి తత్ జ్ఞానస్యాప్రియత్వమ్' సర్పం అప్రియం కనుకనే దాని జ్ఞానం కూడా అప్రియమై ఉంటుంది. ఇంతేకాక అరవిందదృష్టాంతాలవల్ల భోగ్యత్వం సిద్ధం. సర్వరసః అని సర్వాదయనం రస్యమై ఉన్నా, భోగ్యతావిషయంలో అమృతానికి మించిన వస్తువు ఇంకొకటి లేనందున ధ్యానాన్ని అమృతంగా చెప్పటం జరిగింది. శ్రీచరణాల ధ్యానాన్ని గమనించి చూస్తే అమృతం కూడా చేదుగా తోస్తుందిగదా!

"తల్లికి అనేక అంగాలున్నా, బిడ్డలకు స్తనయుగళంలో దృష్టిపడేటట్లే, ధ్యానించేవారికి స్వామి శ్రీచరణాలలోనే దృష్టి పడుతుంది." అని అంటారు పూజ్యులు, విశిష్టాద్వైత సిద్ధాన్త ప్రవర్తకులు **డా॥ ఈ.ఏ.శింగరాచార్యవర్యులు.**

శ్రీరాముని పాదపద్మములందే నిరతము ధ్యాననిమగ్నుడైన భరతుని అవ్యాజధ్యానమును ఇట అనుసంధానము చేసుకుందురుగాక. పాదుకాసహస్రము నందు దృష్టిని పెట్టుదురుగాక.



## 21

**అవతారిక :** పరాత్పరుని పరిపరివిధములుగ సంబోధిస్తూ 'నిన్ను తప్ప అన్యమెఱుగను, నన్ను రక్షించు' అంటూ ఆర్తితో పలుకుతున్న శ్రీ కులశేఖరులు ఈ శ్లోకమున 'శరణాగతి' చేయుచున్నారు.

**శ్లో॥ హే గోపాలక! హే కృపాజలనిధే! హే సిన్ధుకన్యాపతే!**
**హే కంసాన్తక! హే గజేన్ద్రకరుణాపారీణ! హే మాధవ! ।**
**హే రామానుజ! హే జగత్త్రయగురో! హే పుణ్డరీకాక్ష! మాం**
**హే గోపీజననాథ! పాలయ పరం జానామి న త్వాం వినా ॥**

**పదవిభాగము :**

హే గోపాలక!, హే కృపా-జలనిధే!, హే సింధుకన్యా-పతే!
హే కంస+అన్తక!, హే గజేంద్ర-కరుణా-పారీణ, హే మాధవ!
హే రామ+అనుజ!, హే జగత్+త్రయ-గురో!, హే పుండరీక+అక్ష!, మామ్
హే గోపీజన-నాథ! పాలయ పరం జానామి న త్వాం వినా ॥

**అన్వయక్రమము :** హే గోపాలక! .... హే గోపీజననాథ! మాం పాలయ పరం జానామి న త్వాం వినా.

**ప్రతిపదార్థము :**

హే గోపాలక! = ఓ గోపాలకా!,
హే కృపా–జలనిధే! = ఓ కరుణాసాగరా!
హే సింధుకన్యా–పతే! = ఓ సాగరకన్యకాపతీ!,
హే కంస+అన్తక! = ఓ కంసుని సంహరించినవాడా!
హే గజేంద్ర–కరుణా–పారీణ! = గజేంద్రుని కరుణతో రక్షించినవాడా!,
హే మాధవ! = ఓ మాధవా! ఓ లక్ష్మీదేవికి భర్తయైనవాడా!,
హే రామ + అనుజ! = ఓ బలరామునికి తమ్ముడైన వాడా!,
హే జగత్ + త్రయ–గురో! = ఓ త్రిభువ గురూ!
హే పుండరీక + అక్ష! = ఓ తెల్లదామరలవంటి నేత్రములుగలవాడా!,
హే గోపీజననాథ! = ఓ గోపికాజనవల్లభుడా!
మామ్ + పాలయ = నన్ను రక్షించుము.
త్వాం వినా = నిన్ను కాక,
పరమ్ న **జానామి** = అన్యమెఱుగను.

**తాత్పర్యము :** –

**పాఠాంతరాలు :** –

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. హే గోపాలక!, హే కృపాజలనిధే!.... హే గోపీజననాథ! – అన్నియు సంబోధన ప్రథమావిభక్తి ఏకవచనరూపాంతములు; 2. పాలయ – పాల రక్షణే, సకర్మకమ్, సేట్, ఉభయ (పరస్మైపదీ) చురాది, లోట్, మ.ఏ; 3. జానామి – జ్ఞా అవబోధనే, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, క్ర్యాది, లట్, ఉ.ఏ; 4. వి(నా) – తద్ధితాన్త – అవ్యయము.

**క్రియాదర్శము :** 1. పాలయ, 2. జానామి

| | | | |
|---|---|---|---|
| పాలయ | పాలయతు / పాలయతాత్ | పాలయతామ్ | పాలయన్తు |
| | **పాలయ** / పాలయతాత్ | పాలయతమ్ | పాలయత |
| | పాలయాని | పాలయావ | పాలయామ. |

| | | | |
|---|---|---|---|
| జానామి | జానాతి | జానీతః | జానన్తి |
| | జానాసి | జానీథః | జానీథ |
| | **జానామి** | జానీవః | జానీమః |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితము. 11వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : పుండరీకాక్ష**

శ్రీ కులశేఖరాళ్వారులచే రచితమైన 'ముకుందమాలా' స్తోత్రరాజమున 21వ శ్లోకముగ దర్శితమైన **'హే గోపాలక! .... పాలయ పరం జానామి న త్వాం వినా!'** అనే శ్లోకము బిల్వమంగళలీలాశుకుని **'శ్రీకృష్ణకర్ణామృతము'** ద్వితీయాశ్వాసమున 108వ శ్లోకముగ యథాతథముగ కాననగును.

**(హే) పుండరీకాక్ష!** – ఓ తెల్లదామరలవంటి నేత్రములు గలవాడా!

పుండరీకాక్ష! – **(హే) పుండరీకాక్ష!** – (హే) పుండరీకాక్షౌ – (హే) పుండరీకాక్షాః, అకారాన్తః, పుంలిఙ్గః, పుండరీకాక్షశబ్దః, సం.ప్ర.ఏ;

అ) పుండరీకమివ అక్షి యస్య సమాసాన్తః షచ్. విష్ణుః, త్రి. పుండరీకాక్షః, పుండరీకాక్షీ, పుండరీకాక్షమ్.

శ్లో॥ అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా ।
యః స్మరేత్ **పుండరీకాక్షం** స బాహ్యాభ్యన్తరః శుచిః ॥
– ఇతి వామనపురాణే

ఆ) A mark on the forehead consisting of three lines made with cowdung ashes.

ఇ) శ్లో॥ వసుర్వసుమనాస్సత్యస్సమాత్మా సమ్మితస్సమః ।
అమోఘః **పుణ్డరీకాక్షో** వృషకర్మా వృషాకృతిః ॥ 12
– శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్ – 111వ నామము

భాష్యము : 'పుణ్డరీకం పరంధామ నిత్యమక్షరమవ్యయమ్ । తద్భవాన్ **పుణ్డరీకాక్షః**' ఇతి. పుణ్డరీకాక్షః, నిత్యవైకుణ్ఠవాసినాం దృష్టిభూత ఇత్యర్థః. యథా, 'దివీవ చక్షురాతతమ్' ఇతి.

'పుణ్డరీకం పరంధామ... పుణ్డరీకాక్షః' అను మహాభారత శ్లోకమునుబట్టి పుణ్డరీకమనగా నిత్యమై ఎన్నటికిని తరిగిపోని దివ్యధామము, పరమపదము అనియు అచటనుండి నిత్యసూరులుకూడ ఆ పుణ్డరీక పదముచేతనే వ్యవహరింపబడుదురనియు, కావున, పుణ్డరీకాణాం అక్షి, ఆ నిత్యసూరులకు నేత్రమువంటివాడు అని దీని యర్థము. జీవితమునందు నేత్రము ప్రధానమై జ్ఞానసాధనమైనట్లు పరమాత్మగూడ నిత్యసూరులకు అత్యంత ప్రియుడు అని, దివీవ చక్షురాతతమ్ అని పురుషసూక్తములోని మంత్రము తెలుపుచున్నది.

ఈ) **పుణ్డరీకాణాం అక్షి** అను విగ్రహమునందు ఇది **బహువ్రీహి** సమాసముకాక **తత్పురుష**సమాసమైనందున, చివరన్ను అక్షిన్ శబ్దము నకారాన్త నపుంసకలింగమైనను, సమాసాంతమునందు 'అచ్' ప్రత్యయము వచ్చి 'అ'కారాంతమైనది. మొదట నపుంసకలింగమైన అక్షిన్ శబ్దము ఇచట సమాసములో చేరగా భగవంతునికి అన్వయించుటచేత పుంలింగముగా మారినది. వ్యాకరణమహాభాష్యమున 'లింగం అశిష్యం లోకాశ్రయత్వాత్ లిఙ్గస్య' అని పతంజలి మహర్షిచే చెప్పబడియున్నందున, లౌకికవ్యవహారమున ఏ పదములు ఏయే లింగములు కలిగియున్నట్లు ప్రయోగింపబడు చున్నవో వాటిని లోకానుసారమే నిర్ణయింపవలెను గాని వ్యాకరణానుశాసనము వర్తించదు. కావున **పుండరీకాక్షః** అను పుంలిఙ్గప్రయోగము సాధువే.

– శ్రీమాన్ న.చ.రఘునాథాచార్యులవారు.

ఉ) శ్లో॥ తేన ద్విపానామివ **పుణ్డరీకో**
రాజ్ఞామజయ్యోఽజని **పుణ్డరీకః** ।
శాన్తే పితర్యాహృత **పుణ్డరీకా**
యం **పుణ్డరీకాక్ష**మివ శ్రితాశ్రీః ॥ రఘువంశము 18-8

'మల్లినాథసూరి' సంజీవనీవ్యాఖ్య చూడుడు.



**22**

**అవతారిక :** 'గోపాలచూడామణి మాకు శ్రేయస్సు నొసంగుగాక' అని అర్థిస్తున్నారు ఈ శ్లోకములో శ్రీకులశేఖరులు.

**శ్లో॥ భక్తాపాయభుజఙ్గగారుడమణిస్త్రైలోక్యరక్షామణి -**
**ర్గోపీలోచనచాతకామ్బుదమణిస్సౌన్దర్యముద్రామణిః ।**
**యః కాన్తామణిరుక్మిణీఘనకుచద్వన్ద్వైకభూషామణిః**
**శ్రేయో దేవశిఖామణిర్దిశతు నో గోపాలచూడామణిః ॥ 22**

**పదవిభాగము :**

భక్త + అపాయ-భుజఙ్గ-గారుడమణిః, త్రైలోక్య-రక్షామణిః,
గోపీ-లోచన-చాతక + అమ్బుదమణిః, సౌందర్య-ముద్రా-మణిః ।
యః, కాన్తా-మణి-రుక్మిణీ-ఘన-కుచ-ద్వంద్వ + ఏక-భూషా-మణిః
శ్రేయః, దేవ-శిఖా-మణిః, దిశతు, నః, గోపాల-చూడా-మణిః ।

**అన్వయక్రమము :** యః భక్త + అపాయ-భుజఙ్గ-గారుడమణిః.... కాన్తా-మణి-రుక్మిణీ-ఘన-కుచ-ద్వంద్వ + ఏక-భూషా-మణిః దేవశిఖామణిః (సః) గోపాల-చూడామణిః శ్రేయః నః దిశతు.

**ప్రతిపదార్థము :**

యః = ఎవడు,
భక్త + అపాయ-భుజంగ-గారుడమణిః = భక్తులయొక్క కష్టములనెడు సర్పములకు గరుడమణియో,
త్రైలోక్య-రక్షామణిః = ముల్లోకములను కాపాడుటయందు శ్రేష్ఠుడో,
గోపీ-లోచన-చాతక + అమ్బుద-మణిః = గోపికలయొక్క కన్నులనే చాతకపక్షులకు శ్రేష్ఠమైన కాలమేఘమో,
సౌందర్య-ముద్రా-మణిః = సౌందర్యమునకు ముద్రవేయువాడునో,
కాన్తా-మణి-రుక్మిణీ-ఘన-కుచ-ద్వంద్వ-ఏక-భూషామణిః = స్త్రీలలో శ్రేష్ఠురాలైన రుక్మిణీదేవియొక్క ఘనస్తనయుగ్మమునకు ఆభరణప్రాయమైనవాడునో,
దేవశిఖామణిః = దేవతలకు శిరోభూషణమైనవాడునో అగు
(సః) గోపాలచూడామణిః = అటువంటి గోపాలచూడామణి,
శ్రేయః = శ్రేయస్సును
నః = మాకు,
**దిశతు** = ఒసంగుగాక.

**తాత్పర్యము :** ఎవడు భక్తులయొక్క కష్టములనెడు సర్పములకు గరుడమంత్రమో, ముల్లోకములను కాపాడుటయందు సర్వశ్రేష్ఠుడో, గోపికలయొక్క కన్నులనే చాతకపక్షులకు శ్రేష్టమైన కాలమేఘమో, సౌందర్యమునకు ముద్రవేయువాడో, స్త్రీలలో శ్రేష్ఠురాలైన రుక్మిణీదేవియొక్క ఘనస్తనయుగ్మమునకు శిసలైన ఆభరణప్రాయమైనవాడో, దేవతలకు శిరోభూషణమైనవాడో, అటువంటి గోపాలచూడామణి శ్రేయస్సును మాకు ఒసంగును గాక.

**పాఠాంతరాలు :**

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. గోపాలచూడామణిః – మణిః – మణీ – మణయః, ఇకారాన్తః, పుంలిఙ్గః, మణిశబ్దః, ప్ర.ఏ; 2. శ్రేయః – అతిశయేన ప్రశస్యం ఈయసున్, శ్రేయః – శ్రేయసీ – శ్రేయాంసి, సకారాన్తః, నపుంసకలిఙ్గః, శ్రేయస్ శబ్దః, ద్వి.ఏ; 3. దిశతు - దిశ - అతిసర్జనే, సకర్మకమ్, అనిట్, ఉభయ (పరస్మైపదీ), తుదాది, లోట్, ప్ర.ఏ;

**క్రియాదర్శము :**

| | | | |
|---|---|---|---|
| దిశతు | **దిశతు** / దిశతాత్ | దిశతామ్ | దిశన్తు |
| | దిశ / దిశతాత్ | దిశతమ్ | దిశత |
| | దిశాని | దిశావ | దిశామ |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితము. 11వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :** అ) **గోపాలచూడామణిః**

చూడామణిః - ఎ) చూడాస్థితో మణిః బి) చూడాయాం మణిరివాస్య.

గోపాలానాం చూడామణిరస్త్యస్య – **గోపాలచూడామణిః**

బిల్వమంగళలీలాశుకులవారి శ్రీకృష్ణకర్ణామృతములోని (2–109) అత్యన్త ప్రసిద్ధి గలిగిన, ఈ దిగువన ఇవ్వబడిన శ్లోకమును ఇట అనుసంధానము చేసికొందుము.

**శ్లో॥ కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం**
**నాసాగ్రే నవమౌక్తికం, కరతలే వేణుం, కరే కంకణమ్ ।**
**సర్వాంగే హరిచందనం, చ కలయన్, కంఠే ముక్తావళిం**
**గోపస్త్రీపరివేష్టితో, విజయతే గోపాలచూడామణిః ॥**

గోపస్త్రీపరివేష్టితః గోపాలచూడామణిః విజయతే = గోపికాస్త్రీలచేత పరివేష్టింపబడిన గోపాలచూడామణి సర్వాతిశాయియై ఒప్పారుచున్నాడు.

బిల్వమంగళుని కవితలో మాధుర్యాన్ని చిందించిన 'బాలకృష్ణుని దివ్యమంగళ విగ్రహము' ఈ శ్లోకము.

ఆ) శ్రీ సమ్మోహన తంత్రమున పార్వతీశ్వరసంవాదముగ నున్న 'శ్రీగోపాల సహస్రనామస్తోత్రము'ను ఇట అనుసంధానము చేసుకుందుము గాక.

అథ గోపాలసహస్రనామస్తోత్రప్రారంభః

శ్లో॥ ఓం క్లీం దేవః కామదేవః కామబీజ శిరోమణిః ।
శ్రీగోపాలో మహీపాలో వేదవేదాంతసాగరః ॥ 1

శ్లో॥ కృష్ణః కమలపత్రాక్షః **పుండరీకః** సనాతనః ।
గోపతిర్భూపతిః శాస్తా ప్రహర్తా విశ్వతోముఖః ॥ 2 ...

శ్లో॥ అపారకరుణాసింధుర్భగవాన్ భక్తతత్పరః ॥ 142

ఫలశ్రుతి

శ్లో॥ శ్రీగోపాలో మహాదేవి! వసేత్తస్య గృహే సదా ।
గృహే యత్ర సహస్రం చ నామ్నాం తిష్ఠతి పూజితమ్ ॥ 26
– ఇతి శ్రీగోపాలసహస్రనామస్తోత్రం సమాప్తమ్.

శ్రీకులశేఖరాళ్వార్ల విరచితమైన ఈ 22వ శ్లోకముయొక్క పారాయణ శ్రీగోపాల–సహస్రనామస్తోత్రపారాయణకు తుల్యమైనదిగ భావింపదగును.



## 23

**అవతారిక : 'శ్రీకృష్ణమంత్రము'**ను పదే పదే జపింపుడని ఇందు చెప్పబడుచున్నది.

**శ్లో॥ శత్రుచ్ఛేదైకమన్త్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమన్త్రం**
**సంసారోత్తారమన్త్రం సముపచితతమస్సంఘనిర్యాణమన్త్రమ్ ।**
**సర్వైశ్వర్యైకమన్త్రం వ్యసనభుజగసందష్టసన్త్రాణమన్త్రం,**
**జిహ్వే శ్రీకృష్ణమంత్రం జప జప సతతం జన్మసాఫల్యమన్త్రమ్। 23**

**పదవిభాగము :**

శత్రు–చ్ఛేదైక–మన్త్రమ్, సకలమ్, ఉపనిషద్–వాక్య–సంపూజ్య–మన్త్రమ్,
సంసార+ఉత్తార–మన్త్రమ్, సముపచిత–తమః–సంఘ–నిర్యాణమన్త్రమ్।
సర్వ+ఐశ్వర్య+ఏక–మన్త్రమ్, వ్యసన–భుజగ–సందష్ట–సంత్రాణ–మన్త్రమ్,
జిహ్వే, **శ్రీకృష్ణ–మన్త్రమ్**, జప, జప, సతతమ్, జన్మ–సాఫల్య–మన్త్రమ్ ॥

**అన్వయక్రమము :** (హే) జిహ్వే! శత్రు–చ్ఛేదైక–మన్త్రం సకలమ్ ఉపనిషద్–వాక్య–సంపూజ్య–మన్త్రం సంసార+ఉత్తార–మంత్రం సముపచిత–తమస్సంఘ–నిర్యాణ–మన్త్రం సర్వ+ఐశ్వర్య+ఏక–మంత్రం వ్యసన–భుజగ–సందష్ట–సంత్రాణ–మంత్రం, జన్మ–సాఫల్య–మంత్రం **శ్రీకృష్ణమంత్రం** సతతం జప జప.

**ప్రతిపదార్థము :**

(హే) జిహ్వే! = ఓ నాలుకా!
శత్రు–చ్ఛేదైకమన్త్రమ్ = శత్రువులను కడతేర్చే మంత్రమును,
సకలమ్ = అన్ని,
ఉపనిషద్వాక్య–సంపూజ్య–మన్త్రమ్ = ఉపనిషత్తులు ఘోషించే మంత్రమును,
సంసార+ఉత్తార–మన్త్రమ్ = జననమరణములనుండి తరింపజేయునట్టి మంత్రమును,
సముపచిత–తమస్సంఘ–నిర్యాణ–మంత్రమ్ = రాశిగా పేరుకొన్న అజ్ఞానమను చీకటియొక్క సమూహమును పారద్రోలు మంత్రమును,
సర్వ+ఐశ్వర్య+ఏక–మన్త్రమ్ = సకలసంపదలకు ముఖ్యమైన మంత్రమును
వ్యసన–భుజగ–సందష్ట–సంత్రాణ–మన్త్రమ్ = దుఃఖములనెడు సర్పములచేత కాటువేయబడిన వారిని కాపాడే మంత్రమును
జన్మ–సాఫల్య–మంత్రమ్ = పుట్టుకకు సాఫల్యమును కలుగజేయు మంత్రమును అగు
శ్రీకృష్ణమంత్రమ్ = (చతురక్షర) 'శ్రీకృష్ణ'మంత్రమును
సతతమ్ = ఎల్లప్పుడు,
**జప జప** = జపింపుము.

**తాత్పర్యము :** ఓ నాలుకా! శత్రువులను కడతేర్చే మంత్రమును, అన్ని ఉపనిషత్తులు ఘోషించే మంత్రమును, జననమరణములనుండి తరింపజేయునట్టి మంత్రమును, రాశిగా పేరుకున్న అజ్ఞానమను చీకటియొక్క సముదాయమును పారద్రోలు మంత్రమును, దుఃఖములనెడు సర్పములచే కాటువేయబడినవారిని కాపాడే మంత్రమును, పుట్టుకకు సాఫల్యము కలుగజేయు మంత్రమును అగు (చతురక్షర) శ్రీకృష్ణమంత్రమును నిరతము జపింపుము.

**పాఠాంతరాలు :** 1. సంసారోత్తారమన్త్రమ్ – సంసారోచ్ఛేదమన్త్రమ్,

2. సముపచితతమః... – సముచితతమసః...

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. (హే) జిహ్వే! – **(హే) జిహ్వే!** – (హే) జిహ్వే – (హే) జిహ్వాః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, జిహ్వాశబ్దః, సం.ప్ర.ఏ; 2. శ్రీకృష్ణమంత్రమ్ – **శ్రీకృష్ణమంత్రమ్** – శ్రీకృష్ణమన్త్రౌ – శ్రీకృష్ణమంత్రాన్, అకారాన్తః, పుంలిఙ్గః, శ్రీకృష్ణమంత్రశబ్దః, ద్వి.ఏ; 3. జప – జప వ్యక్తాయాం వాచి మనసే చ, భ్వాది, సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లోట్, మ.ఏ.

**క్రియాదర్శము : జప**

| | | |
|---|---|---|
| జపతు / జపతాత్ | జపతామ్ | జపన్తు |
| **జప** / జపతాత్ | జపతమ్ | జపత |
| జపాని | జపావ | జపామ |

**ఛందస్సు :** 1. ప్రకృతి, 2. స్రగ్ధరా

**లక్షణము :** మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా **స్రగ్ధరా** కీర్తితేయమ్.

**శ్లోకపాదము / గణవిభజన** – 21 అక్షరాలు (7, 7, 7)

| | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ | త్రు | చ్ఛే | దై | క | మం | త్రం | స | క | ల | ము | ప | ని | ష | ద్వా | క్య | సం | పూ | జ్య | మ | న్త్రం |
| U | U | U | U | I | U | U | I | I | I | I | I | I | U | U | I | U | U | I | U | U |
| | మ | | | ర | | | భ | | | న | | | య | | | య | | | య | |

**పదాదర్శము :**

అ) **శ్రీకృష్ణమంత్రము**

'శ్రీకులశేఖరాళ్వార్ల' ఈ 23వ శ్లోకమునకు ప్రతిబింబముగానున్న 'శ్రీరామకర్ణామృతము' నందలి ప్రథమాశ్వాసము-78వ శ్లోకమును చూడుడు.

శ్లో॥ శత్రుచ్ఛేదైకమంత్రం సరసముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం
సంసారోత్తారమంత్రం సముచితసమయే సంగనిర్యాణమంత్రమ్ ।
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం
జిహ్వే **శ్రీరామమంత్రం** జప జప సఫలం జన్మసాఫల్యమంత్రమ్ ॥

ఆ) **శ్రీకృష్ణమంత్రము** - చతురక్షరమహామంత్రము - మంత్రమహోదధిః - చతుర్దశః తరంగః

**చతురక్షరః - కృష్ణమంత్రః**

శ్లో॥ కామసంపుటితం కృష్ణపదం వేదాక్షరో మనుః ।
గాయత్రీనారదః కృష్ణచ్ఛందో మునిరధీశ్వరః ॥ 104

శ్లో॥ దీర్ఘారూఢేన కామేన షడంగన్యాసమాచరేత్ ।
కల్పద్రుమూలసంరూఢపద్మస్థం చిన్తయేద్ధరిమ్ ॥ 105

- ధ్యానమ్ -

శ్లో॥ కల్పద్రోరతిరమణీయపల్లవేభ్యః
ప్రోద్భూతైర్మణినికరైః ప్రసక్తిమీశమ్ ।
ధ్యాయేయం కనకనిభాంశుకే వసానం
భుంజానం దధినవనీతపాయసాని ॥

**క్లీం కృష్ణ క్లీం**

అస్య శ్రీకృష్ణమంత్రస్య నారద ఋషిః, గాయత్రీ ఛందః, శ్రీకృష్ణపరమాత్మా దేవతా౽ ౽త్మనో౽భీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః

షడంగన్యాసః క్లాం హృదయాయ నమః, క్లీం శిరసే స్వాహా,
క్లూం శిఖాయై వషట్, క్లైం కవచాయ హుమ్,
క్లౌం నేత్రత్రయాయ వౌషట్, క్లః అస్త్రాయ ఫట్.

'సాందీపుని' వంటి ఋషితుల్యుని ఆశ్రయించుదురుగాక.

2. జపం అనేది 3 విధాలు

1. బాహ్యాజపం, 2. ఉపాంశుజపం, 3. మానసికజపం.

జపంతో నిరంతరం భగవన్నామ స్మరణ చేయడంవల్ల, పరిపరివిధాల పరుగులు దీసే ఇంద్రియాలు స్థిమితపడతాయి, మనము ఏ మంత్రాన్నైతే జపిస్తున్నామో అది మన మనసులోకి అంతకంతకూ గాఢంగా చొచ్చుకుపోతుంది. తొలుత బలవంతముగా కనిపించే ఈ ప్రక్రియ ఒక సాధనగా రూపొందుతుంది.

మనసును భగవంతునియందు లయం చేసుకోవటమే జపంలోని అంతరార్థము. మంత్రోపదేశమును పూజ్యులనుండి పొందగలరు. విధివిధానములను తెలుసుకొని మిమ్మల్ని మీరు తరింపజేసుకొందురుగాక. సంస్కరింపబడుదుముగాక.



## 24

**అవతారిక :** 'దుఃఖనివారణ'కు అద్భుతమైన ఔషధము 'శ్రీకృష్ణభగవానుడే' అంటూ తన్మయత్వంలో మునుగుతున్నాడు శ్రీకులశేఖరులు.

**శ్లో॥ వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం**
**దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీసఞ్జీవనైకౌషధమ్ ।**
**భక్తాత్యన్తహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం**
**శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మనః! శ్రీకృష్ణదివ్యౌషధమ్ ॥ 24**

**పదవిభాగము :**

వ్యామోహ–ప్రశమ + ఔషధమ్, ముని–మనః–వృత్తి–ప్రవృత్తి + ఔషధమ్,
దైత్య+ఇంద్ర+ఆర్తి–కర+ఔషధమ్, త్రిభువనీ–సంజీవన+ఏక+ఔషధమ్।
భక్త+అత్యన్త–హిత+ఔషధమ్, భవ–భయ–ప్రధ్వంసన+ఏక+ఔషధమ్,
శ్రేయః–ప్రాప్తి–కర+ఔషధమ్, పిబ, మనః!, శ్రీకృష్ణ–దివ్య+ఔషధమ్।

**అన్వయక్రమము :** (హే) మనః! వ్యామోహ–ప్రశమ–ఔషధం మునిమనః–వృత్తి–ప్రవృత్తి

+ ఔషధం. దైత్య + ఇంద్ర + ఆర్తి–కర + ఔషధం త్రిభువనీ–సంజీవన + ఏక + ఔషధం. భక్త + అత్యన్త–హిత–ఔషధం భవ–భయ–ప్రధ్వంసన + ఏక + ఔషధం శ్రేయః–ప్రాప్తి–కర + ఔషధం శ్రీకృష్ణ–దివ్య–ఔషధం పిబ.

**ప్రతిపదార్థము :**

(హే) మనః! = ఓ మనసా!
వ్యామోహ–ప్రశమ–ఔషధమ్ = అనురాగమనెడు మూర్ఛను పోగొట్టునట్టి ఔషధమును,
ముని–మనః–వృత్తి–ప్రవృత్తి + ఔషధమ్ = మునులయొక్క మనోవ్యాపారముయొక్క నడవడికి ఔషధమును,
దైత్యేంద్ర+ఆర్తి–కర+ఔషధమ్ = మేటి రాక్షసులకు ఆర్తిని కలిగించునట్టి ఔషధమును,
త్రిభువనీ–సంజీవన+ఏక+ఔషధమ్ = ముల్లోకములను కాచునటువంటి ముఖ్యమైన ఔషధమును,
భక్తి+అత్యన్త–హిత–ఔషధమ్ = భక్తులకు మిక్కిలి మేలును కలుగజేయు ఔషధమును,
భవ–భయ–ప్రధ్వంసన+ఏక+ఔషధమ్ = సంసారపు వెఱపును సమూలముగ ధ్వంసమొనర్చు ముఖ్యమైన ఔషధమును,
శ్రేయః–ప్రాప్తి–కర+ఔషధమ్ = శ్రేయస్సును పొందించెడు ఔషధమును అగు,
శ్రీకృష్ణ–దివ్య+ఔషధమ్ = 'శ్రీకృష్ణుడు' అనెడు దివ్య ఔషధమును
**పిబ** = పానము చేయుము.

**తాత్పర్యము :** ఓ మనసా! అనురాగమనెడు మూర్ఛను పోగొట్టునట్టి ఔషధమును, మునుల మనోవ్యాపారముయొక్క నడవడికి ఔషధమును, మేటి రాక్షసులకు ఆర్తిని కలిగించునట్టి ఔషధమును, ముల్లోకములను కాచునట్టి ఔషధమును, భక్తులకు మిక్కిలి మేలును కలుగజేయు ఔషధమును, సంసారపు వెఱపును సమూలముగ ధ్వంసమొనర్చు ముఖ్యమైన ఔషధమును, శ్రేయస్సును పొందించెడు ఔషధమును అగు 'శ్రీకృష్ణుడు' అనెడు దివ్య–ఔషధమును పానముచేయుము.

**పాఠాంతరాలు :** త్రిభువనీ... – త్రిభవనే,

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. (హే) మనః! - **(హే) మనః!** - (హే) మనసీ! - (హే) మనాంసి, సకారాన్తః, నపుంసకలిఙ్గః, మనస్ శబ్దః, సం.ప్ర.ఏ; 2. శ్రీకృష్ణదివ్యౌషధమ్ - **ఔషధమ్** - ఔషధే - ఔషధాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ...ఔషధశబ్దః, ద్వి.ఏ; 3. పిబ - పా పానే (త్రాగుట), భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, మ.ఏ.

**క్రియాదర్శము :**

| | | | |
|---|---|---|---|
| పిబ | పిబతు / పిబతాత్ | పిబతామ్ | పిబన్తు |
| | **పిబ** | పిబతమ్ | పిబత |
| | పిబాని | పిబావ | పిబామ |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితము, 11వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : పిబ** - లోట్ మధ్యమపురుషైకవచనాంతః

**పిబ రే! - రామరసమ్** జఞ్జోటిరాగః - ఆదితాళమ్

**శ్రీసదాశివబ్రహ్మేంద్రకీర్తన**

**పిబ రే! రామరసం - రసనే!**

1. దూరీకృతపాతకసంసర్గం
పూరితనానావిధఫలవర్గమ్ ॥ పిబ రే!।

2. జననమరణభయశోకవిదూరం
సకలశాస్త్రనిగమాగమసారమ్ ॥ పిబ రే!।

3. పరిపాలితసరసిజగర్భాణ్డం
పరమపవిత్రీకృతపాషణ్డమ్ ॥ పిబ రే!।

4. శుద్ధపరమహంసాశ్రయగీతం
శుక-శౌనక-కౌశిక-ముఖపీతమ్ ॥ పిబ రే!।

శ్రీరామనామరసమునో నా జిహ్వేంద్రియమా! ఆస్వాదింపవే! ఆస్వాదించి చెన్నొందవే!

1. రామరసము నాస్వాదింపుము. పాపములు నీదరి జేరవు. రామరసపాన మొనరింపుము – చతుర్విధపురుషార్థములు కోకొల్లలుగా ఫలించును.

2. శ్రీరామనామామృతసేవనముచే – 'చచ్చెదమని – మరల పుట్టెదమని' భయము ఏది ఇంతవరకు పీడించుచున్నదో – అది మటుమాయమైపోవునే! జిహ్వేంద్రియమా! శ్రీరామరసమును పానమొనరింపవే! ఇది సకలవేదసారమే. సర్వశాస్త్రములు, ఆగమములు దీనినే నిరూపించుచున్నవే!

3. బ్రహ్మాండము నెవరు పాలించుచున్నారు. శ్రీరామనామామృతము పతితులను సైతము పరమ పవిత్రులుగా మార్చగలదేది? శ్రీరామ రసాయనము! అది మాత్రమే ఆ పని చేయగలదు.

అందుకే ఓ రసనేంద్రియమా! రామరసపానముజేసి రంజిల్లవే.

4. నిర్మలాంతఃకరణులైన యోగివరేణ్యులు (పరమశివేంద్రులు) శ్రీరామనామమును గానము చేయుచుందురే. ఓ రసనేంద్రియమా! శ్రీశుకయోగి – శౌనకమునివరుడు – విశ్వామిత్రమహర్షి శ్రీరామనామామృతము నాదరముతో సేవించినవారే సుమా! ఓ నా జిహ్వేంద్రియమా! రామరసాయనమును సేవింపవే!

**శ్రీకృష్ణదివ్యౌషధము ఇట శ్రీరామరసము**



## 25

**అవతారిక :** 'శ్రీమన్నారాయణుడు' సర్వోత్కృష్టుడు అని ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆమ్నాయాభ్యసనాన్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహం**
**మేదశ్ఛేదఫలాని పూర్తవిధయస్సర్వే హుతం భస్మని ।**
**తీర్థానామవగాహనాని చ గజస్నానం వినా యత్పద–**
**ద్వంద్వామ్భోరుహసంస్మృతిం విజయతే దేవస్స నారాయణః ॥**

**పదవిభాగము :**

ఆమ్నాయ+అభ్యాసనాని, అరణ్య–రుదితమ్, వేద–వ్రతాని, అను+అహమ్, మేదః+ఛేద–ఫలాని, పూర్త–విధయః, సర్వే, హుతమ్, భస్మని ।

తీర్థానామ్, అవగాహనాని, చ, గజస్నానమ్, వినా, యత్పద-
ద్వంద్వ+అమ్భోరుహ-సంస్మృతిమ్, విజయతే, దేవః, సః, నారాయణః ।

**అన్వయక్రమము :** యత్-పద-ద్వంద్వ-అమ్భోరుహ-సంస్మృతిమ్ వినా ఆమ్నాయ+ అభ్యసనాని అరణ్యరుదితమ్ అన్వహం వేద-వ్రతాని మేధః-ఛేదఫలాని సర్వే పూర్త-విధయః భస్మని హుతం తీర్థానామ్ అవగాహనాని గజస్నానం సః దేవః నారాయణః విజయతే ।

**ప్రతిపదార్థము :**

యత్ =
యత్ పద-ద్వంద్వ+అమ్భోరుహ-సంస్మృతిమ్ వినా = ఏ శ్రీమన్నారాయణ మూర్తియొక్క కమలములవంటి పాద యుగలముయొక్క ధ్యానము లేక,
ఆమ్నాయ + అభ్యసనాని = వేదములను అభ్యసించుటలు,
అరణ్యరుదితమ్ = అరణ్యరోదనమో;
అన్వహమ్ = ప్రతిదినము,
వేదవ్రతాని = వేదమునందు చెప్పబడిన వ్రతములు,
మేధశ్ఛేదఫలాని = కొవ్వు కరుగుటకు ఫలములుగా అగునో;
సర్వే = సమస్తమైన,
పూర్త-విధయః-చెఱువులు త్రవ్వించుటవంటి ధర్మకార్యములు,
భస్మని = బూడిదలో
హుతమ్ = హోమము చేయుటవంటివో;
తీర్థానామ్ = పుణ్యనదులలో,
అవగాహనాని చ = స్నానములు,
గజస్నానమ్ = ఏనుగుయొక్క స్నానము వంటివో;
సః దేవః నారాయణః = ఆ భగవంతుడగు శ్రీమన్నారాయణుడు
**విజయతే** = సర్వోత్కృష్టుడై విరాజిల్లుచున్నాడు.

**తాత్పర్యము :** ఏ శ్రీమన్నారాయణుని యొక్క కమలములవంటి పాదయుగలముయొక్క ధ్యానము లేక, వేదములను అభ్యసించుట, 'అరణ్యరోదన' అవుతుందో; ప్రతిదినము వేదమునందు చెప్పబడిన వ్రతములు – కొవ్వు కరుగుటకు ఫలముగా అగునో; చెఱువులు త్రవ్వించుటవంటి ధర్మకార్యములన్నీ – బూడిదలో హోమము చేయుట వంటివో;

పుణ్యనదులలో స్నానములును - గజస్నానము వంటివో; ఆ శ్రీమన్నారాయణుడు సర్వోత్కృష్టుడై విరాజిల్లుచున్నాడు.

**పాఠాంతరాలు :**

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. అభ్యసనాని - అభ్యసనమ్ - అభ్యసనే - **అభ్యసనాని**, అకారాన్తః నపుంసకలింగః, అభ్యసనశబ్దః, ప్ర.బ; 2. అరణ్యరుదితమ్ - (**అరణ్యే రుదితమ్**) - **రుదితమ్** - రుదితే - రుదితాని; అకారాన్తః, నపుంసకలిఙ్గః, అరణ్యరుదితశబ్దః, ప్ర.ఏ; 3. అన్వహమ్ - (అను అహన్ అచ్) - అవ్యయము; 4. వేదవ్రతాని - వేదవ్రతమ్ - వేదవ్రతే - **వేదవ్రతాని**, అకారాన్తః, నపుంసకలిఙ్గః, వేదవ్రతశబ్దః, ప్ర.బ; 5. మేధశ్ఛేదఫలాని - ఫలమ్ - ఫలే - **ఫలాని**, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ...ఫలశబ్దః, ప్ర.బ; 6. సర్వే - సర్వః - సర్వౌ - **సర్వే**; అకారాన్తః, పుంలిఙ్గ స్సర్వశబ్దః, ప్ర.బ; 7. పూర్తవిధయః - పూర్తవిధిః - పూర్తవిధీ - **పూర్తవిధయః**, ఇకారాన్తః, పుంలిఙ్గః, పూర్తవిధిశబ్దః, ప్ర.బ; 8. భస్మని - **భస్మని** - భస్మనోః - భస్మసు, నకారాన్తః, నపుంసకలిఙ్గః, భస్మన్శబ్దః, స.ఏ; 9. హుతమ్ - **హుతమ్** - హుతే - హుతాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, హుతశబ్దః, ప్ర.ఏ; 10. యత్...సంస్మృతిమ్ - **సంస్మృతిమ్** - సంస్మృతీ - సంస్మృతీః, ఇకారాన్తః, స్త్రీలిఙ్గః, సంస్మృతిశబ్దః, ద్వి.ఏ; 11. తీర్థానామ్ - తీర్థస్య - తీర్థయోః - తీర్థానామ్, అకారాన్తః, నపుంసకలిఙ్గః, తీర్థశబ్దః, ష.బ; 12. అవగాహనాని - (అవ గాహ ల్యుట్) - అవగాహనమ్ - అవగాహనే - **అవగాహనాని**, అకారాన్తః, నపుంసకలిఙ్గః, అవగాహనశబ్దః, ప్ర.బ; 13. **నారాయణః** - నారాయణః - నారాయణౌ - నారాయణాః, అకారాన్తః, పుంలిఙ్గః, నారాయణశబ్దః, ప్ర.ఏ; 13. విజయతే - 19వ శ్లోకవ్యాఖ్యాన భాగమును చూడుడు.

**క్రియాదర్శము :**

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితము. 11వ శ్లోకవ్యాఖానభాగము చూడుడు.

**పదాదర్శము : నారాయణః** - ఇట **'యాజుషీయనారాయణోపనిషత్'**ను అనుసంధానము చేసుకుందుము.

శ్రీగురుభ్యో నమః హరిః ఓమ్

**యాజుషీయనారాయణోపనిషత్**

శ్లో॥ మయా తత్కార్యమఖిలం యద్భోధాద్యాత్యపహ్నవమ్ ।
త్రిపాన్నారాయణాఖ్యం తత్ కలయే స్వాత్మమాత్రతః ॥

ఓం సహనావవత్విితి శాన్తిః

ఓం అథ పురుషోహవై నారాయణోఽకామయత, ప్రజాః సృజేయేతి, నారాయణాత్ప్రాణో జాయతే, మనస్సర్వేంద్రియాణి చ, ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ, నారాయణాద్బ్రహ్మా జాయతే, నారాయణాద్రుద్రో జాయతే, నారాయణాదింద్రో జాయతే, నారాయణాత్ప్రజాపతిః ప్రజాయతే, నారాయణాద్ద్వాదశాదిత్యా రుద్రా వసవస్సర్వాణి ఛందాంసి, నారాయణాదేవ సముత్పద్యంతే, నారాయణాత్ప్రవర్తన్తే, నారాయణే ప్రలీయన్తే, **ఏతదృగ్వేదశిరోఽధీతే ।** 1

అథ నిత్యో నారాయణః, బ్రహ్మా నారాయణః, శివశ్చ నారాయణః, శక్రశ్చ నారాయణః, కాలశ్చ నారాయణః, అధశ్చ నారాయణః, అంతర్బహిశ్చ నారాయణః. నారాయణ ఏవేదగ్‌సర్వం, యద్భూతం యచ్చ భవ్యం, నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతశ్శుద్ధో దేవ ఏకో నారాయణః, న ద్వితీయోఽస్తి కశ్చిత్, య ఏవం వేద స విష్ణురేవ భవతి స విష్ణురేవ భవతి, **ఏతద్యజుర్వేదశిరోఽధీతే ।** 2

ఓం ఇత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, 'నారాయణాయ' ఇత్యుపరిష్టాత్, **ఓమిత్యేకాక్షరమ్, నమ ఇతి ద్వే అక్షరే, 'నారాయణాయ' ఇతి పంచాక్షరాణి, ఏతద్వై నారాయణస్యాష్టాక్షరం పదమ్,** యోహవై నారాయణస్యాష్టాక్షరం పదమధ్యేతి, అనపబ్రువస్సర్వమాయురేతి, విందతే ప్రాజాపత్యమ్, రాయస్పోషం గౌపత్యమ్, తతోఽమృతత్వమశ్నుతే తతోఽమృతత్వమశ్నుత ఇతి, **ఏతత్సామవేదశిరోఽధితే ।** 3

ప్రత్యగానందం బ్రహ్మ పురుషం ప్రణవస్వరూపమ్, అకార ఉకారోమకార ఇతి, తానేకధా సమభవత్తదేవ తదోమితి యముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసార బంధనాత్, ఓం నమో నారాయణాయ ఇతి మంత్రోపాసకః వైకుంఠభవనం గమిష్యతి, తదిదం పుండరీకం విజ్ఞానఘనం తస్మాత్ తటిదాభమాత్రమ్, బ్రహ్మణ్యో దేవకీపుత్రో, బ్రహ్మణ్యో మధుసూదన ఇతి, సర్వభూతస్థమేకం వై నారాయణం కారణపురుషమకారణం పరంబ్రహ్మోమ్, **ఏతదథర్వశిరోఽధీతే ।** 4

ప్రాతరధీయానో రాత్రికృతం పాపం నాశయతి ।
సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి ।

తత్సాయం ప్రాతరధీయానః అపాపో భవతి ।
మాధ్యందినమాదిత్యాభిముఖోఽధీయమానః ।
పంచమహాపాతకోఽపపాతకాత్ప్రముచ్యతే ।

సర్వవేదపారాయణపుణ్యం లభతే, నారాయణసాయుజ్యమవాప్నోతి, శ్రీమన్నారాయణసాయుజ్యమవాప్నోతి, య ఏవం వేద, **ఇత్యుపనిషత్.**

ఓం సహనావవత్వితి శాన్తిః
ఇతి నారాయణోపనిషత్సమాప్తా ।



## 26

**అవతారిక : 'ఏ కార్యమునైనను భగవన్నామమును స్మరించియే చేయవలయు'**నని శ్రీకులశేఖరులు ఈ శ్లోకమున చెప్పుచున్నారు.

**శ్లో॥ శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం**
**కే న ప్రాపుర్వాఞ్ఛితం పాపినోఽపి ।**
**హా! నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిం -**
**స్తేన ప్రాప్తం గర్భవాసాదిదుఃఖమ్ ॥ 26**

**పదవిభాగము :**

శ్రీమత్, నామ, ప్రోచ్య, నారాయణ + ఆఖ్యమ్,
కే, న, ప్రాపుః, వాంఛితమ్, పాపినః, అపి ।
హా! నః, పూర్వమ్, వాక్, ప్రవృత్తా, న, తస్మిన్,
తేన, ప్రాప్తమ్, గర్భవాస + ఆది - దుఃఖమ్ ॥

**అన్వయక్రమము :** పాపినః అపి కే శ్రీమత్ నారాయణాఖ్యం నామ ప్రోచ్య వాంఛితం న ప్రాపుః. హా! పూర్వం నః వాక్ తస్మిన్ న ప్రవృత్తా. తేన గర్భ-వాస+ఆది-దుఃఖమ్ ప్రాప్తమ్.

**ప్రతిపదార్థము :**

పాపినః అపి = పాపాత్ములైనను,

కే = ఎవరు

శ్రీమత్ 'నారాయణ' + ఆఖ్యమ్ = 'శ్రీమన్నారాయణుడు' అనెడు

నామ = నామము,

ప్రోచ్య = పలికి,

వాంఛితమ్ = కోరిన కోరికను,

**న ప్రాపుః** = పొందకుండా ఉన్నారా? అంటే పొందారనే భావము.

పూర్వమ్ = గతమున,

నః = మనయొక్క,

వాక్ = వాక్కు

తస్మిన్ = ఆ 'శ్రీమన్నారాయణ' నామమునందు

న ప్రవృత్తా = ప్రవర్తించలేదు

తేన = ఆ కారణము చేత

గర్భ–వాస + ఆది–దుఃఖమ్ = గర్భవాసము మొదలగు దుఃఖము,

ప్రాప్తమ్ = సంభవించినది.

**తాత్పర్యము :** పాపాత్ములైనను ఎవరు 'శ్రీమన్నారాయణుడు' అనెడు నామము పలికి కోరిన కోరికను పొందకుండా ఉన్నారా? అంటే పొందారనే భావము. గతమున మనయొక్క వాక్కు ఆ 'శ్రీమన్నారాయణ' నామమునందు ప్రవర్తించలేదు. ఆ కారణముచేత గర్భవాసము మొదలగు దుఃఖము సంభవించింది.

**పాఠాంతరాలు :**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. శ్రీమత్ (శ్రీ మతుప్) – **శ్రీమత్** – శ్రీమతే – శ్రీమతాని, దకారాన్తః, నపుంసకలిఙ్గః, శ్రీమద్ శబ్దః, ప్ర.ఏ., **శ్రీమద్ (శ్రీమతుప్) త్రి. మాన్–మతీ–మత్**; 2. నామ – **నామ** – నామ్నీ / నామనీ – నామాని, నకారాన్తః, నపుంసకలిఙ్గః, నామన్శబ్దః, ప్ర.ఏ; 3. ప్రోచ్య – ల్యబన్తము; 4. వాంఛితమ్ – **వాంఛితమ్** – వాంఛితే – వాంఛితాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, వాంఛితశబ్దః, ద్వి.ఏ; 5. ప్రాపుః – ప్ర+ఆపుః – ఆప్ల (ఆప్) వ్యాప్తౌ (వ్యాపించుట) స్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లిట్, ప్ర.బ; 6. నారాయణ + ఆఖ్యమ్ – **...ఆఖ్యమ్** – ...ఆఖ్యే – ...ఆఖ్యాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ...ఆఖ్యశబ్దః,

ప్ర.ఏ; 7. వాక్ – **వాక్/గ్** – వాచౌ – వాచః, చకారాన్తః, స్త్రీలిఙ్గః, 'వాచ్'శబ్దః, ప్ర.ఏ; 8. ప్రవృత్తా – **ప్రవృత్తా** – ప్రవృత్తే – ప్రవృత్తాః, ఆకారాన్తః స్త్రీలింగః, ప్రవృత్తిశబ్దః, ప్ర.ఏ; 9. దుఃఖమ్ (దుష్టాని ఖాని యస్మిన్, దుష్టం ఖనతి ఖన డ, దుఃఖ అచ్ వా) **దుఃఖమ్** – దుఃఖే – దుఃఖాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, దుఃఖశబ్దః, ప్ర.ఏ; 10. ప్రాప్తమ్ (ప్ర + ఆప్ + క్త) – **ప్రాప్తమ్** – ప్రాప్తే – ప్రాప్తాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ప్రాప్తశబ్దః, ప్ర.ఏ; 11. హా శోకఖేదనిందాసంభ్రమవిస్మయేషు ప్రసిద్ధోఽయమ్. అ.కో.(878)

**క్రియాదర్శము :** 1. ప్రాపుః – లిట్ – ప్ర.బ.

| | | | |
|---|---|---|---|
| ప్రాపుః | ప్రాప | ప్రాపతుః | **ప్రాపుః** |
| | ప్రాపిథ | ప్రాపథుః | ప్రాప |
| | ప్రాప | ప్రాపివ | ప్రాపిమ |

**ఛందస్సు :** 1. త్రిష్టుభ్, 2. **శాలినీ**

**లక్షణము :** మాత్తౌ గౌ చేచ్ఛాలినీ వేదలోకైః ।

**శ్లోకపాదము / గణవిభజన** 11 అక్షరాలు (4, 7)

శ్రీ మ న్నా మ ప్రో చ్య నా రా య ణా ఖ్యం
U U U U U I U U I U U
మ త త గ గ

**పదాదర్శము :** ఇట **(అథర్వణరహస్యే – ఉత్తరభాగే) నారాయణహృదయాన్తర్గత–మూలాష్టకమును** అనుసంధానము చేసుకుందుము.

ఓం

శ్లో॥ నారాయణః పరం జ్యోతిరాత్మా నారాయణః పరః ।
నారాయణః పరం బ్రహ్మ నారాయణ! నమోఽస్తు తే ॥ 1

శ్లో॥ నారాయణః పరో దేవో ధాతా నారాయణః పరః ।
నారాయణః పరో ధాతా నారాయణ! నమోఽస్తు తే ॥ 2

శ్లో॥ నారాయణః పరం ధామ ధ్యానం నారాయణః పరః ।
నారాయణః పరోధర్మో నారాయణ! నమోఽస్తు తే ॥ 3

శ్లో॥ నారాయణః పరో వేద్యః విద్యా నారాయణః పరః ।
విశ్వం నారాయణః సాక్షాన్నారాయణ! నమోఽస్తు తే ॥ 4

శ్లో॥ నారాయణాద్విధిర్జాతో జాతో నారాయణాద్భవః ।
జాతో నారాయణాదింద్రో నారాయణ! నమోఽస్తు తే ॥ 5

శ్లో॥ రవిర్నారాయణస్తేజః చంద్రో నారాయణో మహః ।
వహ్నిర్నారాయణః సాక్షాన్నారాయణ! నమోఽస్తు తే ॥ 6

శ్లో॥ నారాయణ ఉపాస్యః స్యాద్గురుర్నారాయణః పరః ।
నారాయణః పరో బోధో నారాయణ! నమోఽస్తు తే ॥ 7

శ్లో॥ నారాయణః ఫలం ముఖ్యం సిద్ధిర్నారాయణః సుఖమ్ ।
సేవ్యో నారాయణః శుద్ధో నారాయణ! నమోఽస్తు తే ॥ 8

(ముఖ్యం ఫలం నారాయణః, సుఖం సిద్ధిః నారాయణః, శుద్ధః సేవ్యః నారాయణః, (హే) నారాయణ! తే నమః) భావము – సుస్పష్టము.



## 27

**అవతారిక :** ఈ శ్లోకమున 'భగవంతునకు దాసానుదాసుడను...' అని శ్రీకులశేఖరులు తనను గుఱించి తాను అలా సంభావించుకొంటున్నారు.

**శ్లో॥ మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే!**
**మత్ప్రార్థనీయమదనుగ్రహ ఏష ఏవ ।**
**త్వద్భృత్యభృత్యపరిచారకభృత్యభృత్య –**
**భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ! ॥ 27**

**పదవిభాగము :**

మత్ + జన్మనః, ఫలమ్, ఇదమ్, మధు–కైటభ + అరే!,
మత్ + ప్రార్థనీయ–మత్ + అనుగ్రహః, ఏషః, ఏవ ।
త్వత్ + భృత్య–భృత్య–పరిచారక–భృత్య–భృత్య–
భృత్యస్య, భృత్యః, ఇతి, మామ్, స్మర, లోక–నాథ! ॥

**అన్వయక్రమము :** (హే) మధు–కైటభ+అరే! మజ్జన్మనః ఫలమ్ ఇదం మత్–ప్రార్థనీయ–మదనుగ్రహః ఏషః ఏవ. లోక–నాథ! త్వద్... భృత్యస్య భృత్యః ఇతి మాం స్మర.

**ప్రతిపదార్థము :**

(హే) మధు–కైటభ+అరే! = మధు–కైటభులనెడు రాక్షసులకు శత్రువైనవాడా!,
మత్ + జన్మనః = నా పుట్టుకకు,
ఫలమ్ = ప్రయోజనము,
ఇదమ్ = ఇదియే.
మత్ + ప్రార్థనీయ–మత్ + అనుగ్రహః = నాచేత ప్రార్థించదగ్గది, నీవు నాకు అనుగ్రహించదగ్గదీ.
ఏషః ఏవ = ఇదియే.
లోకనాథ! = ఓ జగన్నాయకా!
త్వద్ భృత్య... భృత్యస్య = నీ దాస... దాసునికి,
భృత్యః ఇతి = 'దాసుడు' అని,
మామ్ = నన్ను,
**స్మర** = తలంచుము.

**తాత్పర్యము :** ఓ మధుకైటభారీ! నా పుట్టుకకు ప్రయోజనము ఇదియే. నాచేత ప్రార్థించదగ్గదీ, నీవు నాకు అనుగ్రహించదగ్గదీ ఇదియే. ఓ జగన్నాయకా! నీ దాస... దాసునికి 'దాసుడు' అని నన్ను తలంచుము.

**పాఠాంతరాలు : –**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. మజ్జన్మనః **(జన్ మనిన్) – జన్మనః** – జన్మనోః – జన్మనామ్, నకారాన్తః, నపుంసకలిఙ్గః, జన్మశబ్దః, ష.ఏ; 2. మధుకైటభారే! – **(హే) మధుకైటభారే!** – (హే) మధుకైటభారీ! – (హే) మధుకైటభారయః, ఇకారాన్తః, పుంలిఙ్గః, ...అరిశబ్దః, సం.ప్ర.ఏ; 3. ఫలమ్ – **ఫలమ్** – ఫలే – ఫలాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ఫలశబ్దః, ప్ర.ఏ; 4. అనుగ్రహః – **అనుగ్రహః** – అనుగ్రహౌ – అనుగ్రహాః, అకారాన్తః, పుంలిఙ్గః, అనుగ్రహశబ్దః, ప్ర.ఏ; 5. లోకనాథ! – **లోకనాథ!** – లోకనాథౌ – లోకనాథాః, అకారాన్తః, పుంలిఙ్గః, లోకనాథశబ్దః, సం.ప్ర.ఏ; 6. భృత్యః – **భృత్యః** – భృత్యౌ, భృత్యాః, అకారాన్త, పుంలిఙ్గః,

భృత్యశబ్దః, ప్ర.ఏ; 7. స్మర – స్మృ – చిన్తాయామ్ (స్మరించుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, భ్వాది, లోట్, మ.ఏ.

**క్రియాదర్శము :**

| | | | |
|---|---|---|---|
| స్మర | స్మరతు / స్మరతాత్ | స్మరతామ్ | స్మరన్తు |
| | **స్మర** / స్మరతాత్ | స్మరతమ్ | స్మరత |
| | స్మరాణి | స్మరావ | స్మరామ |

**ఛందస్సు :** 1. శాక్వరీ, 2. వసంతతిలకా – 1వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : "త్వద్భృత్యభృత్యపరిచారకభృత్యభృత్యభృత్యస్య' 'భృత్య ఇతి'.**

"వేదాపహారం చేసిన మధుకైటభులను నిరసించి బ్రహ్మకు వేదాలను తిరిగి వచ్చే రీతిలోని ఆశ్రిత వాత్సల్యలోకనాథత్వాది గుణాలకు జితులై నీకు భృత్యులుగా ఉండేవారికి" – అని భావము.

**యః భృత్యః తస్య యః పరిచారకః, తస్య యః భృత్యః, తస్య**
**యః భృత్యః, తస్య యః భృత్యః, తస్య.**

భృత్య ఇతి – వీడు భృత్యుడు అగుగాక.

'భృత్యపరంపరలో ఏడవవాడుగా ఈ కులశేఖరులు అగుగాక' అని నీవు సంకల్పించాలి – అని భావము. – 'ముకుందమాలా' స్తోత్రమునకు డా॥ ఈ.ఏ. శింగరాచార్యులవారు అందించిన వ్యాఖ్య.



## 28

**అవతారిక :** ఈ శ్లోకమున 'భగవన్మహిమ'ను స్తుతించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ నాథే నః పురుషోత్తమే త్రిజగతామేకాధిపే చేతసా**
**సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి ।**
**యం కఞ్చిత్పురుషాధమం కతిపయగ్రామేశమల్పార్థదం**
**సేవాయై మృగయామహే నరమహో! మూఢా వరాకా వయమ్ ॥ 28**

**పదవిభాగము :**

నాథే, నః, పురుషోత్తమే, త్రి–జగతామ్, ఏకాధిపే, చేతసా,
సేవ్యే, స్వస్య, పదస్య, దాతరి, సురే, నారాయణే, తిష్ఠతి ।
యమ్, కంచిత్, పురుష+అధమమ్, కతిపయ–గ్రామేశమ్, అల్పార్థ–దమ్
సేవాయై, మృగయామహే, నరమ్, అహో!, మూఢాః, వరాకాః వయమ్ ।

**అన్వయక్రమము :** త్రిజగతామ్ ఏకాధిపే చేతసా సేవ్యే స్వస్య పదస్య దాతరి పురుషోత్తమే నారాయణే సురే నః నాథే తిష్ఠతి కతిపయ–గ్రామేశమ్ అల్పార్థ–దం యం కంచిత్ పురుష+అధమం నరం సేవాయై మృగయామహే. అహో వయం మూఢాః వరాకాః.

**ప్రతిపదార్థము :**

త్రిజగతామ్ = మూడులోకములకు,
ఏకాధిపే = ఏకైక నాయకుడు,
చేతసా = మనస్సుచేత,
సేవ్యే = కొలువదగినవాడు,
స్వస్య = తనదైన,
పదస్య = స్థానమునకు,
దాతరి = దాతయగువాడు,
పురుషోత్తమే = పురుషోత్తముడు,
నారాయణే = శ్రీమన్నారాయణుడు
సురే = భగవంతుడు,
నః = మనకు
నాథే = నాయకుడై
తిష్ఠతి (సతి) = ఉండగా;
కతిపయ–గ్రామేశమ్ = కొన్ని గ్రామములకు అధికారియును,
అల్పార్థ–దమ్ = కించిత్ ధనాన్ని ఇవ్వగలవాడును,
యమ్ కంచిత్ = ఎవనినో ఒక,
పురుష + అధమమ్ = పురుషాధముడైన,
నరమ్ = మానవుణ్ణి,

సేవాయై = కొలువు కొఱకు,

**మృగయామహే** = వెదకుచున్నాము.

అహో = అయ్యో!,

వయమ్ = మనము,

మూఢాః = మూర్ఖులము

వరాకాః = పనికిమాలినవారము (గదా!)

**తాత్పర్యము :** మూడు లోకములకు ఏకైక నాయకుడు, మనస్సుచేత కొలువదగినవాడు, తన స్థానముయొక్క దాతయగువాడు, (వైకుంఠప్రాప్తి కలిగించేవాడు), పురుషోత్తముడు, శ్రీమన్నారాయణుడు, భగవంతుడు, మనకు నాయకుడై ఉండగా; కొన్ని గ్రామములకు అధికారియును, కించిత్ ధనాన్ని ఇవ్వగలవాడును, ఎవనినో ఒక పురుషాధముడైన మానవుణ్ణి కొలువుకొఱకు వెదకుచున్నాము (గదా!), అయ్యో మనము (ఎంతటి) మూర్ఖులము, పనికిమాలినవారము.

**పాఠాంతరాలు : –**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. త్రిజగతామ్ – త్రిజగతః – త్రిజగతోః – **త్రిజగతామ్**, తకారాన్తః, క్లీబవలిఙ్గః, త్రిజగత్‌శబ్దః, ష.బ; 2. (పురుషేషు అధమః) **పురుషాధమః** – పురుషాధమౌ – పురుషాధమాన్, అకారాన్తః, పుంలిఙ్గః, పురుషాధమశబ్దః, ద్వి.ఏ; 3. సేవాయై – **సేవాయై** – సేవాభ్యామ్ – సేవాభ్యః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, సేవాశబ్దః, చ.ఏ; 4. మృగయామహే – మృగ – అన్వేషణే, సకర్మకమ్, చురాది, సేట్, ఆత్మనేపదీ। అదన్తః। అగర్వీయః। లట్, ఉ.బ.

**క్రియాదర్శము :**

| | | | |
|---|---|---|---|
| మృగయామహే | మృగయతే | మృగయేతే | మృగయన్తే |
| | మృగయసే | మృగయేథే | మృగయధ్వే |
| | మృగయే | మృగయావహే | **మృగయామహే** |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితము, 11వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :** ఈ శ్లోకమున **'సతిసప్తమి'** చెప్పబడినది.

ఏ క్రియచే క్రియాంతరము తెలియబడునో, అట్టి క్రియాశ్రయవాచకశబ్దముపై సప్తమి వచ్చును.

ఇట ఏకాధిపే, సేవ్యే, దాతరి, పురుషోత్తమే, నారాయణే, సురే, నాథే అను సప్తమ్యన్తములకు (తిష్ఠతి (సతి) ఉండగా) ప్రథమాన్తార్థము చెప్పబడినది. దీనినే **సతిసప్తమి** అని వ్యవహరింతురు. మరిన్ని వివరములకై సప్తమ్యధికరణే చ (సూ. 2-3-36) అనుచోట వృత్తి, భాష్యము చూడగలరు.



## 29

**అవతారిక : 'భగవంతుని స్మరణతో మన్మథవికారముండ'**దని ఈ శ్లోకమున శ్రీ కులశేఖరాళ్వార్లు తెలియజేయుచున్నారు.

**శ్లో॥ మదన! పరిహర స్థితిం మదీయే**
**మనసి ముకున్దపదారవిన్దధామ్ని ।**
**హరనయనకృశానునా కృశోఽసి**
**స్మరసి న చక్రపరాక్రమం మురారేః ॥ 29**

**పదవిభాగము :**

మదన!, పరి-హర, స్థితిమ్, మదీయే,
మనసి, ముకుంద-పద + అరవింద-ధామ్ని ।
హర-నయన-కృశానునా, కృశః, అసి,
స్మరసి, న, చక్ర-పరాక్రమమ్, ముర + అరేః ॥

**అన్వయక్రమము :** (హే) మదన! ముకుంద-పద + అరవింద-ధామ్ని మదీయే మనసి స్థితం పరిహర. హర-నయన-కృశానునా కృశః అసి. ముర+అరేః చక్ర-పరాక్రమం న స్మరసి.

**ప్రతిపదార్థము :**

(హే) మదన! = ఓ మన్మథ!,
ముకుంద-పద+అరవింద-ధామ్ని = ముకుందునియొక్క కమలములవంటి

పాదములకు స్థానమైన,
మదీయే = నాదైన,
మనసి = మనస్సునందు,
స్థితమ్ = (నీ) ఉనికిని
పరిహర = విడిచిపెట్టుము.
హర–నయన–కృశానునా = హరునియొక్క అగ్నినేత్రముచేత,
కృశః = కృశించినవాడవు
అసి = అయితివి.
ముర + అరేః = మురారియొక్క,
చక్రపరాక్రమమ్ = సుదర్శనచక్రముయొక్క బలిమిని,
**న స్మరసి** = తలంపనైతివి.

**తాత్పర్యము :** ఓ మన్మథ! ముకుందునియొక్క కమలములవంటి పాదములకు స్థానమైన నాదైన మనస్సునందు (నీ) ఉనికిని విడిచిపెట్టుము. (**'నీవు నా మనసున చొరబడకు'** అని భావము.) హరునియొక్క అగ్నినేత్రముచేత కృశించినవాడవు అయితివి. ('నిస్తేజుడవు అయితివని భావము). మురారియొక్క సుదర్శనచక్ర బలిమిని తలంపనైతివి.

**పాఠాంతరాలు : –**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. **ధామ్ని** – ధామ్నోః – ధామసు, నకారాన్తః, నపుంసకలిఙ్గః, 'ధామన్'శబ్దః, స.ఏ; 2. మనసి – మనసోః – మనస్సు, సకారాన్తః, నపుంసకలిఙ్గో 'మనస్'శబ్దః, స.ఏ; 3. మదీయే – (మమ ఇదమ్) **మదీయే** – మదీయయోః – మదీయేషు, అకారాన్తః, పుంలిఙ్గః, స.ఏ; 4. పరిహర – పరి+హర – హృఞ్ (హృ) హరణే, భ్వాది, ద్వికర్మకమ్, అనిట్, ఉభయ (పరస్మైపదీ), లోట్, మ.ఏ; 5. (కృశ్ ఆ నుక్) కృశానుః; **కృశానునా** – కృశానుభ్యామ్ – కృశానుభిః, ఉకారాన్తః, పుంలిఙ్గః, ...కృశానుశబ్దః, తృ.ఏ; 6. అసి – అస (అస్) భువి (ఉండుట), అకర్మకమ్, అనిట్, అదాది, పరస్మైపదీ, లట్, మ.ఏ; 7. చక్రపరాక్రమమ్ – **చక్రపరాక్రమమ్** – చక్రపరాక్రమౌ – చక్రపరాక్రమాన్, అకారాన్తః, పుంలిఙ్గః, చక్రపరాక్రమశబ్దః, ద్వి.ఏ; 8. స్మరసి – స్మృ – చిన్తాయామ్ – సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్, మ.ఏ.

**క్రియాదర్శము :** 1. పరిహర, 2. అసి, 3.స్మరసి

| | | | |
|---|---|---|---|
| 1. పరి–హర | హరతు / హరతాత్ | హరతామ్ | హరన్తు |
| | **హర** / హరతాత్ | హరతమ్ | హరత |
| | హరాణి | హరావ | హరామ |

| | | | |
|---|---|---|---|
| 2. అసి | అస్తి | స్తః | సన్తి |
| | **అసి** | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |

| | | | |
|---|---|---|---|
| 3. స్మరసి | స్మరతి | స్మరతః | స్మరన్తి |
| | **స్మరసి** | స్మరథః | స్మరథ |
| | స్మరామి | స్మరావః | స్మరామః |

**ఛందస్సు :** 1. అర్ధసమవృత్త, 2. పుష్పితాగ్రా – 10వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుదు.

**పదాదర్శము :** ఎ) **మదన!** – (హే) మదన! – (హే) మదనౌ – (హే) మదనాః, అకారాన్తః, పుంలిఙ్గః, మదనశబ్దః, సం.ప్ర.ఏ.

బి) మదనః – 1. పుం. మదయతీతి, మద్+ణిచ్, ల్యుట్. కామదేవః, అంగజః

2. శ్లో॥ ప్రద్యుమ్నో మకరధ్వజో మనసిజః సంకల్పజన్మాంగజః
పంచేషుః కుసుమాయుధశ్చ **మదనో** మారః స్మరో మన్మథః ।
కందర్పో ఝషకేతనో రతిపతిః శ్రీనందనో హృచ్ఛయః
కామః శంబరసూదనో మధుసఖః శృంగారయోనిః స్మృతః ॥ 32

శ్లో॥ దర్పకః శూపకారాతిరనంగో విషమాయుధః ।
ఆత్మభూర్మనసిశయః పుష్పధన్వా మనోభవః ॥ 33

శ్లో॥ మాపత్యమిరజశ్చైవ... ... ...
– అని హలాయుధకోశము 30 నామములను **'మదన'** పదమునకు పేర్కొన్నది.

శ్లో॥ **మదనా**న్మదనాఖ్యస్త్వం శంభోర్దర్పాత్ సదర్పకః ।
తథా కందర్పనామ్నాపి లోకే ఖ్యాతో భవిష్యసి ॥
– ఇతి కాలికాపురాణే

3. శ్లో॥ క్వ ప్రస్థితాసి కరభోరు! ఘనే నిశేథే
ప్రాణాధికో వసతి యత్ర జనః ప్రియో మే ।
ఏకాకినీ బత! కథం న బిభేషి బాలే
నన్వస్తి పుంఖితశరో **మదనః** సహాయః ॥
– ఇతి అమరుకశతకే71

ప్రశ్న – దట్టమైన జీకటి గల అర్ధరాత్రమున ఎక్కడకు బయలుదేరినావు?

జవాబు– ప్రాణాధికప్రియుడున్న చోటికి,

ప్రశ్న – చిన్నదానవు, ఒంటరిదానవు, ఎందుకు భయపడవు?

జవాబు – బాణములు ధరించిన మదనుడు (మన్మథుడు) సహాయకుడుగా నున్నాడుగదా!

ఈ అమరుక శ్లోకమున 'ప్రశ్నోత్తరాలంకారము' ఉన్నదని అర్జునవర్మదేవుడు చెప్పినాడు.

4. శ్లో॥ "మదనః సిక్థకే స్మరే । రాధే వసన్తే ధత్తూరే' ।
– అని అమరకోశ – నామలింగానుశాసనే



## 30

**అవతారిక :** ఈ శ్లోకమున 'ఓ నాలుకా! షడ్రసాలను కాదు భగవన్నామమును స్వీకరించు' అని శ్రీకులశేఖరులు అంజలి ఘటిస్తున్నారు.

| | |
|---|---|
| **శ్లో॥ తత్త్వం బ్రువాణాని పరం పరస్మా-** | (11) ఇంద్రవజ్రా |
| **న్మధు క్షరన్తీవ సతాం ఫలాని ।** | (11) ఉపేంద్రవజ్రా |
| **ప్రావర్తయ ప్రాఞ్జలిరస్మి జిహ్వే!** | (11) ఇంద్రవజ్రా |
| **నామాని నారాయణగోచరాణి ॥** | (11) ఇంద్రవజ్రా **30** |

**పదవిభాగము :**

తత్ + త్వమ్, బ్రువాణాని, పరమ్, పరస్మాత్,
మధు, క్షరన్తి + ఇవ, సతామ్, ఫలాని ।

ప్రావర్తయ, ప్రాఞ్జలిః + అస్మి, జిహ్వే!
నామాని, నారాయణ – గోచరాణి ॥

**అన్వయక్రమము :** (హే) జిహ్వే! ప్ర + అంజలిః అస్మి. పరస్మాత్ పరం తత్త్వం బ్రువాణాని మధు క్షరన్తి ఇవ సతాం ఫలాని నారాయణగోచరాణి నామాని ప్రావర్తయ.

**ప్రతిపదార్థము :**

(హే) జిహ్వే! = ఓ నాలుక!,
ప్రాఞ్జలిః = అంజలి చేయువాడిగ,
అస్మి = అయితిని.
పరస్తాత్ పరమ్ = పరాత్పరమగు,
తత్త్వమ్ = తత్త్వమును,
బ్రువాణాని = చెప్పునట్టివియు,
మధు = తేనె,
క్షరన్తి + ఇవ = ఒలుకునట్టుండునవియు,
సతాం ఫలాని = సత్పురుషులకు ఫలాలు,
నారాయణ–గోచరాణి = శ్రీమన్నారాయణుని సంబంధులు అగు
నామాని = (శ్రీవిష్ణుసహస్ర)నామములను,
**ప్రావర్తయ** = నుడువుము.

**తాత్పర్యము :** ఓ నాలుక!, (నేను) అంజలి ఘటిస్తున్నాను. పరాత్పరమగు తత్త్వమును చెప్పునట్టివియు, తేనె ఒలుకునట్లుండునవియు, సత్పురుషులకు ఫలాలు – శ్రీమన్నారాయణు సంబంధులు అగు (శ్రీవిష్ణుసహస్ర)నామములను నుడువుము.

**పాఠాంతరాలు :** 1. సతాం ఫలాని – ముదావహాని.

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. ప్రాంజలిః (ప్రబద్ధః అంజలిః) – **ప్రాంజలిః** – ప్రాంజలీ – ప్రాంజలయః, ఇకారాన్తః, పుంలిఙ్గః, ప్రాంజలిశబ్దః, ప్ర.ఏ; 2. అస్మి – అస (అస్) భువి (ఉండుట) అదాది, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్, ఉ.ఏ; 3. తత్త్వమ్ (తత్ త్వ) – **తత్త్వమ్** – తత్త్వే – తత్త్వాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, తత్త్వశబ్దః, ద్వి.ఏ; 4. బ్రువాణాని – బ్రువాణమ్

– బ్రువాణే – **బ్రువాణాని**, అకారాన్తః, నపుంసకలిఙ్గః, బ్రువాణశబ్దః, ప్ర.బ; 5. మధు – **మధు** – మధునీ – మధూని, ఉకారాన్తః, నపుంసకలిఙ్గః, మధుశబ్దః, ప్ర.ఏ; 6. నామాని/నామ – నామ్నీ/నామానీ – **నామాని**, నకారాన్తః, నపుంసకలిఙ్గః, 'నామన్'శబ్దః, ద్వి.బ; 7. ప్రావర్తయ – వృతు (వృత్) వర్తనే, భ్వాది, అకర్మకమ్, సేట్, (ఆత్మనేపదీ), ణిజన్తమ్, పరస్మైపదీ, లోట్, మ.ఏ.

**క్రియాదర్శము : 1. ప్రావర్తయ, 2. అస్మి**

| | | | |
|---|---|---|---|
| 1. ప్రావర్తయ | ప్రావర్తయతు | ప్రావర్తయతామ్ | ప్రావర్తయన్తు |
| | **ప్రావర్తయ** | ప్రావర్తయతమ్ | ప్రావర్తయత |
| | ప్రావర్తయాని | ప్రావర్తయావ | ప్రావర్తయామ |

| | | | |
|---|---|---|---|
| 2. అస్మి – లట్ – ఉ.ఏ | అస్తి | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | **అస్మి** | స్వః | స్మః |

**ఛందస్సు :** 1. త్రిష్టుభ్, 2. ఇంద్రవజ్రా / ఉపేంద్రవజ్రా – **ఉపజాతి**

**లక్షణము :** స్యాదింద్రవజ్రా యది తౌ జగౌ గః (5, 6)

**శ్లోకపాదము / గణవిభజన**

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రథమ పాదము | త | త్త్వం | బ్రు | వా | ణా | ని | ప | రం | ప | ర | స్మాత్ |
| | U | U | I | U | U | I | I | U | I | U | U |
| | | త | | | త | | | జ | | గ | గ |

**పదాదర్శము : అంజలిః** (పుం.)

అ) ఋతన్యఞ్జి – 4.2 ఇతి అఞ్జేర్ అలిచ్. ఉణాది.

ఆ) అఞ్జూ – వ్యక్తిమ్రక్షణ, కాన్తిగతిషు (వ్యక్తపరచుట, పూనుకొనుట, ప్రకటించుట, గమనము), రుధాది, సకర్మకమ్, వేట్, పరస్మైపదీ

ఇ) శ్లో॥ పాణిర్నికుబ్జః ప్రసృతిః తౌ యుతా**వంజలిః** పుమాన్ ।

– అమరకోశే 2–6–85

'**అంజలి**స్తు పుమాన్ హస్తసంపుటే కుడవేఽపి చ' ఇతి మేదినీ.

ఈ) శ్లో॥ నిషిద్ధైరప్యేభిర్లులితమకరందో మధుకరైః
కరైరిందోరన్తశ్ఛురిత ఇవ సంభిన్నముకులః ।
విధత్తాం సిద్ధిం నో నయనసుభగామస్య సదసః
ప్రకీర్ణః పుష్పాణాం హరిచరణయోర**రంజలి**రియమ్ ॥
– వేణీసంహారమ్–1. నాందీశ్లోకము.

'అంజలిః సిద్ధిం విధత్తామ్' అని మొదటి శ్లోకమునను, 'అనునయః వః పుష్ణాతు' అని రెండవ శ్లోకమునను, 'ధూర్జటిః యుష్మాన్ పాతు' అని మూడవ శ్లోకముననున్న యీ నాంది యాశీఃపరముగా చెప్పబడినది.

భట్టనారాయణుణ్ణి, వేణీసంహారమ్ కావ్యమును పలకరించని వ్యాఖ్యానకారు లుండరని చెప్పుట అతిశయోక్తి కాదు.

ఉ) శ్లో॥ సుమనశ్శేఖర! భవతే
సుమ**నోంజలి**రేష కో భవేచ్ఛంభో! ।
ఛత్రం ద్యుమన్ ద్యుమూర్ధ్నః
చామరమపి కి జితశ్రయస్య తవ ॥
– శ్రీసదాశివబ్రహ్మేంద్రవిరచిత 'శ్రీశివమానసికపూజాస్తుతిః' –11

పుష్పాంజలిం సమర్పయామి, ఛత్రం ధారయామి, చామరేణ వీజయామి అనెడు ఉపచారములు వాస్తవమైన శివస్వరూపమును గుర్తించనంతవఱకే ఉపచారములని చెప్పినట్లైనది.

ఊ) శ్లో॥ ఆయాజమానాం దుఃఖార్తాం **ప్రాంజలిం** దేవతామివ ।
భావేన రఘుముఖ్యస్య దశగ్రీవపరాభవమ్ ॥ సుందరకాండ–19–22

'తన ప్రియుడైన శ్రీరాముని ప్రభావముచే రావణాసురునకు పరాభవము కలుగవలెనని మనస్సునందు కోరుచు తన ఇష్టదైవమును ప్రార్థించుచున్నట్లుగా దుఃఖార్తయై చేతులు జోడించుకొనియున్న సీతాదేవిని (రావణుడు చూచెను).



## 31

**అవతారిక :** 'శ్రీకృష్ణ'దను ఔషధమును పుచ్చుకొనుము' అని ఈ శ్లోకమున చెప్పుచున్నారు శ్రీ కులశేఖరాళ్వార్లు.

**శ్లో॥ ఇదం శరీరం పరిణామపేశలం**
**పతత్యవశ్యం శ్లథసన్ధిజర్జరమ్ ।**
**కిమౌషధైః క్లిశ్యసి మూఢ! దుర్మతే!**
**నిరామయం కృష్ణరసాయనం పిబ ॥ 31**

**పదవిభాగము :**

ఇదమ్, శరీరమ్, పరిణామ–పేశలమ్,
పతతి + అవశ్యమ్, శ్లథ–సంధి–జర్జరమ్ ।
కిమ్, ఔషధైః, క్లిశ్యసి, మూఢ!, దుర్మతే!,
నిరామయమ్, కృష్ణ–రసాయనమ్, పిబ ॥

**అన్వయక్రమము :** ఇదం శరీరమ్ పరిణామ–పేశలం శ్లథ–సంధి–జర్జరమ్ అవశ్యం పతతి. మూఢ! దుర్మతే! ఔషధైః కిం క్లిశ్యసి. నిరామయం కృష్ణ–రసాయనం పిబ.

**ప్రతిపదార్థము :**

ఇదం శరీరమ్ = ఈ శరీరము,
పరిణామ–పేశలమ్ = షడ్భావవికారము పొందినదై,
శ్లథ–సంధి–జర్జరమ్ = సడలిన కీళ్లతో జీర్ణమైనదిగ
అవశ్యమ్ = అవశ్యము
**పతతి** = (భూమిపై) పడిపోవుచున్నది.
(హే) మూఢ! = ఓ అజ్ఞాని!,
(హే) దుర్మతే! = ఓ దుష్టబుద్ధి!,
ఔషధైః = మందు–మాకులతో,
కిమ్ = ఏల
**క్లిశ్యసి** = కష్టపడుతున్నావు?
నిర్ + ఆమయమ్ = ఆరోగ్యకరమైన

కృష్ణ–రసాయనమ్ = 'శ్రీకృష్ణుడు' అనెడు రసాయనమును
**పిబ** = త్రాగుము.

**తాత్పర్యము :** ఈ శరీరము షడ్భావవికారము పొందినదై సడలిన కీళ్లతో జీర్ణమైనదిగా అయి అవశ్యము పడిపోవుచున్నది. ఓ అజ్ఞాని! ఓ దుష్టబుద్ధి! మందు–మాకులతో ఏల కష్టపడుతున్నావు? ఆరోగ్యకరమైన 'శ్రీకృష్ణుడు' అనెడు రసాయనమును త్రాగుము.

**పాఠాంతరాలు :** 1. శ్లథ–సంధి–జర్జరమ్ – శత–సంధి–జర్జరమ్. 2. క్లిశ్యసి – పృచ్ఛసి

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. శరీరమ్ (శౄఈరన్) **శరీరమ్** – శరీరే – శరీరాణి, అకారాన్తః, నపుంసకలిఙ్గః, శరీరశబ్దః, ప్ర.ఏ; 2. పతతి – పత్ఌ (పత్) గతౌ, భ్వాది, అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్, ప్ర.ఏ; 3. మూఢ! – **(హే) మూఢ!** – (హే) మూఢౌ – (హే) మూఢాః, అకారాన్తః, పుంలిఙ్గః, మూఢశబ్దః, సం.ప్ర.ఏ; 4. దుర్మతే! – **(హే) దుర్మతే!** – (హే) దుర్మతీ – (హే) దుర్మతయః, ఇకారాన్తః, పుంలిఙ్గః, దుర్మతిశబ్దః, సం.ప్ర.ఏ; 5. ఔషధైః – ఔషధేన – ఔషధాభ్యామ్ – **ఔషధైః**, అకారాన్తః, నపుంసకలిఙ్గః, ఔషధశబ్దః, తృ.బ; 6. (క్లి)శ్యసి – (క్లి) – శో తనూకరణే – కృశించుట, దివాది, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్, మ.ఏ; 7. నిరామయమ్ (నిర్గత ఆమయాత్) – **నిరామయమ్** – నిరామయౌ – నిరామయాన్, అకారాన్తః, పుంలిఙ్గః, నిరామయశబ్దః, ద్వి.ఏ; 8. కృష్ణరసాయనమ్ – **రసాయనమ్** – రసాయనౌ – రసాయనాన్, అకారాన్తః, పుంలిఙ్గః, కృష్ణరసాయనశబ్దః, ద్వి.ఏ; 9. పిబ – ఇంతకుముందు చెప్పబడినది.

**క్రియాదర్శము :** 1. పతతి, 2. క్లిశ్యసి 3. పిబ

| | | | |
|---|---|---|---|
| 1. పతతి | **పతతి** | పతతః | పతన్తి |
| | పతసి | పతథః | పతథ |
| | పతామి | పతావః | పతామః |
| 2. క్లిశ్యసి | (క్లి)శ్యతి | (క్లి)శ్యతః | (క్లి)శ్యన్తి |
| | **(క్లి)శ్యసి** | (క్లి)శ్యథః | (క్లి)శ్యథ |
| | (క్లి)శ్యామి | (క్లి)శ్యావః | (క్లి)శ్యామః |

**ఛందస్సు :** 1. జగతీ, 2. **వంశస్థవిలమ్**

**లక్షణము :** వదన్తి వంశస్థవిలం జతౌ జరౌ. 12 అక్షరాలు (5, 7)

**శ్లోకపాదము / గణవిభజన**

| | | |
|---|---|---|
| ని రా మ | యం కృ ష్ణ ర సా య | నం పి బ |
| I U I | U U I I U I | U I I |
| జ | త | జ |

ఇట శ్లోకాంతలఘువు గురువుగ స్వీకరింతురు.

**పదాదర్శము : (క్లి)శ్యసి**

అ) క్లిశ – ఉపతాపే, అకర్మకమ్, సేట్, దివాది, ఆత్మనేపదీ,

ఆ) క్లిశూ – బిబాధనే, సకర్మకమ్, వేట్, క్ర్యాది, పరస్మైపదీ,

ఇ) శో – తనూకరణే, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, దివాది,

లట్ రూపాలు

| | | | |
|---|---|---|---|
| ఎ) | క్లిశ్యతే | క్లిశ్యేతే | క్లిశ్యన్తే |
| | క్లిశ్యసే | క్లిశ్యేథే | క్లిశ్యధ్వే |
| | క్లిశ్యే | క్లిశ్యావహే | క్లిశ్యామహే |
| బి) | క్లిశ్నాతి | క్లిశ్నీతః | క్లిశ్నన్తి |
| | క్లిశ్నాసి | క్లిశ్నీథః | క్లిశ్నీథ |
| | క్లిశ్నామి | క్లిశ్నీవః | క్లిశ్నీమః |
| సి) | శ్యతి | శ్యతః | శ్యన్తి |
| | శ్యసి | శ్యథః | శ్యథ |
| | శ్యామి | శ్యావః | శ్యామః |

దివాదులలోని 'క్లిశ' ధాతువు 'పరసైపదీ' ఐతేనే 'క్లిశ్యసి' లట్ మ.ఏ.గా ఉంటుంది. 'ధాతువులు' అన్నీ ఉభయపదులుగా పరిగణించే ఆచారమూ మనకు కొన్నిచోట్ల ఒక్కోసారి కనబడుతుంది. ఛందోభంగభియా పరస్మైపదీ ప్రయోగోఽత్ర.



## 32

**అవతారిక :** ఈ శ్లోకమున 'భక్తవాత్సల్యము' చెప్పబడుచున్నది.

**శ్లో॥ దారా వారాకరవరసుతా తే తనూజో విరిఞ్చిః**
**స్తోతా వేదస్తవ సురగణో భృత్యవర్గః ప్రసాదః ।**
**ముక్తిర్మాయా జగదవికలం తావకీ దేవకీ తే**
**మాతా మిత్రం బలరిపుసుతస్త్వయ్యతోఽన్యన్న జానే ॥ 32**

**పదవిభాగము :**

దారా, వార + ఆకర–వర–సుతా, తే, తనూజః, విరించిః,
స్తోతా, వేదః, తవ, సురగణః, భృత్యవర్గః, ప్రసాదః,
ముక్తిః, మాయా, జగత్, అవికలమ్, తావకీ, దేవకీ, తే,
మాతా, మిత్రమ్, బలరిపు–సుతః, త్వయి, అతః, అన్యత్, న, జానే ॥

**అన్వయక్రమము :** వార + ఆకార–వర–సుతా తే దారా. విరించిః తే తనూజః. వేదః స్తోతా. సురగణః తవ భృత్యవర్గః. ప్రసాదః ముక్తిః. అవికలం జగత్ తావకీ మాయా. దేవకీ తే మాతా. బలరిపుసుతః తే మిత్రమ్. అతః అన్యత్ త్వయి న జానే.

**ప్రతిపదార్థము :**

వార + ఆకర–వర–సుతా = సముద్రములో మేటియైన పాలకడలి పట్టియగు లక్ష్మీదేవి,
తే దారా = నీయొక్క భార్య.
విరించిః = బ్రహ్మదేవుడు,
తే తనూజః = నీయొక్క కొమరుడు.
వేదః = వేదము,
స్తోతా = స్తోత్రపాఠకుడు.
సురగణః = దేవసమూహము,
తవ భృత్యవర్గః = నీయొక్క పరిచారకుల సముదాయము.
ముక్తిః = మోక్షము
(తే) ప్రసాదః = (నీయొక్క) అనుగ్రహము.

అవికలమ్ = సమస్తమైన,
జగత్ = ప్రపంచము,
తావకీ మాయా = నీ మాయారూపమగు ప్రకృతి.
దేవకీ = దేవకీదేవి,
తే మాతా = నీయొక్క తల్లి.
బలరిపు–సుతః = ఇంద్రపుత్త్రుడగు అర్జునుడు,
తే మిత్రమ్ = నీయొక్క స్నేహితుడు.
అతః అన్యత్ = ఇంత కంటె వేఱొకటి,
త్వయి = నీయందున,
**న జానే** = ఎఱుంగను.

**తాత్పర్యము :** సుస్పష్టము.

**పాఠాంతరాలు :** 1. సురగణః – సురగణాః, 2. త్వయ్యతః – తత్త్వద్. 3. విరిఞ్చిః – విరఞ్చిః

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. వరసుతా – **సుతా** – సుతే – సుతాః, ఆకారాన్తః, స్త్రీలింగః, సుతాశబ్దః, ప్ర.ఏ; 2. దారా – **దారా** – దారే – దారాః, ఆకారాన్తః, స్త్రీలింగః, దారాశబ్దః, ప్ర.ఏ; 3.విరించిః – **విరించిః** – విరించీ – విరించయః, ఇకారాన్తః, పుంలిఙ్గః, విరించిశబ్దః, ప్ర.ఏ; 4. తనూజః – **తనూజః** – తనుజౌ – తనూజాః, అకారాన్తః, పుంలిఙ్గః, తనూజశబ్దః, ప్ర.ఏ; 5. వేదః (విద్ అచ్ ఘఞ్ వా) – **వేదః** – వేదౌ – వేదాః, అకారాన్తః, పుంలిఙ్గః, వేదశబ్దః, ప్ర.ఏ; 6. స్తోతా **(స్తు తృచ్) – స్తోతా** – స్తోతారౌ – స్తోతారః, ఋకారాన్తః, పుంలిఙ్గః, స్తోతృశబ్దః, ప్ర.ఏ; 7. అవికలమ్ (న వికలః) – **అవికలమ్** – అవికలే – అవికలాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, అవికలశబ్దః, ప్ర.ఏ; 8. జగత్ – **జగత్** – జగతీ – జగన్తి, తకారాన్తః, నపుంసకలిఙ్గః, జగత్‌శబ్దః, ప్ర.ఏ; 9. మిత్రమ్ – మిత్రమ్ – మిత్రే – మిత్రాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, మిత్రశబ్దః, ప్ర.ఏ; 10. అతః అన్యత్ – అవ్యయాలు; 11. జానే – ఇంతకు ముందు చెప్పబడినది. చూడుడు.

**క్రియాదర్శము : –**

**ఛందస్సు :** 1. అత్యష్టి, 2. **మందాక్రాన్తా.** 4వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : దారా** / దారాః (హలాయుధకోశే)

అ) **దారా** = (స్త్రీ) దారయతి జ్ఞాతిబన్ధూనితి, దృ+ణిచ్+అచ్+టాప్, దారాః, భార్యా,

శ్లో॥ అప్యేకామాత్మనో దారాం నృణాం స్వత్వగ్రహో యతః।
- ఇతి భాగవతే 7-14-11

ఆ) **దారాః - (పుం.)** దారయన్తి భ్రాతృబన్ధూనితి, దృ + 'దారజారౌ కర్తరి ణిలుక్ చ' ఇత్యుక్త్యా ఘఞ్ ణిలుక్ చ. భార్యా, బహువచనాంతో2యం శబ్దః.

దారాః, దారాన్, దారాభిః, దారాభ్యః, దారాభ్యః, దారాణామ్ దారాసు (దారేషు?) ఏకవచన, ద్వివచనరూపాలు ఉండవు. బహువచనంలో కూడా సంబోధన ఉండదు.

శ్లో॥ ఆపదర్థే ధనం రక్షేద్ **దారాన్** రక్షేద్ ధనైరపి ।
ఆత్మానం సతతం రక్షేద్ **దారైరపి** ధనైరపి ॥
- ఇతి మహాభారతే 1-159-28

ఇ) శ్లో॥ **దారాః** క్షేత్రం కలత్రం చ భార్యా సహచరీ వధూః ।
సహధర్మచారిణీ పత్నీ జాయా చ గృహిణీ గృహాః ॥ 494

అని హలాయుధకోశము '11' నామములను పేర్కొన్నది.

ఈ) శ్లో॥ పత్నీ పాణిగృహీతి చ ద్వితీయా సహధర్మిణీ ।
భార్యా జాయాఽథ పుం భూమ్ని **దారాః**.... 5

అని అమరకోశము '7' నామములను పేర్కొన్నది.

ఉ) శ్లో॥ ఏతే వయయమీ **దారాః** - కన్యేయం కులజీవితమ్ ।
బ్రూత యేనాత్ర వః కార్య- మనాస్థా బాహ్యవస్తుషు ॥
ఇతి కుమారసంభవే - 6-63

... ఈమె నా భార్య. ఈ కన్య నా వంశమునకు ప్రాణము. మీకు కావలసిన కార్యము మా ఇందఱిలో ఎవరి వలన జరుగవలెనో చెప్పుము. బాహ్యవస్తువులగు (బంగారము, రత్నములు మొ॥) వానిపై ఆశ మీకుండదుకదా!

ఊ) శ్లో॥ అస్మాన్ సాధు విచింత్య సంయమధ నానుచ్చైః కులం చాత్మన-
స్త్వయ్యస్యాః కథమప్యబాన్ధవకృతాం స్నేహప్రవృత్తిం చ తామ్ ।

సామాన్యప్రతిపత్తిపూర్వకమియం **దారేషు** దృశ్యా త్వయా
భాగ్యాయత్తమతఃపరం న ఖలు తద్వాచ్యం వధూబంధుభిః ॥
- ఇతి అభిజ్ఞానశాకుంతలే 4-17

ఓ దుష్యన్తమహారాజా!... బాగుగా యోచించుకొని, నీ ఇతర భార్యలపై జూపెదు ప్రేమతో సమానమైన ప్రేమను మా చిన్నదానియందు గూడ జూపగోరుచున్నాము...

కణ్వమహర్షి శకుంతలను అత్తవారింటికి సాగనంపునపుడు ఆర్ద్రతతో పలికిన పలుకులివి.

ఎ) శ్లో॥ మనస్వీ తద్ గతస్తస్యా నిత్యం హృది సమర్పితః ।
ప్రియా తు సీతా రామస్య **దారాః** పితృకృతా ఇతి ॥
- ఇతి బాలకాండే 77-26

... తండ్రి అంగీకరించిన సంబంధమగుటచే రామునకు భార్యయైన సీతపై ప్రేమ కలిగెను...

ఏ) శ్లో॥ అగ్నిహోత్రఫలా వేద దత్తభుక్తఫలం ధనమ్ ।
రతిపుత్రఫలా **దారాః** శీలవృత్తఫలం శ్రుతమ్ ॥
- ఇతి మహాభారతే-సభాపర్వే

వేదములు అగ్నిహోత్రమే ఫలముగా గలవి. ఇచ్చుట, అనుభవించుట అనునదే ధనమునకు ఫలము. ఆనందము, సంతానము అనునవియే భార్యవలన కలుగు ఫలము. శీలము, నడవడి అనునవియే పాండిత్యమునకు ఫలము.



## 33

**అవతారిక :** ఈ శ్లోకమున **'సార్వవిభక్తికముతో శ్రీకృష్ణభగవానుని కీర్తించుట'** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం**
**కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః ।**
**కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం**
**కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హే కృష్ణ! రక్షస్వ మామ్ ॥ 33**

**పదవిభాగము :**

కృష్ణః, రక్షతు, నః, జగత్త్రయ–గురుః, కృష్ణమ్, నమస్యామి, అహమ్, కృష్ణేన, అమరశత్రవః, వినిహతాః, కృష్ణాయ, తస్మై, నమః. కృష్ణాత్, ఏవ, సమ్+ఉత్థితమ్, జగత్+ఇదమ్, కృష్ణస్య, దాసః, అస్మి+అహమ్ కృష్ణే, తిష్ఠతి, సర్వమ్, ఏతత్, అఖిలమ్, హే కృష్ణ!, రక్షస్వ, మామ్ ।

**అన్వయక్రమము :** జగత్త్రయ–గురుః కృష్ణః నః రక్షతు. అహం కృష్ణం నమస్యామి. కృష్ణేన అమరశత్రవః వినిహతాః. తస్మై కృష్ణాయ నమః. ఇదమ్ జగత్ కృష్ణాత్+ఏవ సముత్థితమ్. అహం కృష్ణస్య దాసః అస్మి. అఖిలం సర్వమ్ ఏతత్ కృష్ణే తిష్ఠతి. హేకృష్ణ! మాం రక్షస్వ.

**ప్రతిపదార్థము :**

జగత్త్రయ–గురుః = ముల్లోకములకు గురువగు,
కృష్ణః = శ్రీకృష్ణుడు,
నః = మనలను,
**రక్షతు** = కాచుగాక!
అహం కృష్ణమ్ = నేను శ్రీకృష్ణుణ్ణి గూర్చి,
**నమస్యామి** = నమస్కరించుచున్నాను.
కృష్ణేన = శ్రీకృష్ణునిచేత,
అమరశత్రవః = దేవతాశత్రువులైన అసురులు,
వినిహతాః = సంహరింపబడ్డారు.
తస్మై కృష్ణాయ = ఆ శ్రీకృష్ణుని కొఱకు
నమః = నమస్కారము.
ఇదమ్ జగత్ = ఈ లోకమంతయు,
కృష్ణాత్ + ఏవ = శ్రీకృష్ణుని వలననే,
సముత్థితమ్ = జనించినది.
అహమ్ = నేను,
కృష్ణస్య = శ్రీకృష్ణునకు,
దాసః = దాసుడను,
**అస్మి** = అగుచున్నాను.

అఖిలమ్ = ఏ ఒక్కటిన్ను వదలక,

సర్వమ్ = సమస్తమునగు

ఏతత్ = ఇది (ఈ జగము),

కృష్ణే = శ్రీకృష్ణుని యందు,

తిష్ఠతి = నిలచియున్నది.

హే కృష్ణ! = ఓ శ్రీకృష్ణ!

మామ్ = నన్ను,

**రక్షస్వ** = రక్షింపుము.

**తాత్పర్యము :** సుస్పష్టము.

**పాఠాంతరాలు :** 1. నమస్యామ్యహమ్ – నమధ్వం సదా, 2. తస్మై – తుభ్యమ్, 3. సర్వమేతత్ – విశ్వమేతత్.

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. రక్షతు – రక్ష (రక్ష్) పాలనే, సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాది, లోట్, ప్ర.ఏ; 2. నమస్యామి – నమః కరోతి – నమస్యతి, నామధాతుప్రకరణమ్; 3. అస్మి – ఇంతకుముందు చెప్పబడినది; 4. తిష్ఠతి – ఇంతకుముందు చెప్పబడినది; 5. రక్షస్వ – లోట్, మ.ఏ, ఆత్మనేపదీ; 6. నమః (457) అవ్యయకోశము; 7. కృష్ణః, 2. హేకృష్ణ!, 3. కృష్ణమ్, 4. కృష్ణేన, 5. కృష్ణాయ, 6. కృష్ణాత్, 7. కృష్ణస్య, 8. కృష్ణే.

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | కృష్ణః | కృష్ణౌ | కృష్ణాః |
| సంబోధన ప్ర. | హే కృష్ణ! | హే కృష్ణౌ | హే కృష్ణాః |
| ద్వితీయా | కృష్ణమ్ | కృష్ణౌ | కృష్ణాన్ |
| తృతీయా | కృష్ణేన | కృష్ణాభ్యామ్ | కృష్ణైః |
| చతుర్థీ | కృష్ణాయ | కృష్ణాభ్యామ్ | కృష్ణేభ్యః |
| పఞ్చమీ | కృష్ణాత్ | కృష్ణాభ్యామ్ | కృష్ణేభ్యః |
| షష్ఠీ | కృష్ణస్య | కృష్ణయోః | కృష్ణానామ్ |
| సప్తమీ | కృష్ణే | కృష్ణయోః | కృష్ణేషు |

ఇట శబ్దరత్నావళియందు సుబన్తప్రకరణమున గల **'శబ్దానుక్రమణికా'**ను అనుసంధానము చేసుకుందురుగాక.

1. ధ్యాత్వా శ్రీతురగగ్రీవం బాలవ్యుత్పత్తిసిద్ధయే ।
అనుక్రమణికా శబ్దరత్నానాం క్రియతేఽధునా ॥

2. త్రిషు లిఙ్గేష్వమీ తుల్యరూపాః షట్ పఞ్చ సప్త చ ।
అష్టౌ నవేత్యాదినాన్తాః కత్యస్మద్యుష్మదీ తథా ॥

..............................

..............................

58. నపుంసకా హలన్తేషు సప్తవింశతిరీరితాః,
ఇత్థం గ్రహానలగుణాః శబ్దాబోధ్యా మనీషిభిః ।
ఏషాం శబ్దానుక్రమణీ యస్య కణ్ఠే విభాతి సః,
సభాయాం శాబ్దికైః పూజ్య ఇహాముత్ర చ మోదతే ॥

**ఇతి శబ్దానుక్రమణికా సమాప్తా.**

**క్రియాదర్శము :** 1. రక్షతు, 2. నమస్యామి, 3. రక్షస్వ.

| | | | |
|---|---|---|---|
| 1. రక్షతు | **రక్షతు**/రక్షతాత్ | రక్షతామ్ | రక్షన్తు |
| | రక్ష/రక్షతాత్ | రక్షతమ్ | రక్షత |
| | రక్షాణి | రక్షావ | రక్షామ |
| 2. నమస్యామి | నమస్యతి | నమస్యతః | నమస్యన్తి |
| | నమస్యసి | నమస్యథః | నమస్యథ |
| | **నమస్యామి** | నమస్యావః | నమస్యామః |

ధాతువులపై కొన్ని ప్రత్యయములు చేరుటవలన సుబంతములేర్పడినట్లుగ, సుబంతములపై కొన్ని ప్రత్యయములు చేరుటవలన ధాతువులేర్పడును. నామములపై (సుబన్తములపై) అర్థవిశేషములో ప్రత్యయము చేరగా ఏర్పడినది **నామధాతువు. నమః కరోతి నమస్యతి.**

నమస్ + క్యచ్, ఇతి క్యజన్తః, నామధాతుః, సకర్మకమ్, పరస్మైపదీ, లట్.

3. రక్షస్వ – లోట్, మ.ఏ. లౌకికవాఙ్మయమున కానరాదు ఈ రూపము.

| | | |
|---|---|---|
| రక్షతామ్ | రక్షేతామ్ | రక్షన్తామ్ |
| **రక్షస్వ** | రక్షేథామ్ | రక్షధ్వమ్ |
| రక్షై | రక్షావహై | రక్షామహై |

**ఛందస్సు :** 1. అతిధృతి, 2. శార్దూలవిక్రీడితము. 11వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :**

1. శ్రీరామకర్ణామృతమ్ – ప్రథమాశ్వాసమున గల 17వ శ్లోకమును ఇట అనుసంధానము చేసికొందుము. వావిళ్ల (ఎడిషన్)

శ్లో॥ **రామ** స్సీతాసమేతో నివసతు హృదయే సానుజం **రామమీళే**
**రామేణ** క్షీణపాపస్త్రివిధమపి కృతం కర్మ **రామాయ** దద్యామ్ ।
**రామాద**న్యం న జానే నహి కిమపి మహా**రామనా**మ్నస్సమానం
**రామే** పశ్యామి విశ్వం భువనమనుదినం పాహి మాం **రామచన్ద్ర!**

సీతతో గూడిన రాముడు నా హృదయమున నుండుగాక. తమ్ములతో గూడిన రాముని స్తుతించుచున్నాను. రామునిచే క్షీణించు పాపము గలవాడనైతిని. మనోవాక్కాయములచే చేసిన కర్మ రాముని కొఱకు సమర్పించెదను. రామునికంటె నితరునెఱుంగను. రామనామమునకు తుల్యమైన దేదియు లేదు. సర్వలోకమును రామునియందు చూచుచున్నాను. ఓ రామచంద్రప్రభూ! నన్ను రక్షింపుమయ్యా!

2. "తెలుగుసాహిత్యచరిత్రలో 12వ శతాబ్దంలో దేశికవితా ఉద్యమానికి ఊపిరిపోసినవాడు శ్రీ పాల్కురికి సోమనాథుడు. వీరశైవమతప్రచారానికై సాహిత్యసృష్టి చేసినవాడు. పరమశివుని పూజించే మధురమైన ప్రక్రియగా ఉదాహరణ వాఙ్మయ ప్రక్రియకు శ్రీకారం చుట్టినవాడు. ఎనిమిది విభక్తులతో '8' వృత్తాలు, '8' కళికలు, 8 ఉత్కళికలు, చివరగా సార్వవిభక్తికస్తుతి గలిగిన పద్యం కూర్చబడిన స్తోత్రప్రక్రియ ఉదాహరణ కావ్యం. క్రీ.శ. 8వ శతాబ్దిలో నివసించిన శ్రీకులశేఖరాళ్వార్లు రచించిన 'ముకుందమాలా' స్తోత్రములో ఈ సార్వవిభక్తికశ్లోకములో ఉదాహరణ ప్రక్రియారూపమైన ఛాయలు కన్పిస్తున్నాయి!" అని తమ మరందవ్యాఖ్యానములో **డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి**గారు పేర్కొంటిరి.

3) భవద్ శబ్దస్య ఏకవచనరూపాణ్యుపయుజ్య పద్యమ్ ।

శ్లో॥ **భవా**నిదానీం మమ మార్గదర్శీ
**భవన్తమే**వ ప్రణమామి నిత్యమ్ ।
పఠామి గీతాం **భవతా** సదుక్తాం
కరోమి నిత్యం **భవతే** ప్రణామాః ॥

శ్లో॥ జ్ఞానాయ విద్యాం **భవతో** లభేయ
దద్యాత్తదర్థం **భవతః** కటాక్షమ్ ।
**భవాని** నిత్యం **భవతి** ప్రసన్నః
హే శ్రీశ! బన్ధుశ్చ **భవాన్** మమైవ ॥

– ప్రయతితా–అనన్తకల్యాణకృష్ణః।

4) **గురు**శబ్దముఖంగా, **సార్వవిభక్తికంగా** చెప్పబడిన ఈ దిగువ శ్లోకమును కంఠహారముగా ధరింతురుగాక.

శ్లో॥ గురురేవ గతిర్గురుమేవ భజే
గురుణైవ సహాస్మి నమో గురవే ।
న గురోః పరమం శిశురస్మి గురోః
మతిరస్మి గురౌ మమ పాహి గురో ॥

**"జగద్గురుం శ్రీకృష్ణం వందే!"**



## 34

**అవతారిక :** 'పురుషోత్తమ! నన్ను కాచుకుంటున్నావు' గదా అంటూ శ్రీ కులశేఖరాళ్వార్లు తన్మయత్వములో ఓలలాడుచున్నారు.

**శ్లో॥ తత్త్వం ప్రసీద భగవన్కురు మయ్యనాథే**
**విష్ణో! కృపాం పరమకారుణికః కిల త్వమ్ ।**
**సంసారసాగరనిమగ్నమనన్త! దీన–**
**ముద్ధర్తుమర్హసి హరే! పురుషోత్తమోఽసి ॥ 34**

**పదవిభాగము :**

తత్, త్వమ్, ప్రసీద, భగవన్!, కురు, మయి, అనాథే,
విష్ణో!, కృపామ్, పరమ–కారుణికః, కిల, త్వమ్ ।
సంసార–సాగర–నిమగ్నమ్, అనంత! దీనమ్,
ఉద్ధర్తుమ్, అర్హసి, హరే! పురుష+ఉత్తమః, అసి ॥

**అన్వయక్రమము :** (హే) భగవన్! (హే) విష్ణో! (హే) అనంత! (హే) హరే! త్వమ్ పురుషోత్తమః పరమకారుణికః అసి కిల. తత్ త్వమ్ అనాథే కృపాం కురు. సంసార–సాగర–నిమగ్నం దీనం మాం ఉద్ధర్తుమ్ అర్హసి. ప్రసీద.

**ప్రతిపదార్థము :**

(హే) భగవన్! = ఓ స్వామీ!,
(హే) విష్ణో! = ఓ విష్ణూ!,
(హే) అనంత! = ఓ అనంతుడా!,
(హే) హరే! = ఓ హరీ!
త్వమ్ = నీవు
పురుషోత్తమః = పురుషశ్రేష్ఠుడవు,
పరమ–కారుణికః = పరమకారుణికుడవుగా
అసి కిల = ఉన్నావుగదా.
తత్ = అటువంటి,
త్వమ్ = నీవు
అనాథే = ఆసరాలేని,
మయి = నాయందు
కృపామ్ = దయను
కురు = ఉంచుము.
సంసార–సాగర–నిమగ్నమ్ = సంసారమనెడు సముద్రమునందు మునిగినవాడను,
దీనమ్ = దీనుడను అగు
మామ్ = నన్ను
ఉద్ధర్తుమ్ = ఉద్ధరించుటకు,

అర్హసి = తగియున్నావు.
**ప్రసీద** = అనుగ్రహింపుము.

**తాత్పర్యము :** ఓ స్వామీ!, ఓ విష్ణూ! ఓ అనంతుడా!, ఓ హరీ!, నీవు పురుషశ్రేష్ఠుడవు, పరమకారుణికుడవుగా ఉన్నావు గదా. అటువంటి నీవు ఆసరాలేని నాయందు దయను ఉంచుము. సంసారమనెడు సముద్రమునందు మునిగినవాడును, దీనుడును అగు నన్ను ఉద్ధరించుటకు తగియున్నావు. అనుగ్రహింపుము.

**పాఠాంతరాలు :** 1. కిల – ఖలు

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. భగవన్! – **(హే) భగవన్!** – (హే) భగవన్తౌ – (హే) భగవన్తః, తకారాన్తః, పుంలిఙ్గః, భగవత్‌శబ్దః, సం.ప్ర.ఏ; 2. విష్ణో! – **(హే) విష్ణో** – (హే) విష్ణూ – (హే) విష్ణవః, ఉకారాన్తః, పుంలిఙ్గః, విష్ణుశబ్దః, సం.ప్ర.ఏ; 3. అనంత! – **(హే) అనంత!** – (హే) అనంతౌ – (హే) అనంతాః, అకారాన్తః, పుంలిఙ్గః, అనంతశబ్దః, సం.ప్ర.ఏ; 4. హరే! – **(హే) హరే!** – (హే) హరీ – (హే) హరయః, ఇకారాన్తః, పుంలిఙ్గః, హరిశబ్దః, సం.ప్ర.ఏ; 5. అనాథే – (నాస్తి నాథో యస్య) – **అనాథే** – అనాథయోః – అనాథేషు, అకారాన్తః, పుంలిఙ్గః, అనాథశబ్దః, స.ఏ; 6. కృపామ్ (కృప్ అఙ్) – **కృపామ్** – కృపే – కృపాః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, కృపాశబ్దః, ద్వి.ఏ; 7. కురు – డుకృఞ్ (కృ) కరణే (చేయుట), తనాది, సకర్మకమ్, అనిట్, ఉభయ (పరస్మైపదీ), లోట్, మ.ఏ; 8. దీనమ్ – **దీనమ్** – దీనౌ – దీనాన్, అకారాన్తః, పుంలిఙ్గః, దీనశబ్దః, ద్వి.ఏ; 9. మామ్ – **మామ్**/మా – ఆవామ్/నౌ – అస్మాన్/నః, దకారాన్తః, పుంలిఙ్గః, అస్మచ్ఛబ్దః, ద్వి.ఏ; 10. ఉద్ధర్తుమ్ – తుమున్ ప్రత్యయాన్తము – కృదంతము, అవ్యయము; 11. అర్హసి – అర్హ పూజాయామ్, భ్వాది, సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లట్, మ.ఏ; 12. ప్రసీద–ప్ర + షద్లు – విశరణగత్యవసాదనేషు, 1. నశించుట, 2. గమనము, 3. చంపుట, 1 అకర్మకమ్, 2,3–సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లోట్, మ.ఏ.

**క్రియాదర్శము :** 1. అర్హసి, 2. ప్రసీద

| | | | |
|---|---|---|---|
| 1. **అర్హసి** | అర్హతి | అర్హతః | అర్హన్తి |
| | **అర్హసి** | అర్హథః | అర్హథ |
| | అర్హామి | అర్హావః | అర్హామః |

| | | | |
|---|---|---|---|
| 2. ప్రసీద | ప్రసీదతు/ప్రసీదతాత్ | ప్రసీదతామ్ | ప్రసీదన్తు |
| | **ప్రసీద**/ప్రసీదతాత్ | ప్రసీదతమ్ | ప్రసీద |
| | ప్రసీదాని | ప్రసీదావ | ప్రసీదామ |

**ఛందస్సు :** 1. శక్వరీ, 2. **వసంతతిలకా**, 1వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము : ప్రసీద** – ప్ర + షద – విశరణగత్యవసాదనేషు; లోట్, మ.ఏ.

1. శ్లో॥ **ప్రసీద ప్రసీద** ప్రచండప్రతాప!
**ప్రసీద ప్రసీద** ప్రచండారికాల! ॥
**ప్రసీద ప్రసీద** ప్రసన్నానుకంపిన్!
**ప్రసీద ప్రసీద** ప్రభో! రామచంద్ర! ॥

ఇతి శ్రీమచ్ఛంకరాచార్యకృత రామభుజంగప్రయాతస్తోత్రే చరమశ్లోకః.

అతితీక్ష్ణమైన ప్రతాపముగల యో రామమూర్తీ! శత్రువులకు ఘోరమృత్యు వైనవాడా! శరణాగతులను దయజూచునో స్వామీ! నాయెడ గడుంగడు ప్రసన్నుడ వగువయ్యా!

2. శ్లో॥ వినా వేంకటేశం న నాథో న నాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి ।
హరే! వేంకటేశ! **ప్రసీద ప్రసీద**
ప్రియం వేంకటేశ! ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥ 10

– ఇతి శ్రీవేంకటేశస్తోత్రమ్.



## 35

**అవతారిక :** ఈ శ్లోకమున శ్రీ కులశేఖరాళ్వార్ల చేత 'మనోవాక్కాయములతో శ్రీమన్నారాయణుని స్మరించుట' చెప్పబడుతున్నది.

**శ్లో॥ నమామి నారాయణపాదపఙ్కజం**
**కరోమి నారాయణపూజనం సదా ।**
**వదామి నారాయణనామ నిర్మలం**
**స్మరామి నారాయణతత్త్వమవ్యయమ్ ॥ 35**

**పదవిభాగము :**

నమామి, నారాయణ–పాద–పంకజమ్,
కరోమి, నారాయణ–పూజనమ్, సదా ।
వదామి, నారాయణ–నామ, నిర్మలమ్,
స్మరామి, నారాయణ–తత్త్వమ్, అవ్యయమ్ ॥

**అన్వయక్రమము :** (అహమ్) నారాయణ–పాద–పంక–జమ్ నమామి. సదా నారాయణ–పూజనం కరోమి. నిర్మలం నారాయణ–నామ వదామి. అవ్యయం నారాయణ–తత్త్వం స్మరామి.

**ప్రతిపదార్థము :**

(అహమ్ = నేను)
నారాయణ–పాద–పంక–జమ్ = శ్రీమన్నారాయణునియొక్క బురదనుండి జనించిన కమలములవంటి పాదములను గూర్చి,
**నమామి** = నమస్కరించుచున్నాను.
సదా = నిరతము,
నారాయణ–పూజనమ్ = శ్రీమన్నారాయణునియొక్క పూజను,
**కరోమి** = చేయుచున్నాను.
నిర్మలమ్ = స్వచ్ఛమైనదగు
నారాయణ–నామ = శ్రీమన్నారాయణునియొక్క నామమును,
**వదామి** = చెప్పుచున్నాను.
అవ్యయమ్ = క్షరముకానిదగు
నారాయణ–తత్త్వమ్ = శ్రీమన్నారాయణునియొక్క తత్త్వమును,
**స్మరామి** = తలంచుచున్నాను.

**తాత్పర్యము :** సుస్పష్టము.

**పాఠాంతరాలు :** –

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. నారాయణపాదపంకజమ్ – **పంకజమ్** – పంజకే – పంకజాని,అకారాన్తః,

నపుంసకలిఙ్గః, ...పంకజశబ్దః, ద్వి.ఏ; 2. ...పూజనమ్ – **పూజనమ్** – పూజనే – పూజనాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, పూజనశబ్దః, ద్వి.ఏ; 3. అవ్యయమ్ – **అవ్యయమ్** – అవ్యయే – అవ్యయాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, అవ్యయశబ్దః, ద్వి.ఏ; 4. నిర్మలమ్ – **నిర్మలమ్** – నిర్మలే – నిర్మలాని, అకారాన్తః, నపుంసకలిఙ్గః, నిర్మలశబ్దః, ద్వి.ఏ; 5.
5. నమామి – ణమ (నమ) ప్రహత్వే/నమ్రత్వే శబ్దే, భ్వాది, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ;
6. కరోమి – డుకృఞ్ (కృ) కరణే – సకర్మకమ్, తనాది, అనిట్, ఉభయ (పరస్మైపదీ);
7. వదామి – వద (వద్) వ్యక్తాయాం, వాచి, భ్వాది, అకర్మకమ్, సేట్, పరస్మైపదీ; 8. స్మరామి – స్మృ చిన్తాయామ్ (స్మరించుట) భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ.

**క్రియాదర్శము :** 1. నమామి, 2. కరోమి, 3. వదామి, 4. స్మరామి.

| | | | |
|---|---|---|---|
| 1. నమామి | నమతి | నమతః | నమన్తి |
| | నమసి | నమథః | నమథ |
| | **నమామి** | నమావః | నమామః |
| 2. కరోమి | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | కురుథ |
| | **కరోమి** | కుర్వః | కుర్మః |
| 3. వదామి | వదతి | వదతః | వదన్తి |
| | వదసి | వదథః | వదథ |
| | **వదామి** | వదావః | వదామః |
| 4. స్మరామి | స్మరతి | స్మరతః | స్మరన్తి |
| | స్మరసి | స్మరథః | స్మరథ |
| | **స్మరామి** | స్మరావః | స్మరామః |

**ఛందస్సు :** 1. జగతి, 2. వంశస్థ, 14వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :** ఈ శ్లోకమున, పాదాదులలో లట్ ఉత్తమపురుష ఏకవచనరూపములు ప్రయోగింపబడినవి.



## 36 / 37

**అవతారిక :** 'సంబుద్ధ్యంతములతో భగవన్నామోచ్చారణ' ఈ శ్లోకమున చేయబడుచున్నది.

**శ్లో॥ శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!**
**శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే! ।**
**శ్రీ పద్మనాభాచ్యుత! కైటభారే!**
**శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! ॥ 36**

**శ్లో॥ అనన్త! వైకుణ్ఠ! ముకున్ద! కృష్ణ!**
**గోవిన్ద! దామోదర! మాధవేతి ।**
**వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చి-**
**దహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్ ॥ 37**

**పదవిభాగము :**

శ్రీనాథ!, నారాయణ!, వాసుదేవ!,
శ్రీకృష్ణ!, భక్త-ప్రియ!, చక్ర-పాణే!, ।
శ్రీపద్మనాభ! + అచ్యుత!, కైటభ + అరే!,
శ్రీరామ!, పద్మాక్ష!, హరే!, ముర+అరే! ॥

అనన్త!, వైకుణ్ఠ!, ముకుం-ద!, కృష్ణ!,
గోవిన్ద!, దామోదర!, మాధవ! + ఇతి, ।
వక్తుమ్, సమర్థః + అపి, న, వక్తి, కశ్చిత్,
అహో! జనానామ్, వ్యసన-అభి-ముఖ్యమ్ ॥

**అన్వయక్రమము :** శ్రీనాథ!... మాధవ! ఇతి వక్తుం సమర్థః అపి కశ్చిత్ న వక్తి. అహో జనానాం వ్యసన-అభి-ముఖ్యమ్.

**ప్రతిపదార్థము :**

శ్రీ-నాథ! = లక్ష్మీదేవికి పతియైనవాడా!
నారాయణ! = జలశాయి ఐ యుండువాడా!
వాసు-దేవ! = వసుదేవునియొక్క కొమరుడా!

(హే) శ్రీకృష్ణ! = ఓ శ్రీకృష్ణా!
భక్త–ప్రియ! = భక్తులకు ఇష్టుడైనవాడా!
చక్ర–పాణే! = 'సుదర్శన'మనెడు చక్రమును హస్తమున ధరించినవాడా!
శ్రీపద్మనాభ! = శోభాయుతమైన పద్మమును నాభియందు ధరించినవాడా!
అచ్యుత! = చ్యుతములేనివాడా!
కైటభారే! = కైటభుడనెడు రక్కసునకు శత్రువైనవాడా!
(హే) శ్రీరామ! = ఓ శ్రీరామచంద్రప్రభూ!
పద్మాక్ష! = కమలములను బోలిన నేత్రములు గలవాడా!
హరే! = ప్రలయసమయమున సమస్తమును హరించువాడా!
మురారే! = మురాంతకుడా! 36
అనన్త! = తుదిలేనివాడా!
వైకుంఠ = వైకుంఠుడా!
ముకుం–ద! = పరమపురుషార్థమగు మోక్షమును ప్రసాదించువాడా!
(హే) కృష్ణ! = ఓ శ్రీకృష్ణ!
గోవింద! = గోవిందుడా!
దామోదర! = దామోదరుడా!
(హే) మాధవ! = ఓ లక్ష్మీవల్లభుడా!
ఇతి = అని,
వక్తుమ్ = చెప్పుటకు,
సమర్థః + అపి = శక్తిగలవాడైనను,
కశ్చిత్ = ఒక్కడున్ను,
న వక్తి = చెప్పడు.
అహో = అయ్యో!,
జనానామ్ = జనులకు,
వ్యసనాభిముఖ్యమ్ = వ్యసనములయందు ఆసక్తి ఎంతటిది?

**తాత్పర్యము :** సుస్పష్టము.

**పాఠాంతరాలు :** –

**విభక్తులు - క్రియలు - అవ్యయాలు :**

1. కశ్చిత్ - (కః చిత్) అవ్యయము - 'కశ్చిత్కాంతావిరహగుణా స్వాధికారాత్ప్రమత్తః' - మేఘదూతమ్; 2. వక్తి - వచ (వచ్) పరిభాషణే (మాట్లాడుట), అదాది, అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్, ప్ర.ఏ;3. జనానామ్ - జనస్య - జనయోః - **జనానామ్,** అకారాన్తః, పుంలిఙ్గః, జనశబ్దః, ష.బ; అహో - ఖేదాద్ భుతానుకంపా సంతోషేషు. (అ.కో.) 46.

**క్రియాదర్శము :**

| | | | |
|---|---|---|---|
| వక్తి | **వక్తి** | వక్తః | - **అన్తిప్రయోగో న ప్రయుజ్యతే** |
| | వక్షి | వక్థః | వక్థ |
| | వచ్మి | వచ్వః | వచ్మః |

**ఛందస్సు :** 1. త్రిష్టుభ్, 2. 36వ శ్లోకము - ఇంద్రవజ్రా- 30వ శ్లోకవ్యాఖ్యను, 37వ శ్లోకము - ఉపేంద్రవజ్రా - 3వ శ్లోక వ్యాఖ్యను చూడుడు.

**పదాదర్శము : వాసుదేవః**

1 పుం.

అ) వసుదేవస్యాపత్యమితి। వసుదేవ + 'ఋష్యన్ధకవృష్ణికురుభ్యశ్చ' ఇతి అణ్। యద్వా

ఆ) సర్వత్రాసౌ వసత్యాత్మరూపేణ విశ్వంభరత్వాదితి ।
వస్ + బాహులకాద్ ఉణ్ వాసుః ।
వాసుశ్చాసౌ దేవశ్చేతి కర్మధారయః ।

ఇ) శ్రీకృష్ణః, వసుదేవభూః ...

2. శ్లో॥ మనోజవస్తీర్థకరో వసురేతా వసుప్రదః ।
వసుప్రదో **వాసుదేవో** వసుర్వసుమనా హవిః । 74శ్లో.(700నామము)

వసుదేవాపత్యత్వాచ్చ - వాసుదేవః । వసుదేవుని పుత్త్రుడు కనుక వాసుదేవుడు అని ఈ నామమునకు అర్థము.

ఇచట అపత్యార్థమునందు దాశరథి అన్నట్లు 'అత ఇఞ్' అను సూత్రముచే 'ఇ' ప్రత్యయము రావలసియుండగా, దానికి బదులుగా 'ఋష్యన్ధకవృష్ణికురుభ్యశ్చ' అను

సూత్రముచే వసుదేవశబ్దముపై అణ్ ప్రత్యయము వచ్చినది. ఆద్యక్షరమునకు వృద్ధి వచ్చినది. 'వసుదేవ పుత్రుడు' అని అర్థము. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమున ఈ నామము 334, మఱియు 714 సంఖ్యలోనూ ఆవృత్తి నొందినదని గమనింతురుగాక.

శ్లో॥ స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః ।
**వాసుదేవో** (334) బృహద్భానుః ఆదిదేవః పురందరః ॥ 36శ్లో.

శ్లో॥ భూతవాసో **వాసుదేవః** (714) సర్వాసునిలయోనలః ।
దర్పహా దర్పదోఽదృప్తో దుర్ధరోథాపరాజితః ॥ 76

శ్రీపరాశరభట్టర్ వారిభాష్యమును ఇట అనుసంధానము చేసికొందము.

భాష్యమ్ : వాసుదేవాపత్యత్వే ద్విషట్కాధ్యాత్వం నియచ్ఛతీతి, **వాసుదేవః**, అత ఏవ హి జాగ్రద్వ్యూహ వాసుదేవో 'మాధురాయాద్భుతమాయాయ' ఇతి మధురావతారేణ విశేష్యతే.

వేదోక్తములైన అనేక భగవన్నామములలో ప్రాధాన్యము సంతరించుకున్నవి విష్ణుగాయత్రిలోని మూడు నామములే.

అవి విష్ణు – **వాసుదేవ** – నారాయణ అను నామములు. వీటిని ప్రణవమును, నమశ్శబ్దమును చతుర్థీవిభక్తిని చేర్చగా ఏర్పడిన మంత్రములివి.

1. **ఓం నమో విష్ణవే** అను షడక్షరీ మంత్రము
2. **ఓం నమో భగవతే వాసుదేవాయ** అను ద్వాదశాక్షరీ మంత్రము,
3. **ఓం నమో నారాయణాయ** అను అష్టాక్షరీ మంత్రము.

ఇందలి ద్వాదశాక్షరీమంత్రమునకు ఉపదేష్టము ప్రతిపాద్యుడు కూడ చతుర్వ్యూహములలోని వాసుదేవమూర్తి అగుట విశేషము. ఇందలి భగవత్ శబ్దము షాడ్గుణ్యమూర్తిని బోధింపగా, వాసుదేవశబ్దము వాసుశ్చ అసౌ దేవశ్చ అను వ్యుత్పత్తిని బట్టి సర్వభూతములకు ఆవాసస్థానమైనవాడని అర్థము తెలుపుచున్నది.

వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణ నామములు భగవంతుని చతుర్వ్యూహములకు చెందినవి.

– శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము, శ్రీపరాశరభట్టర్ వారి భాష్యానుసారము.



## 38

**అవతారిక :** ఈ శ్లోకమున 'పరమపురుషార్థము'ను గుఱించి ప్రస్తావించుచున్నారు శ్రీ కులశేఖరాళ్వార్లు.

**శ్లో॥ ధ్యాయన్తి యే విష్ణుమనన్తమవ్యయం**
**హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్ ।**
**సమాహితానాం సతతాభయప్రదం**
**తే యాన్తి సిద్ధిం పరమాఞ్చ వైష్ణవీమ్ ॥ 38**

**పదవిభాగము :**

ధ్యాయన్తి, యే, విష్ణుమ్, అనంతమ్, అవ్యయమ్,
హృత్-పద్మ-మధ్యే, సతతమ్, వ్యవస్థితమ్ ।
సమాహితానామ్, సతత + అభయ-ప్రదమ్,
తే, యాన్తి, సిద్ధిమ్, పరమామ్, చ, వైష్ణవీమ్ ॥

**అన్వయక్రమము :** అనంతమ్ అవ్యయం హృత్ + పద్మమధ్యే సతతం వ్యవస్థితం సమాహితానాం సతత + అభయ-ప్రదం విష్ణుం యే ధ్యాయన్తి తే పరమాం వైష్ణవీం సిద్ధిం యాన్తి. (చ - పాదపూరణార్థము)

**ప్రతిపదార్థము :**

అనంతమ్ = అంతము లేనివాడును,
అవ్యయమ్ = క్షరము కానివాడును,
హృత్+పద్మ-మధ్యే = హృదయమనెడు పద్మమునకు మధ్యలో,
సతతమ్ = నిరతము
వ్యవస్థితమ్ = సుస్థితుడును,
సమాహితానామ్ = ఏకాగ్రచిత్తులకు,
సతత+అభయ-ప్రదమ్ = ఎల్లప్పుడు అభయము నొసంగువాడును అగు
విష్ణుమ్ = 'శ్రీమహావిష్ణువు'ను
యే = ఎవరు,
**ధ్యాయన్తి** = ధ్యానించుచుందురో,

తే = వారు
పరమామ్ = పరమమైనదియు,
వైష్ణవీమ్ = వైష్ణవమైనదియును అగు
సిద్ధిమ్ = 'పరమపదసోపానము'ను
**యాన్తి** = పొందుచున్నారు

**తాత్పర్యము :** అంతము లేనివాడును; క్షరము కానివాడును; హృదయమనెడు పద్మమునకు మధ్యలో నిరతము సుస్థితుడును, ఏకాగ్రచిత్తులకు ఎల్లప్పుడు అభయమును ప్రసాదించువాడును అగు 'శ్రీమహావిష్ణువు'ను ఎవరు ధ్యానించుచుందురో వారు పరమమైనదియు, వైష్ణవమైనదియును అగు **'పరమపదసోపానము'**ను పొందుచున్నారు.

**పాఠాంతరాలు : –**

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. విష్ణుమ్ – **విష్ణుమ్** – విష్ణూ – విష్ణూన్, ఉకారాన్తః, పుంలిఙ్గః, విష్ణుశబ్దః, ద్వి.ఏ; 2. యే – **యః** – యౌ – యే, దకారాన్తః, పుంలిఙ్గః, యచ్ఛబ్దః, ప్ర.బ; 3. ధ్యాయన్తి – ధ్యై చిన్తాయామ్ (ధ్యానించుట), భ్వాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్, ప్ర.బ; 4. తే – సః – తౌ – తే, దకారాన్తః, పుంలిఙ్గః, తచ్ఛబ్దః, ప్ర.బ; 5. సిద్ధిమ్ (సిధ్ క్తిన్ సిద్ధిః) – **సిద్ధిమ్** – సిద్ధీ – సిద్ధీః, ఇకారాన్తః, స్త్రీలిఙ్గః, సిద్ధిశబ్దః, ద్వి.ఏ; 6. యాన్తి – యా ప్రాపణే (పొందుట, వెళ్లుట), అదాది, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్, ప్ర.ఏ.

**క్రియాదర్శము :** 1. ధ్యాయన్తి, 2. యాన్తి

| | | | |
|---|---|---|---|
| 1. ధ్యాయన్తి | ధ్యాయతి | ధ్యాయతః | **ధ్యాయన్తి** |
| | ధ్యాయసి | ధ్యాయథః | ధ్యాయథ |
| | ధ్యాయామి | ధ్యాయావః | ధ్యాయామః |
| 2. యాన్తి | యాతి | యాతః | **యాన్తి** |
| | యాసి | యాథః | యాథ |
| | యామి | యావః | యామః |

**ఛందస్సు :** 1. జగతీ, 2. **ఇంద్రవంశా**

**లక్షణము :** తచ్చేంద్రవంశా ప్రథమాక్షరే గురౌ ।

**శ్లోకపాదము / గణవిభజన** 12 అక్షరాలు.

ధ్యా య న్తి యే వి ష్ణు మ న న్త మ వ్య యం
U U I U U I I U I U I U
త త జ ర

**పదాదర్శము : విష్ణుమ్**

అ) 1) విష్ణుమ్ – ఉకారాన్తః, పుంలిఙ్గః, విష్ణుశబ్దః, ద్వి.ఏ

2) శ్లో॥ విశ్వం **విష్ణుర్వ**షట్కారో భూతభవ్యభవత్ప్రభుః ।
భూతకృత్ భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥ 1

3) విష్ణుః – **ఓం విష్ణవే నమః**

4) భాష్యమ్ : విభవానుప్రవేశేన తావద్విశినష్టి – (విష్ణుః) ఇతి – స్వ విభూతిభూతం చిదచిదాత్మకం సర్వం విశతీతి – యథా – 'వివేశ భూతాని చరాచరాణి, తదేవానుప్రావిశత్, ఇత్యాది.

శ్లో॥ వ్యాప్య సర్వానిమాన్ లోకాన్ స్థితస్సర్వత్ర కేశవః ।
తతశ్చ విష్ణునామాని విశేర్ధాతోః ప్రవేశనాత్ ॥

విశ–ప్రవేశనే ఇతి ధాతుః । తత్ర క్ను ప్రత్యయాత్ విష్ణురితి.

తాచ్ఛీల్యాది విషయేణ క్ను ప్రత్యయేన 'అస్య మహిమ్నః స్వాభావికత్వముచ్యతే। పూర్ణత్వవ్యాప్తివిషయత్వేన నామ్నోరపునరుక్తిః ॥ – శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమున.

ఈ 'విష్ణు' నామము 259, మఱియు 663 సంఖ్యలలో కనబడుతుంది.

శ్లో॥ వృషాహీ వృషభో **విష్ణుః**(259) వృషపర్వా వృషోదరః ।
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తశ్శ్రుతిసాగరః ॥ 28

శ్లో॥ కామదేవః కామహలః కామీ కాన్తః కృతాగమః ।
అనిర్దేశ్యవపుః విష్ణుః (663) వీరోఽనంతో ధనంజయః ॥ 70

భాష్యమ్ : ఏవం వ్యాప్తినియమనాది శక్తిద్వారా విశ్వవ్యాప్తేః – విష్ణుః.

'సర్వశక్త్యాత్మనే' ఇతి తన్మంత్రవర్ణే. ఆదిత్యపురాణే.

శ్లో॥ యస్మాద్విష్టమిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః ।
తస్మాత్ ప్రోచ్యతే **విష్ణుః** విశేర్ధాతోః ప్రవేశనాత్ ॥

ఉద్యోగే, 'విష్ణుర్విక్రమణాద్దేవః' ఇతి వా.
శ్రీ పరాశరభట్టర్‌వారికి నమస్సులతో.

ఆ) శ్లో॥ శుక్లాంబరధరం **విష్ణుం** శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే ॥
ఆ విష్ణుభగవానుని ఇవ్విధముగ నిరతము స్మరించుదాము.

ఇ) శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం, పుష్పమింద్రియనిగ్రహః ।
సర్వభూతదయా పుష్పం, క్షమా పుష్పం విశేషతః ॥

శ్లో॥ శాంతిః పుష్పం తపః పుష్పం, ధ్యానం పుష్పం తథైవ చ ।
సత్యమష్టవిధం పుష్పం, **విష్ణోః** ప్రీతికరం భవేత్ ॥

విష్ణుభగవానునకు అత్యన్తప్రియమైన పువ్వు లెనిమిదింటిని తెలియజేతును. వీటితో పూజించిన అత్యన్తసంతుష్టుడగును.

అహింస, ఇంద్రియనిగ్రహము, జీవదయ, క్షమ, శాన్తి, తపస్సు, ధ్యానము, సత్యము; అనునవే ఆ ఎనిమిది పువ్వులు.



## 39

**అవతారిక :** ఈ శ్లోకమున 'శ్రీమన్నారాయణునకు నమస్కారము' చెప్పుచున్నారు శ్రీ కులశేఖరులు.

**శ్లో॥ క్షీరసాగరతరఙ్గశీకరా-**
**సారతారకితచారుమూర్తయే ।**
**భోగిభోగశయనీయశాయినే**
**మాధవాయ మధువిద్విషే నమః ॥ 39**

**పదవిభాగము :**

క్షీర–సాగర–తరఙ్గ–శీకర+ఆ–
సార–తారకిత–చారు–మూర్తయే, ।
భోగి–భోగ–శయనీయ–శాయినే,
మాధవాయ, మధు–విద్విషే, నమః ॥

**అన్వయక్రమము :** క్షీర... మూర్తయే భోగి...శాయినే మధు–విద్విషే మాధవాయ నమః.

**ప్రతిపదార్థము :**

క్షీరసాగర = పాలసముద్రముయొక్క,
తరంగ = అలలయొక్క,
శీకరాసార = తుంపురులచేత,
తారకిత = ముత్యాలహారము ధరించినట్లుండు,
చారు = శోభాయమానమైన,
మూర్తయే = శరీరముగలవాడును,
భోగి–భోగ–శయనీయ–శాయినే = ఆదిశేషునియొక్క శరీరమనెడు
శయ్యనందు పరుండినట్టివాడును,
మధువిద్విషే = మధువనెడు రాక్షసుని సంహరించినవాడును అగు,
మాధవాయ = లక్ష్మీపతియైన శ్రీమన్నారాయణుని కొఱకు,
నమః = నమస్కారము.

**తాత్పర్యము :** సుస్పష్టము.

**పాఠాంతరాలు :** –

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. క్షీర...మూర్తయే – **...మూర్తయే** – ...మూర్తిభ్యామ్ – ...మూర్తిభ్యః, ఇకారాన్తః, పుంలిఙ్గః, ...మూర్తిశబ్దః, చ.ఏ; 2. భోగి... శాయినే – **...శాయినే** – ...శాయిభ్యామ్ – ...శాయిభ్యః, నకారాన్తః, పుంలిఙ్గః, ...శాయిన్ శబ్దః, చ.ఏ; 3. మధువిద్విషే – **...విద్విషే** – ...విద్విడ్భ్యామ్ – ...విద్విడ్భ్యః, షకారాన్తః, పుంలిఙ్గః, ...విద్విష్‌శబ్దః, చ.ఏ; 4. మాధవాయ – **మాధవాయ** – మాధవాభ్యామ్ – మాధవేభ్యః, అకారాన్తః, పుంలిఙ్గః, మాధవశబ్దః, చ.ఏ; 5. నమః (నమ్ అసన్) నమః, అవ్యయము.

**'పుష్పమిదం విష్ణవే నమః'**

**క్రియాదర్శము : –**

**ఛందస్సు :** 1. త్రిష్టుభ్, 2. **రథోద్ధతా**

**లక్షణము :** రాన్నరైర్నరలగై రథోద్ధతా (3,8; 4,7) 11 అక్షరాలు

**శ్లోకపాదము / గణవిభజన**

క్షీ ర సా  గ ర త  ర జ్జ శీ  క రా
U I U  I I I U I U  I U
ర  న  ర  ల గ

**పదాదర్శము : మాధవః** – ఓం మాధవాయ నమః

మాధవః – 1 (పుం.) మధోర్వసన్తస్యాయమ్, మధూని మధుమన్తి కుసుమాని అస్మిన్ వా । 'మధు + మధోర్ఞ చ' ఇతి ఞ । వైశాఖమాసః.

2. యదుపుత్రస్య మధోరపత్యం పుమాన్ । మధు + అణ్ । యద్వా **మా లక్ష్మీస్తస్యాః ధవః** । మాయా విద్యాయా ధవ ఇతి । విష్ణుః

శ్లో॥ మా చ బ్రహ్మస్వరూపా యా మూలప్రకృతిరీశ్వరీ ।
నారాయణీతి విఖ్యాతా విష్ణుమాయా సనాతనీ ॥

శ్లో॥ మహాలక్ష్మీస్వరూపా చ వేదమాతా సరస్వతీ ।
రాధా వసుంధరా గంగా తాసాం స్వామీ చ **మాధవః** ॥
– ఇతి బ్రహ్మవైవర్తే.

3. శ్లో॥ ఏకో నైకస్స వః కః కిం యత్తత్పదమనుత్తమమ్ ।
లోకబన్ధుర్లోకనాథో **మాధవో** భక్తవత్సలః ॥ 78, **735**వ నామము

భాష్యమ్ : బాన్ధవ విశేషమాహ మాతాపితృత్వమ్ శ్రియా సహాస్య సూచయతి, **మాధవః** మధుకులోద్భవత్వాద్వా, **మాధవః**. మౌనాద్ధ్యానాచ్చ యోగాచ్చ విద్ధి భారత । మాధవమ్ ఇతి వా.

లక్ష్మీదేవితో కలసి ఈయన జగత్తునకు మాతాపితృత్వమనబడు అతిసన్నిహిత సంబంధము కలవాడని మాధవ పదము సూచించుచున్నది. మాయాః ధవః లక్ష్మికి

ప్రియభర్తయైనవాడు అని యర్థము లేక మధువు అను ఒక యదుకులమునందలి రాజుయొక్క వంశమునందు జన్మించినవాడు గనుక మాధవః (మధోః అపత్యమ్) అని గూడ చెప్పవచ్చును. లేక 'మౌనాత్ ధ్యానాత్ చ యోగాత్ చ విద్ధి భారత! మాధవమ్' అను భారతములోని శ్లోకమునబట్టి (మా) మౌనము అనబడు మితభాషిత్వమును బట్టియు, (ధ) ధ్యానగోచరుడగుటను బట్టియు, (వ) ఆరాధన క్రియాసంబంధమును బట్టియు ఆయన **'మాధవు'**డన బడుచున్నాడు అను నిర్వచనమునుబట్టి కూడ మాధవుడు అని 3వ అర్థమును గ్రహింపవచ్చును.

ఆంధ్రానువాదము: శ్రీమాన్ న.చ.రఘునాథాచార్యులు.

శ్రీవిష్ణుపంజరస్తోత్రమ్

.... శ్లో॥ ఉదరం పద్మనాభశ్చ పృష్ఠం చైవ తు **మాధవః** ॥ 5

శ్లో॥ వామపార్శ్వం తథా **విష్ణుర్దక్షిణం** మధుసూదనః ।
బాహూ వై **వాసుదేవశ్చ** హృది దామోదరస్తథా ॥ 6

శ్లో॥ కంఠం రక్షతు వారాహః **కృష్ణశ్చ** ముఖమండలమ్ ।
**మాధవః** కర్ణమూలే తు హృషీకేశశ్చ నాసికే ॥ 7 ...

శ్లో॥ జలే **విష్ణుః** స్థలే **విష్ణుర్విష్ణుః** పర్వతమస్తకే ।
జ్వాలామాలకులే **విష్ణుః సర్వం విష్ణుమయం జగత్** ॥ 36

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే ఇంద్రనారదసంవాదే శ్రీవిష్ణుపంజరస్తోత్రమ్.

4) **పద్మామనోజ్ఞ యావకపుష్పితశరీర!**
**పద్మసుందరనేత్ర! భావాంబరాతీత!**
**మాయాసతీభుజామధుపరీరంభావి**
**షయవివేక! హృషీకసంచయాధిష్ఠాత!**
**శౌరి! నీ తేజమే సంక్రమించెను నన్నుఁ**
**బూరించెఁదాండవముఁబూర్ణచిత్కళతోడ!**
**నని నిటాలమునందు హస్తమ్ములను మోగిచి**
**వినతుఁడై శంకరుఁడు విష్ణువును నుతియించి**
**యాడెనమ్మా! శివుడు**
**పాడెనమ్మా! భవుడు**

సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి 'శివతాండవము'(60) నుండి.

5) శ్లో॥ శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే ।
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః ।
– సంధ్యావందనం

ఏమాద్వైతభావమూ...



## 40

**అవతారిక :** 'భ్రమరకీట' న్యాయము ననుసరించి శ్రీకులశేఖరులుచేత ఈ 'ముకుందమాలా' కావ్యము రచింపబడినదని చెప్పదగును.

**శ్లో॥ యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ**
**మిత్రే ద్విజన్మవరపద్మశరావభూతామ్ ।**
**తేనామ్బుజాక్షచరణామ్బుజషట్పదేన**
**రాజ్ఞా కృతా కృతిరియం కులశేఖరేణ ॥ 40**

**పదవిభాగము :**

యస్య, ప్రియౌ శ్రుతి–ధరౌ కవి–లోక–వీరౌ,
మిత్రే, ద్విజన్మవర – పద్మశరౌ, అభూతామ్ ।
తేన, అమ్బుజాక్ష–చరణామ్బుజ–షట్–పదేన,
రాజ్ఞా, కృతా, కృతిః, + ఇయమ్, కులశేఖరేణ ॥

**అన్వయక్రమము :** యస్య ప్రియౌ శ్రుతి–ధరౌ కవిలోక–వీరౌ ద్విజన్మవర–పద్మశరౌ అభూతమ్ మిత్రే అంబుజాక్ష–చరణామ్బుజ–షట్పదేన తేన రాజ్ఞే కులశేఖరేణ ఇయం కృతిః కృతా.

**ప్రతిపదార్థము :**

యస్య = ఏ కులశేఖరాళ్వారులకు,
ప్రియౌ = ఇష్టులు,
శ్రుతి–ధరౌ = వేదార్థములను లెస్సగా నెఱిగినవారును

కవి–లోక–వీరౌ = కవులలో అగ్రగణ్యులు నగు
ద్విజన్మవర–పద్మశరౌ = ద్విజన్మవరుడు, పద్మశరుడు అను నిరువురు,
**అభూతామ్** = ఉన్నారో,
అంబుజాక్ష–చరణామ్బుజ–షట్పదేన = పుండరీకాక్షుని పాదకమలములకు తుమ్మెదవంటివాడగు
తేన = ఆ
రాజ్ఞా = మహారాజైన
కులశేఖరేణ = శ్రీకులశేఖరాళ్వార్లచేత
ఇయం కృతిః = 'ముకుందమాలా' యను కావ్యము,
కృతా = రచింపబడినది.

**తాత్పర్యము :** ఏ శ్రీకులశేఖరాళ్వార్లకు ఇష్టులు, వేదార్థములను లెస్సగా నెఱిగినవారును, కవులలో అగ్రగణ్యులునగు ద్విజన్మవర–పద్మశరులను నిరువురు ఉన్నారో, పుండరీకాక్షుని పాదకమలములకు తుమ్మెదవంటి వాడగు ఆ మహారాజునైన శ్రీకులశేఖరాళ్వార్లచేత **'ముకున్దమాలా'** యనుకావ్యము రచింపబడినది.

**పాఠాంతరాలు :** 1. మిత్రే – మిత్రౌ, 2. ...పద్మశరౌ – పార్శ్వచరౌ.

**విభక్తులు – క్రియలు – అవ్యయాలు :**

1. యస్య – **యస్య** – యయోః – యేషామ్, దకారాన్తః, పుంలిఙ్గో యచ్ఛబ్దః, ష.ఏ; 2. ప్రియౌ – ప్రియమ్ – **ప్రియౌ** – ప్రియాన్, అకారాన్తః పుంలిఙ్గః ప్రియశబ్దః, ద్వి.ద్వి; 3. అభూతామ్ – భూ సత్తాయామ్, భ్వాది, అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, లుఙ్, ప్ర.ద్వి; 4. రాజ్ఞా – **రాజ్ఞా** – రాజభ్యామ్ – రాజభిః, నకారాన్తః, పుంలిఙ్గో రాజన్‌శబ్దః, తృ.ఏ; 5. కులశేఖరేణ – **కులశేఖరేణ** – కులశేఖరాభ్యామ్ – కులశేఖరైః, అకారాన్తః, పుంలిఙ్గః, కులశేఖరశబ్దః, తృ.ఏ; 6. కృతిః (కృ క్తిన్) – **కృతిః** – కృతీ – కృతయః, ఇకారాన్తః, స్త్రీలిఙ్గః, కృతిశబ్దః, ప్ర.ఏ; 7. కృతా (కృ క్త) – **కృతా** – కృతే – కృతాః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, కృతాశబ్దః, ప్ర.ఏ.

**క్రియాదర్శము :** అభూతామ్ – లుఙ్ – ప్ర.ద్వి.

| | | |
|---|---|---|
| అభూత్ | **అభూతామ్** | అభూవన్ |
| అభూః | అభూతమ్ | అభూత |
| అభూవమ్ | అభూవ | అభూమ |

**ఛందస్సు :** 1. శక్వరీ, 2. **వసంతతిలకా**, 1వ శ్లోక వ్యాఖ్యానభాగము చూడుడు.

**భ్రమరకీటన్యాయము:** ధీ అంటే బుద్ధి... యానం అంటే ప్రయాణం... బుద్ధితో కలసి ప్రయాణించడమే ధ్యానం. తుమ్మెదలు తమచుట్టూ తిరిగే కీటకాలన్నింటికీ తమ లక్షణాన్నే ఆపాదిస్తాయి. దాన్నే **భ్రమరకీటన్యాయం** అంటారు.

**పదాదర్శము :** రాజ్ఞా – నకారాన్తః పుంలిఙ్గో **రాజన్** శబ్దః, తృ.ఏ.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. | రాజా | రాజానౌ | రాజానః | కర్తా |
| ద్వి. | రాజానమ్ | రాజానౌ | రాజ్ఞః | కర్మ |
| తృ. | **రాజ్ఞా** | రాజభ్యామ్ | రాజభిః | కరణ |
| చ. | రాజ్ఞే | రాజభ్యామ్ | రాజభ్యః | సమ్ప్రదాన |
| పంచ | రాజ్ఞః | రాజభ్యామ్ | రాజభ్యః | అపాదాన |
| షష్ఠీ | రాజ్ఞః | రాజ్ఞోః | రాజ్ఞామ్ | సంబంధ |
| సప్తమీ | రాజ్ఞ/రాజని | రాజ్ఞోః | రాజసు | అధికరణ |
| | హే రాజన్! | హే రాజానౌ | హే రాజానః | సంబోధన |

విభక్తులలో సంబోధనమును తెలుపు సంబోధనపు ప్రథమావిభక్తికిని, సంబంధమును తెలుపు షష్ఠీవిభక్తికిని, కారకములతో సంబంధము లేదు. అనగా సంబోధన సంబంధములు క్రియతో సమన్వయము కావు కనుక కారకములు కావు.

రాజృ దీప్తౌ, తస్మాత్ 'కనిన్ యువృషి' – ఇత్యుణాది సూత్రేణ కనిన్ ।
తతః రాజన్ శబ్దాత్సౌ ఉపధాదీర్ఘే సులోపే నలోపః.

శ్లో॥ రాజైవ కర్తా భూతానాం రాజా చైవ వినాయకః ।
రాజా సుప్తేషు జాగర్తి రాజా పాలయతి ప్రజాః ॥

శ్లో॥ రాజా కర్తా చ గోప్తా చ సర్వస్య జగతః పితా ।
రాజా కాలో యుగం చైవ రాజా సర్వమ్ ఇదం జగత్ ॥

శ్లో॥ నీత్యా సునీతయా రాజా ధర్మం రక్షతి రక్షితా ।
యదా న పాలయేద్రాజా క్షిప్రం నశ్యన్తి వై ప్రజాః ॥

శ్లో॥ ధారణాద్ధర్మ ఇత్యూహుః ధర్మేణ విధృతా ప్రజాః ।
యస్మాద్ధారయతే సర్వం త్రైలోక్యం స చరాచరమ్ ॥

శునక విషయమున శ్రీరాముని న్యాయవిచారణ శ్రీరాముని జూచి శునకుము పైవిధముగ విన్నవించుకొనెను.

**శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం**
**న్యాయేన మార్గేణ మహీం మహీశాః ।**
**గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం**
**లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు ॥**

**శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।**
**దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాస్సన్తు నిర్భయాః ॥**

**శ్లో॥ అపుత్రాః పుత్రిణస్సన్తు పుత్రిణస్సన్తు పౌత్రిణః ।**
**అధనాస్సధనాస్సన్తు జీవన్తు శరదాం శతమ్ ॥**

శ్రీః

– ఇతి సమాప్తమ్ –



రామోరా కృత 'మృణాళినీ'వ్యాఖ్య కుంభమాసమున పునర్వసు నక్షత్రమున్ను *13-02-2022, ఉదయం 9.02 ని॥లకు, ప్రారంభింపబడి, ఫాల్గున మాసమున భరణీనక్షత్రమున్న 07-03-2022, ఉదయం 10.10 ని॥లకు పూర్తి గావింపబడినది.*

# అకారాది శ్లోకానుక్రమణికా

శ్లో॥ కుమ్భే పునర్వసౌ జాతం కేరళే చోళపట్టణే ।
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖరమాశ్రయే ॥